మహారాష్ట్ర రైతుల
మహాపాదయాత్ర

వాని టెక్కల కష్టంబు లేనినాడు
సస్యరమ పండి పులకింప సంశయించు
వాడు చెమ్మటలోడ్చి ప్రపంచమునకు
భోజనము బెట్టు వానికి భుక్తి లేదు

- గుర్రం జాషువా

ఊరేగింపు

సమిష్టి
బాధల
సుదీర్ఘ శ్వాస

- అలిశెట్టి ప్రభాకర్

PRSUMORA191

సాహిత్య
ప్రస్థానం
ఏప్రిల్ 2018

సంపుటి : 17 సంపాదకీయం సంచిక : 4

# సాహిత్యరంగం విశాలం

తెలుగుకు సంబంధించి కేంద్ర సాహిత్య అకాడమీ సమన్వయకర్తలూ, సలహా సంఘాల ఎన్నికలూ నియామకాలు పూర్తయినట్టు మీడియా వార్తలు వెల్లడించాయి. కె. శివారెడ్డితో సహా పలువురు ప్రముఖులు బాధ్యతలు స్వీకరించడం సంతోషకరం. ప్రభుత్వ సంస్థలుగా అకాడమీలకు ఎన్ని పరిమితులున్నా ప్రజాధనంతో నడుస్తుంటాయి గనక వాటిని సద్వినియోగం చేసుకోవడం అవసరమే. తెలంగాణలో ఇప్పటికే సాహిత్య అకాడమీని పునరుద్ధరించారు. ఎపిలోనూ నాటక అకాడమీని మొదలు పెట్టి ఇంకా మిగిలిన వాటిని కూడా పునఃప్రారంభిస్తామంటున్నారు. 70వ దశకంలో వీటిపై చర్చ నేపథ్యంలో 80లలో ఎన్టీఆర్ ప్రభుత్వం రద్దు చేయడంపై రకరకాల అభిప్రాయాలున్నాయి. ఇక కేంద్ర సాహిత్య అకాడమీతో సహా అనేక సంస్థలలో మితవాద భావజాలం, పాలక వర్గ ప్రాబల్యం చుట్టుముడుతున్న పరిస్థితి. ఇలాటి స్థితిలో తెలుగుకు సంబంధించి ఎన్నికైన వారిలో ప్రగతిశీలులు చాలా మంది వున్నారు. సహజంగా పదవుల ప్రాపకాల కోసం పాకులాడే వారూ వుండనే వుంటారు. ఇటీవలి కాలంలో సాహిత్య కారులను సర్కారీ భజనకు ఉపయోగించుకునే ధోరణి బాగా పెరుగుతున్నది. అది చాలనట్టు సాహిత్యరంగంలోనూ కొన్ని సంకుచితత్వాలు కొనసాగుతుండటం దురదృష్టకరం. విశాల కోణంలో ఆయా సంస్థల వ్యక్తుల సేవల ఆధారంగా జరగాల్సిన ఎంపికలు తరచూ పాలకుల కనుసన్నల్లో జరిగిపోతున్నాయి. దీనివల్ల ఈ సంస్థల ప్రయోజనమే పరిమితమై వ్యక్తిగతమై పోయే ప్రమాదముంటుంది. ప్రజాస్వామిక లౌకిక విలువల వ్యాప్తిలోనూ నూతన సృజన శక్తులను ప్రోత్సహించడంలోనూ పాత వారసత్వాలు కొత్తగా తవ్వితీయడంలోనూ జరగాల్సింది చాలా వుంది. రెండు తెలుగు రాష్ట్రాలలోనూ నిర్దిష్టంగా జరగాల్సిన, కలిసి జరగాల్సిన అంశాలున్నాయి. సాహిత్య ప్రస్థానం పత్రిక, సాహితీ స్రవంతి సంస్థ మొదటినుంచి విశాల దృక్పథం విస్తృత ప్రాతినిధ్యం అన్న దృక్పథాలకు ప్రాధాన్యత నిస్తున్నాయి. ప్రగతివాదులందరినీ అక్కున చేర్చుకోవడమే గాక అనుభవాన్ని గౌరవిస్తూ, ఔత్సాహికులను ప్రోత్సహిస్తూ ఒక నూతన వాతావరణాన్ని తీసుకొచ్చాయి. ఎందుకంటే విశాల వరవడి ఒక్కటే సామాజిక శక్తులను బలోపేతం చేస్తుంది. సంకుచితత్వాలకు సమాధానమవుతుంది. ♦



రచనలు, చందాలు, వివరాలు, మనీ ఆర్డర్లు, చెక్కులు, డిడిలు పంపవలసిన చిరునామా:
సాహిత్య ప్రస్థానం, 27-30-4, ఎం.బి. విజ్ఞానకేంద్రం, 3వ అంతస్తు, ఆకులవారి వీధి, గవర్నరుపేట, విజయవాడ - 520002, ఫోన్: 0866-2577248, సెల్: 9490099059
ఇ-మెయిల్ : ssprasthanam@gmail.com, www.prasthanam.com

**కథలు**

ఎంతో చిన్నది జీవితం - మహీధర శేషారత్నం........ 12
జీవన సౌరభం - కావేరిపాకం రవిశేఖర్............... 33
ప్రమాదం - జి.ఎల్.ఎన్. ప్రసాద్...................... 49
ఆడపిల్ల - ఈతకోట సుబ్బారావు....................... 60

**కవితలు**

రీబోర్న్ - మార్టూరి శ్రీరామ్‌ప్రసాద్......................... 4
పొలం కాళ్ళు నగరానికొచ్చాయి - శ్రీరాం............... 11
గజల్ - ఎస్.ఆర్. పృధ్వీ.................................. 16
టమోటా రైతు - కిల్లాడ సత్యనారాయణ............... 17
వంగిన వరికంకు - మార్ని జానకిరామ్ చౌదరి....... 17
ఇప్పుడంతా... నీ చేతుల్లోనే ఉంది
- జడా సుబ్బారావు............... 21
విగ్రహాలు - డా॥ రావి రంగారావు....................... 25
దిక్సూచి - డా॥ కత్తి పద్మారావు........................... 26
రేడియో కట్ట - ఈ. రాఘవేంద్ర......................... 31
ఇంటి పాదాల వద్ద - పొనుగుమట్ల అశోక్‌కుమార్... 32
దహన వాటిక - రత్నాల బాలకృష్ణ..................... 32
పూల రెక్కల చప్పుడు - కటిక మనోహర్............... 35
నగరం - మల్లారెడ్డి మురళీమోహన్..................... 42
కన్నీటి లిపి - అమూల్యాచందు కప్పగంతు............ 44
నానీలు - నాగాంజనేయులు............................ 52
నేనేదొకటి రాస్తాను - బంగార్రాజు కంఠ............... 63

**వ్యాసాలు**

తమిళ నవయుగ ప్రవక్త సుబ్రహ్మణ్య భారతి
- డా॥ చల్లా రాధాకృష్ణ శర్మ..... 5
కడియాల రామమోహన్ రాయ్ ఇంటర్వ్యూ
- వొరప్రసాద్ ..................... 18
వీరేశలింగం ప్రహసనాలు - మూఢాచారాలపై ముష్టిఘాతాలు - డా॥ విజయ్‌భక్ష్............ 22
బ్రౌన్ నిఘంటు నిర్మాణ కృషి
- ఆచార్య మూలె విజయలక్ష్మి...................... 27
వర్తమాన సామాజిక కవితా చిత్రం
- రాచపాళెం చంద్రశేఖర రెడ్డి...................... 36
నులివెచ్చని నవత్వం - విల్సన్‌రావు కవిత్వం
- వై. హెచ్.కె. మోహన్‌రావు........................ 41
జీవిత వైచిత్రిని వెల్లడించే జ్వాలాముఖి కథలు
- ద్వా.నా. శాస్త్రి........................................ 43
ఇలా రువ్వుదామా రంగులు
- డా॥ జోశ్యుల కృష్ణబాబు........................ 45
ఆడపిల్ల అంతర్మథనం 'ఇట్లు ఆడపిల్ల'
- కెంగార మోహన్.................................. 53
సింగంపల్లి అశోక్‌కుమార్ ఇంటర్వ్యూ
- వొరప్రసాద్ ...................................... 55
డైరీ ..................................................64


**కవిత**

## రీబోర్న్


- మార్టూరి శ్రీరామ్ ప్రసాద్
9490455599




నేనేమీ పుట్టుకతో
కలం పట్టిన యోధుడిని కాదు
కాలమనే
జీవిత ప్రవాహంలో
కొట్టుకు పోకుండా
ఎదురొడ్డి నిలబడిన వాడ్ని
పుట్టుకతోనే మరక
అంటినవాడ్ని
మరక వదిలించు కోవటానికి
అక్షరమై ప్రవహించాలని
ఎన్నో కలల్ని
దగ్ధం చేసినవాడను
నాలో అక్షరం పుట్టిన నాడే
నేను మర్లా పుట్టాను
ఇది
నా మొదటి బొట్టే కావొచ్చు
నాలోని క్రోధం
అసహనం
ఆక్రోశం
ఆనందం
ఆకాంక్షలు సముద్రమై
ఉప్పొంగేంతవరకు
నేను అవిశ్రాంత యోధుడిని ♦



సుబ్రహ్మణ్య భారతి
**11.12.1882 - 11.09.1921**

# తమిళ నవయుగ ప్రవక్త సుబ్రహ్మణ్య భారతి

- డా॥ చల్లా రాధాకృష్ణ శర్మ
(1929-1998)

గేయ కవిగా, జాతీయ కవిగా, అభ్యుదయవాదిగా, మానవతావాదిగా సుప్రసిద్ధుడైన భారతి సామాన్యుడికి సైతం అర్థమయ్యే శైలిలో రచనా వ్యాసంగం చేసి సంప్రదాయ బద్ధమైన తమిళ సాహిత్యంలో కొత్త పుంతలు వేశాడు. చివరికి జటిలములైన తాత్విక రహస్యాలను కూడా సుందరమూ సుభోధకమూ అయిన వ్యావహారిక భాషలోనే వివరించాడు. అందువల్ల ఆయన రచనలకు ప్రబల ప్రచారం లభించింది. తమిళం, సంస్కృతం, ఆంగ్లం మొదలైన వాఙ్మయాలతో గాఢమైన పరిచయం ఉండడం వల్ల ఆయన రచనలలో సంప్రదాయపు బరువుతోపాటు నవ్యత కూడా కొట్టవచ్చినట్టు కనిపిస్తుంది.

తమిళ సాహిత్యంలో నవయుగం మహాకవి సుబ్రహ్మణ భారతితో ప్రారంభమయింది. నిజానికి ఆధునిక తమిళ సాహిత్యం అనగానే ఆయన పేరు స్ఫురణకు వస్తుంది. ఇది భారతి యుగమన్నా సాహసం కాదు.

గేయ కవిగా, జాతీయ కవిగా, అభ్యుదయవాదిగా, మానవతావాదిగా సుప్రసిద్ధుడైన భారతి సామాన్యుడికి సైతం అర్థమయ్యే శైలిలో రచనా వ్యాసంగం చేసి సంప్రదాయ బద్ధమైన తమిళ సాహిత్యంలో కొత్త పుంతలు వేశాడు. చివరికి జటిలములైన తాత్విక రహస్యాలను కూడా సుందరమూ సుభోధకమూ అయిన వ్యావహారిక భాషలోనే వివరించాడు. అందువల్ల ఆయన రచనలకు ప్రబల ప్రచారం లభించింది. తమిళం, సంస్కృతం, ఆంగ్లం మొదలైన వాఙ్మయాలతో గాఢమైన పరిచయం ఉండడం వల్ల ఆయన రచనలలో సంప్రదాయపు బరువుతోపాటు నవ్యత కూడా కొట్టవచ్చినట్టు కనిపిస్తుంది. నవ్యత పేరుతో సంప్రదాయాన్ని నిరసించని వాడు కనుకనే, భారతి ఎంత నవీనుడో, అంత ప్రాచీనుడు, పాత కొత్తల మేలి కలయికకు ఆయన రచనలు, ముఖ్యంగా కవితలు, మణి దర్పణాలై భాసిస్తున్నాయి. ఆధునిక యుగం వచన యుగ మనీ, అందులోనూ వాడుక భాషకు ఎంతో ప్రాధాన్యమున్నదనీ గ్రహించిన భారతీయ రచయితలతో భారతి ప్రముఖుడు. ఆయన వచన కవితలు కూడా వెలయించాడు. నేటికీ తమిళ రచయితలు పలువురు ఆయన వేసిన బాటలలో పయనించటం గమనించదగిన అంశం. విప్లవ కవిగా (పురట్టి క్కవిజర్) పేరు పెంపులు గడించిన భారతిదాసన్ ఆయన అనుయాయుడు! భారతి తమిళ నవయుగ ప్రవక్త!

భారతిది మానవతా దృష్టి కనుకనే, పామరులు సైతం చక్కగా అర్థం చేసుకునేలా, ఆయన తన భావాలను వ్యక్తం చేశాడు. విజ్ఞాన ప్రధానంగా కథలూ వ్యాసాలూ సంతరించాడు వాటిలో కొన్ని ఉబుసుపోకకు చెపుతున్నట్టుగా కనిపించినా, వాస్తవానికి అవి అలాంటివి కావు. పామరుల మనోభావాలకు అవి ప్రతిబింబాలు తమిళ భాషా శక్తి సంపన్నత ఆయనకి బాగా తెలుసు. సూటిగా, స్పష్టంగా ఉండే శైలిలో ఆయన రచనలు కావించాడు. అస్పష్టత, డొంక తిరుగుడు మొదలైనవి ఆయన ప్రకృతికి విరుద్ధం. ఆయన వ్యక్తిత్వంలా, భావ

వ్యక్తీకరణ పద్ధతి కూడా మనస్సుకి హత్తుకునేలా ఉంటుంది.

భారతి కవితల్ని దేశభక్తి కవితలు లేక జాతీయగీతాలు, స్తోత్రగీతాలు, తాత్త్విక గీతాలు, ఇతరములు అని స్థూలంగా విభజించవచ్చు. వాటికి గేయాంశం జీవం పోసింది. వందేమాతరం, స్వాతంత్ర్య దాహం, తమిళ భాషాస్తవం, ఛత్రపతి శివాజి, గురుగోవిందుడు, బాలగంగాధర్ తిలక్ మొదలైనవి జాతీయ గీతాలలోని కొన్ని కవితలు. వినాయకస్తవం, మురుగస్తవం, శివశక్తి, ప్రళయ తాండవం, నందలాలా, యేసుక్రీస్తు, అల్లా మొదలైనవి స్తోత్రగీతాలు. తాత్త్విక గీతాలలో భయం లేదు, జ్ఞానమే దైవం, ఆత్మజయం మొదలైనవి ఉన్నాయి. బాలగీతం, స్త్రీ స్వాతంత్ర్యం, కొత్త రష్యా మొదలైనవి యితరములు. ఇవికాక శక్తి, గాలి, సముద్రం మొదలైన వచన కవితలూ ఉన్నాయి. ఆయన ప్రకృతిని ప్రశంసించాడు, పరాశక్తిని ప్రస్తుతించాడు, సంఘంలోని వివిధ వర్గాల వారికీ స్వాతంత్ర్యం కావాలన్నాడు. స్త్రీలను నీచంగా చూసే మౌఢ్యాన్ని దుయ్యబట్టాడు. మనలో నెలకొన్న అంధవిశ్వాసాలను తూర్పారపట్టాడు.

భారతి ముమ్మూర్తులా జాతీయ కవి. దైవస్తుతి కావించినా అందులోనూ ఆయన దేశాభిమానమూ మానవతా దృక్పథం కానవస్తాయి. 'ఎన్ఱు తణియు మింద సుదందిర దాహం...' మొదలైన సుప్రసిద్ధ పాదాలు కృష్ణస్తోత్రంలోనివే. వాటిని పరికించండి.

*'ఎప్పుడు తీరు నీ స్వాతంత్ర్య దాహం*
*ఎప్పుడు మా తల్లి సంకెల లూడిపోవు*
*ఎప్పుడు మా యిక్కట్టులన్నీ తీరిపోవు?'*



భారతి ప్రదర్శించిన దేశాభిమానం విస్మరించరానిది. పెద్దల నుద్దేశించి కవిత చెప్పినా పిల్లలకోసం పాట పాడినా, ఆయన ప్రతి రచనలో దేశాభిమానం, మానవతాదృష్టి ప్రధానంగా కనిపిస్తాయి. ఆ జాతీయకవి దృష్టిలో కన్యాకుమారి మొదలుకొని కాశ్మీరం దాకా విస్తరిల్లిన యీ ప్రాచీన మహాదేశం-భారతదేశం- ఒక్కటి. ఈ సువిశాల దేశంలో నివసించే విభిన్న భాషలవారు, వివిధ మతాలవారు, వివిధ ప్రాంతములవారు ఒక్క జాతికి-అనగా భారత జాతికి-చెందినవారు. ఇంత విశాలమైన దృక్పథాన్ని ప్రదర్శించిన హేతువు వల్ల, ఆయన రచనలు నలుగురికి శిరోధార్యములైనాయి. కనుకనే జన్మించి నూరేళ్ళయినా, ఆయన నేటికీ ఆదరపూర్వకంగా సంస్మరించబడుతున్నాడు. ఆయన ఒకచోట అన్నాడు గదా: 'క్రైస్తవులైనా, పార్శీలయినా, మహమ్మదీయులైనా, ఎక్కడి నుంచి వచ్చి యే దైవాన్ని పూజించినా భారతదేశంలో పుట్టి, పెరిగి, యీ దేశాన్నే నమ్ముకున్నవారి నందరినీ భారతీయులుగానే భావించాలి, ఇది ఏక జాతి; విభజించరాని; నాశనం లేనిది.'

ప్రగాఢమైన యీ అభిప్రాయం కలవాడు కనుకనే, భారతదేశపు వ్యవహారాలలో ఇతరుల ప్రమేయాన్ని భారతి గర్హించాడు. మనలో ఐకమత్యం ప్రధానంగా నెలకొనాలని ఘోషించాడు.

'వందేమాతరం' అన్న గీతంలో భారతి యిలా స్పష్టం చేశాడు :

*'ఇచట కలవు జాతులెన్నో, అయినా*
*ఇతరులు చొచ్చుల ఏమి న్యాయం?*
*ఒక తల్లి కడుపున ఉదయించిన వారు*
*కలహించుకొనగా, కారా సోదరులు?*
*కలిసి వున్నప్పుడే కలదు జీవితం*
*కలియక తిరిగితే కలుగుతుంది పతనం*
*నెలకొనాలి యీ భావం స్థిరంగా*
*వలయునే ఆ తర్వాత వేరొకటి?'*

భారతి పేర్కొన్నట్లుగా, జాతీయ సమైక్యానికి ఐకమత్యం ఎంతైనా అవసరం, అవసరమే కాదు అభిలషణీయం కూడా. మన మందరం అన్న భావం నెలకొన్నప్పుడే ఒక జాతి ప్రగతిపథంలో పయనిస్తుంది. బహుశః ఈ భావాన్ని మనస్సులో ఉంచుకుని కాబోలు పిల్లలకోసం వ్రాసిన 'పాప్పాపాట్టులో' భారతి ఇలా అన్నాడు :

*'పరిగెత్తి ఆడాలి పాపా-నువ్వు*
*బద్ధకం మానాలి పాపా*
*కలిసి మెలిసి ఆడాలి పాపా-ఎవ్వ*
*రిని ఏమి అనబోకు పాపా.'*

వరుగులు తీస్తూ, గంతులు వేస్తూ ఆడడం బాలబాలికలకు అలవాటే. అయితే కలిసిమెలిసి ఆడాలి; ఆర్థికపరమైన, కులమత పరమైన హెచ్చుతగ్గులు పూర్తిగా మరిచిపోయి కలిసిమెలిసి ఆడాలి. అనగా, భేదభావాలు విస్మరించి అందరితో కలిసిమెలిసి ఆడాలి. అప్పుడే ఆడే ఆటలో హాయి ఉంటుంది.

*'భారత జాతి వర్ధిల్లాలి*

ముప్పయికోట్ల జన సమూహం
సమగ్రత కిది ప్రతిరూపం
సాటి యెరగని జన సమూహం
జగతికే యిది అపురూపం!
....        ....       .....
అందరూ భారతదేశీయులు
అందరూ సమానులు, సమధర్ములు
అందరూ ఈ దేశపు రాజులు
మన మందరం ఈ దేశపు రాజులం...'

అని 'భారత జాతి' అనే గేయంలో భారతి పేర్కొన్నాడు, ఎప్పటికైనా భారతదేశంలో ప్రజాస్వామ్యం నెలకొనగలదని విశ్వసించాడు కనుకనే, ఆయన 'మనమందరం ఈ దేశపు రాజులం' అని సహేతుకంగా పేర్కొన్నాడు. ఈ గేయంలో కూడా ఆయన అఖండ భారతాన్నే ఊహించాడు (ఆయన రోజుల్లో మన దేశపు జనాభా ముప్పయికోట్లు, తెలుగు జాతీయ కవులు కూడా తమ గేయాల్లో ముప్పయికోట్లనే ఉదహరించారు). బంకించంద్ర చటోపాధ్యాయ వ్రాసిన వందేమాతరం గీతాన్ని భారతి జాతీయగీతం అనే పేరుతో తమిళం చేశాడు. వంగమూలంలో ఏడు కోట్లమంది అని ఉండగా భారతి దాన్ని ముప్పయి కోట్లుగా మార్చాడు. ఏడు కోట్లు అన్నప్పుడు వంగదేశాన్ని మాత్రమే తెలియజేసినట్లవుతుంది. ముప్పయికోట్లు అని భారతి తన అఖండభారత వాదాన్ని మరో సారి బలపరిచాడు.

బహుభాషా నిలయమైన మన దేశంలో వివిధ ప్రాంతాలవారు ఎలా కలిసి మెలిసి సంచరించాలో ఎలా ఒకరి నొకరు గౌరవించుకుంటూ జీవించాలో ఆ వైనం మధురమనోజ్ఞంగా తెలియ జేశాడు భారతి 'భారతదేశం' అనే సుప్రసిద్ధ గీతంలో.

'సింగళదీవికి సేతువు కట్టేము
సేతువు నేమో వీధిగ తీర్చేము
వంగదేశపు మిగులు నీటితో
మధ్యదేశంలో పైరు చేసేము.
సింధునదిని పండు వెన్నెలలో
చేరదేశపు వయసు కన్నెలతో
తేట తెలుగున పాట పాడుతూ
పడవ నడిపి తిరిగి వచ్చేము.
గంగాతీరపు గోధుమ పంటకు
కావేరి తమలపాకులు ఇచ్చేము
సింహతుల్యులు మహారాష్ట్రుల కవితకు
చేరదేశపు దంతం బహూకరించేము.
కాశీ పండితులు చేసే చర్చలు
కంచిలో వినిపించేలా చేసేము
రాజపుత్ర వీరాగ్రణులకు
కన్నడపు బంగారం కానుక ఇచ్చేము.

ఆ రోజుల్లో భారతిలా ఈ విధంగా భావించిన మరో కవి లేడనడం అతిశయోక్తి కాదు. కన్యాకుమారి నుంచి కాశ్మీరం అనే మధురభావాన్ని ఇలా కవితామయంగా చేసి చెప్పిన ఖ్యాతి భారతికే దక్కుతుంది. ఆ మహాకవి దృష్టిలో అఖండ భారతమే తప్ప అన్యం లేదు. ఏ ప్రాంతంలో లభించే సంపద ఆ ప్రాంతానిదే అనే సంకుచితమైన తత్వం అవలంబించ లేదు, నా చిన్నిబొజ్జకు శ్రీరామరక్ష అనే మనస్తత్వానికి ఆయన ప్రకృతి పూర్తిగా విరుద్ధం. ఈ రోజుల్లో మనం అదేపనిగా జాతీయసమైక్యం, భావసమైక్యం అంటూ వేదికలమీద ఘోషిస్తున్నాము. ఆచరణలో అంతగా స్పష్టం కాకపోయినా. కాని భారతి ఈ భావాన్ని రసబంధురంగా, మధురమోహనంగా తెలియజేశాడు. మనమందరం అన్నభావం నాడు నేడూ ఎన్నటికి కూడా మనకందరికి తారకమంత్రం.

సుబ్రహ్మణ్యభారతి, మామూలు కవులవలె, ఊహాప్రపంచంలో విహరించినవాడు కాదు. యధార్థ ప్రపంచాన్ని గుర్తించినవాడు. అందువల్లనే ఆనాటి రాజకీయచైతన్యం ఆయన నరనరాలలోనూ వ్యాపించింది. తత్ఫలితంగా స్వాతంత్ర్యేచ్ఛ, దేశాభిమానం సహజంగా కల భారతివంటి విప్లవకవి నిమ్మకు నీరెత్తినట్లుగా కూర్చోలేకపోయాడు. దేశభక్తి ప్రబోధాత్మకములైన గీతాలు సంతరించాడు. స్వాతంత్ర్యం మానవుని జన్మహక్కని లోకమాన్య బాలగంగాధర్ తిలక్ వంటి మహనీయుడు చేసిన సింహగర్జన భారతి హృదయసీమలో ప్రతిధ్వనించింది. ఆయన రాజకీయ భావాలకు స్పష్టమైన ఒక ఆకృతిని కల్పించిన కర్మవీరుడు లోకమాన్యుడు. ఆయన్ని 1907లో భారతి సందర్శించాడు.

ఇలా ఉండగా, ఆనాటి ప్రభుత్వం పంజాబు కేసరిగా పేరు పెంపులు గడించిన లాలా లజపతిరాయిని బర్మాకి పంపించింది. స్వాతంత్ర్యం జన్మహక్కని ఘోషించిన తిలక్ మహాశయుని కారాగృహంలో బంధించారు. ఓడనడిపిన తమిళు

డుగా ప్రథిత యశస్కుడైన చిదంబరం పిళ్లైని చెరసాలలో బంధించారు. ఈ జాతీయనాయకులంటే భారతికి మహాగౌరవం. కాగా, గోపాలకృష్ణగోఖలే, చిదంబరం పిళ్లై, తిలక్, లజపతిరాయి మొదలైన ప్రముఖుల్ని గురించి భారతి చక్కని కవితలు వెలయించాడు.

గాంధీజీని ప్రస్తావిస్తూ 'మహాత్మాగాంధి పంచకం' వ్రాశాడు భారతి, అస్వతంత్రమైన భారతాన్ని బ్రతికించడానికి అరుదెంచిన మహాత్మా! నువ్వు వర్ధిల్లాలి.. అంటూ ఆయన ప్రశంసించాడు. గురు గోవిందసింహుని గురించి 204 పాదాల దీర్ఘ కవిత వ్రాశాడు. గాంధీజీని గురించి గేయాలూ కవితలూ వెలయించిన కవులు ప్రతి భాషలోనూ ఉన్నారుగాని, గురుగోవింద సింహుని ప్రతిభా విశేషాధిక్యాన్ని గుర్తించి ప్రస్తుతించిన కవులు మాత్రం లేరనవచ్చు. నాలుగు వృత్తాలలో దాదాభాయ్ నౌరోజీని ప్రశంసించాడు.

ఇలా జాతీయ నాయకుల ఘనతను గుర్తించడమేకాక, మన జాతీయ గౌరవాన్ని ఇనుమడింపజేసిన ఛత్రపతి శివాజి వంటి ప్రముఖుల్ని ప్రస్తుతించాడు భారతి. వివేకానందస్వామి, సోదరి నివేదితాదేవి, తాయుమానవర్ వంటి మహనీయులకు నివాళులర్పించాడు. నవ్యాంధ్ర నిర్మాతలలో ప్రముఖుడైన కందుకూరి వీరేశలింగం పంతులుపట్ల ఆదరభావం ప్రకటించినట్లే, సుప్రసిద్ధ చిత్రకారుడైన రవివర్మను ఆయన బహుధా ప్రశంసించాడు. ఇలా వివిధ ప్రాంతాలకు చెందిన ఆనాటి మహనీయుల్ని తన రచనలలో ప్రశంసించిన భారతిలో నెలకొన్న జాతీయతాదృక్పథం ఎంతైనా కొనియాడదగింది. ప్రసిద్ధ దేశభక్తుడూ తమిళ విద్వాంసుడూ ఆయన చిదంబరం పిళ్లై, సంగీత శాస్త్రజ్ఞుడూ ఆంధ్ర ద్రవిడ భాషాపండితుడూ అయిన సుబ్బరామదీక్షితర్, 'తమిళతాత'గా ప్రసిద్ధికెక్కిన మహామహోపాధ్యాయ సామినాథయ్యరు, ఎట్టయపురం జమీందారూ సారస్వత లోలుడూ వెంకటేశ రెట్టప్ప భూపతి మొదలైన తమిళ ప్రముఖుల్ని కూడా భారతి సముచితరీతిని ప్రస్తుతించాడు.

భారతిలో అన్యమత సహనం కూడా అతి స్పష్టంగా కనిపిస్తుంది. జాతీయతా దృక్పథంవల్ల ఆయనలో కలిగిన సత్ఫలితంగా దీన్ని అభివర్ణించవచ్చు. పరాశక్తినీ కాళినీ కన్నయ్యనూ ఆయన బహువిధాలుగా కీర్తించాడు. కన్నయ్యనైతే తన తల్లిగా, తండ్రిగా, మిత్రునిగా ప్రియునిగా చివరికి ప్రేయసిగా ఇలా బహురూపాలలో భావించుకుని ఎన్నో గీతాలు ఆలపించాడు. అలాగే యేసుక్రీస్తునీ అల్లానీ ఆయన భక్తి పూర్వకంగా స్మరించాడు. సిక్కుమత స్థాపకుడైన గురుగోవిందసింహుని ప్రస్తుతిస్తూ ఆయన జ్ఞానసింధువనీ మధుర గాయకుడనీ, మిన్ను విరిగి మీద పడినా చలించని వీరవరేణ్యుడనీ వర్ణించాడు. ధరణిని కాపాడిన గురుగోవిందసింహుడనీ వర్ణించాడు. ఆయనపట్ల భారతికి అపారమైన ఆదరభావం ఉన్నట్లు ఈ కవిత స్పష్టం చేస్తుంది.

తమిళ భాషాసాహిత్యాలంటే భారతికి ఎనలేని ఆదరాభిమానాలు ఉండడం సహజం. అయితే ఆ అభిమానం అన్యభాషాద్వేష రహితమయింది. అందువల్లనే ఆయన జాతీయతాదృక్పథంలో మచ్చ యేర్పడలేదు. తెలుగు భాషను 'సుందర తెలుంగు' అని అభివర్ణించాడు. అందమైన తెలుగని ఆయన అభిప్రాయం. మరాఠీ కవితను గ్రహించి, అందుకు బదులుగా వారికి కేరళదేశంలోని ఏనుగుదంతాలను బహూకరించాలని అన్నాడు. ఇలా ఇతర భాషలలోని మాధుర్యాన్ని గ్రహించి, దాన్ని నలుగురికి తెలియజేయడానికి భాషాసహనం కావాలి. అది భారతిలో పుష్కలంగా ఉన్నది.

భారతి దృక్పథం సువిశాలమయిందని చెప్పడానికి మరొక ప్రబల సాక్ష్యం అయన రష్యాను గురించీ బెల్జియం గురించీ కవితలు వ్రాయడమే. ఆ రోజుల్లో అంతర్జాతీయాలను గురించి కూడా రచనలు చేసిన కవుల్ని దృష్టిలో ఉంచుకుని చూస్తే, భారతి విశిష్టత ప్రస్ఫుటమవుతుంది. ఇలా రచనలు చేసిన వారి సంఖ్య అత్యల్పం. ప్రపంచంలో ఏ మూల ఎవరు స్వాతంత్ర్యం సంపాదించినా, అది చూసి ఎంతగానో మురిసిపోయాడు భారతి. ఆయన హృదయం అహర్నిశలూ స్వాతంత్ర్య దాహంతో నిండివుండేది.

స్వాతంత్ర్యం కోసం ఇంతగా పరితపించిన భారతికి రష్యా దేశపు జార్ చక్రవర్తి పతనం ఎంత సంతోషం కలిగించిందో మనం ఊహించుకోవచ్చు. పుదియా రుషియా (కొత్త రష్యా) అనే కవిత ఒకటి ఆయన వ్రాశాడు. జార్ చక్రవర్తి మూఢుడనీ, అతను హిరణ్యకశిపుని వంటి వాడనీ, భారతి పేర్కొన్నాడు. 'ఇమ్మెన్రాల్ సిరైవాసం, ఏనెన్రాల్ వనవాసం' (అం అంటే కారాగారవాసం, ఎందుకని ప్రశ్నిస్తే వనవాసం) – అలా సాగిందట ఆ దుష్ట ప్రభువు పరిపాలన బెల్జియం స్వతంత్రదేశమైనప్పుడు, దాన్ని ఆశీర్వదిస్తూ 'బెల్జియం నాట్టిర్కు

వాళ్తు' అని 36 పాదాల కవిత చెప్పాడు భారతి.

పాత కొత్తల మేలికలయికను వాంఛించిన భారతిలోని దేశాభిమానం నిరుపమానం. ధరణిలో మంచిదేశం మన భారతదేశం అని ఆయన అభిప్రాయం. ఈ అభిప్రాయాన్ని ఆయన కొన్ని కవితలలో వ్యక్తం చేశాడు కూడా. 'మనదేశం' అనే కవితలో..

'భారత వీరులు వరలిన దేశం
మునులెందరో నివసించిన దేశం
నారదగానం వినిపించిన దేశం
మంచిని ఎప్పుడు పెంచే దేశం
తీరని జ్ఞానం భాసించిన దేశం
బుద్ధుని కరుణా పొంగిన దేశం
భారత మెంతో పురాతన దేశం
పొడెద మెప్పుడు దాని ప్రశస్తిని.'

కాగా, సుబ్రహ్మణ భారతి ప్రదర్శించిన జాతీయతా దృక్పథం విశాలమైనదనీ, ఆయన స్వభాషాభిమానం అన్యభాషా దూషితం కాదనీ, అలాగే ఆయన చూపిన పరమత సహనం ప్రశంసార్హమనీ చెప్పడం చర్విత చర్వణమే అవుతుంది.



"వర్ధిల్లాలి వర్ధిల్లాలి తమిళం
వర్ధిల్లాలి నిరంతరం"

అని తమిళభాష వర్ధిల్లాలంటూ ప్రప్రథమంగా చెప్పిన తమిళ కవి సుబ్రహ్మణ్యభారతి. ఆయనే 'వాళియ భారత మణిత్తిరునాడు" (వర్ధిల్లాలి శ్రీలుపొంగే భారతం) అని కూడా అన్నాడు. అఖండ భారత దేశాన్నే భావించిన భారతి ఇతరులను, ఇతర భాషలను ఆదర పూర్వకంగా అభిమానించడంలో ఆశ్చర్యం లేదు, అన్యభాషా ద్వేషంలేని ఆ జాతీయ కవి చేసిన ఆంధ్ర ప్రశంసను పరిశీలిద్దాం.

భారతి దృష్టిలో తెలుగు సుందరమైన భాష, "భారతదేశం" అనే 13 చరణాల గేయంలో తెలుగుభాషా సౌందర్యాన్ని ఇలా ప్రశంసించాడు.

" సిందు నదియిన్ మిశై నిలవినిలే
చేర నన్నాట్టిళం పెణ్‌గళుడనే
సుంథర తెలుంగినిల్ పాట్టిశెత్తు
త్తోణిగళోట్టి విళై యాడివరువోం,"
సింధునదిని పండు వెన్నెలలో
చేర దేశపు వయసు కన్నెలతో
తేట తెలుగులో పాట పాడుతూ
పడవ నడిపి తిరిగి వచ్చేము.

భారత దేశపు పతాకాన్ని ప్రస్తుతిస్తూ ఆయన 'తాయిన్ మణిక్కొడి పారీర్" (మాతృ పతాకను పరికించండి) అనే పది చరణాల గేయంలో ఇలా పేర్కొన్నాడు.

'చెందమిళ్ నాట్టు ప్పొరునర్-కొడుం
తీక్కణ్ మఱవర్‌గళ్, చేరత్తన్ వీరర్
చింద్రై తుణిన్ద తెలుంగర్-తాయిన్
సేవడిక్కేపణి సెయ్‌దిడు తుళువర్"
పాండ్యదేశపు వీరయోధులు
అరుణనేత్రులు చేరవీరులు
స్థిరచిత్తులు తెలుగువారును
మాతృసేవకు కదిలివచ్చిరి.

1916 జులై 10న 'కాళిదాసన్" అనే నామాంతరంతో భారతి "సిలకవియరశర్" (కొందరు కవిరాజులు) అనే ఒక చక్కని వ్యాసం వ్రాశాడు. అందులో ఆంధ్ర మహాభాగవతకర్త అయిన బమ్మెర పోతనను ఉదహరించాడు.

ఆ భక్త కవితోపాటు కవి చక్రవర్తి బిరుదాంకితుడు కంబ కవిని, తమిళ వేదకర్త తిరువళ్ళు వరుని, తమిళ కావ్య పంచకంలో ఒకటైన "సిలప్పది కారం" వ్రాసిన ఇళంగో అడిగళుని (పూజ్యపాదులు) ఉదాహరించాడు.

తమిళ భాషను కొనియాడుతూ ఒక గేయంలో ఆయన ఇలా అన్నాడు. 'మే మెరిగిన కవులలో కంబుడు, వళ్ళువరు ఇళంగోలవంటి కవులు లోకంలో మరెచ్చటా ప్రభవించలేదు" అని.

అలాంటి భారతి తాను మెచ్చిన తమిళ కవులవరుసలో తెలుగు కవి పోతనను చేర్చడం గమనించదగిన విషయం.

"తెలుంగ మగాసబౌ" అనే శీర్షికతో 1917 జూన్ 9న "శక్తిదాసన్" అనే లేఖినీ నామంతో ఒక ప్రశస్త వ్యాసం వ్రాశాడు భారతి. రాజనీతి శాస్త్రంలో ఘటికులైన తెలుగువారిని ఆయన కొనియాడిన తీరు ముఖ్యంగా పరిశీలించదగింది. తెలుగువారంటే ఆ మహాకవికి ఎంత సదభిప్రాయం ఉండేదో ఆ వ్యాసం స్పష్టం చేస్తుంది. అందులో నుంచి కొన్ని భాగాలు యథాతథంగా ఉదాహరిస్తున్నాను.

"గత శుక్రవారంనాడు (జూన్ 1) నెల్లూరులో జరిగిన

ఆంధ్ర మహాసభా సమావేశంలో సభాధ్యక్షులు శ్రీ కొండా వెంకటప్పయ్య పంతులు చేసిన ఉపన్యాసం గమనించదగింది. రాజనీతి శాస్త్రంలో తెలుగువారికి గల ప్రావీణ్యం బహు ప్రాచీనమయింది. పాటలీపుత్ర నగరంలో వర్ధిల్లిన ఆంధ్ర రాజ్యమూ, తరువాతి కాలంలో తమిళనాడును పరిపాలించిన విజయనగర సామ్రాజ్యమూ పేర్కొనదగినవి. తెలుగువారు తమిళుల్ని పరిపాలించిన చిహ్నాలు మన భాషలోనూ, నిఘంటువులలోనూ చెరగని ముద్రలుగా నిలిచిపోయాయి. మన సంగీత నాట్య శాస్త్రాలు కూడా నేటి వరకు తెలుగులోనే మునిగివున్నాయి మన గాయకులు పాడే కీర్తనలలో ఉత్తమమైనవి తెలుగు కీర్తనలే.

దేవదాసీలు నాట్యం చేసేటప్పుడు పాడే వర్ణములూ, జావళీలు మొదలైన వాటిలో కూడా రుచికరమైనవి తెలుగు భాషలోనివే. మన గ్రామాలలో నివసిస్తున్న తెలుగు రెడ్లు, నాయుళ్ళు, తెలుగు బ్రాహ్మణ పురోహితులు తెలుగు దేవదాసీలు రాయలవారి కాలంలో ఇక్కడికి వచ్చి స్థిరపడిన వారే.

మన వివాహ సమయంలో పాడే పాటా లాలీ మొదలైనవన్నీ కూడా తెలుగు వారి సంప్రదాయానికి చెందినవే...

తెలుగు వారి యేలుబడిలో తమిళదేశంలో అధర్మం అన్నది లేదు. తమిళులకు ఒక న్యాయమని, తెలుగువారికి మరొక న్యాయమని వుండేదికాదు. తెలుగు జాతి రాజనీతిశాస్త్రంలో ఆరితేరిన జాతి... తెలుగు వారికి తాము తెలుగు భాషకు చెందిన వారమనే నిజమైన అభిమానం ఉన్నట్టుగా తమిళులలో తమిళంపట్ల ఆ అభిమానం లేదు. పాఠశాలల్లో బోధించబడే అన్ని విషయాలు తమిళంలో బోధించేందుకు ప్రయత్నం చేసేవాడే తమిళభాషాభిమాని..'

భారతి చంద్రికైయిన (చంద్రిక కథ) అనే అసంపూర్ణ రచన చేశాడు. ఇది సాంఘిక నవల. ఇందులో నవ్యాంధ్ర నిర్మాత కందుకూరి వీరేశలింగం పంతులూ, ఆయన సహధర్మిణి రాజలక్ష్మమ్మ ప్రముఖ పాత్రలు.

బాల వితంతువైన విశాలాక్షి చెన్న పట్టణంలో ఆనాటి ప్రముఖుల్లో ఒకరైన జి. సుబ్రహ్మణ్య అయ్యర్ సహాయాన్ని అర్థిస్తుంది. మళ్ళీ వివాహం చేసుకోవాలనే ఉద్దేశంతో. అయ్యరుగారు తమిళ దినపత్రికలలో మొట్టమొదటిదైన "సుదేశమిత్రన్" స్థాపకులూ, సంపాదకులూను, వీరేశలింగం పంతులుగారి సహాయం కోరవలసిందిగా ఆయన విశాలాక్షికి చెబుతూ ఇలా అన్నారు; "రాజమహేంద్రపురంలో నా స్నేహితుడు ఒకాయన ఉన్నాడు. ఆయన పేరు వీరేశంలింగం పంతులు. విధవా వివాహాల విషయంలో ఆయన శ్రద్ధగా కృషి చేస్తున్నారు."

వీరేశలింగం పంతులు ఇంట్లో విందు... అనే అధ్యాయంలో కందుకూరి దంపతులు ప్రముఖంగా కనిపిస్తారు. కథలో పంతులుగారి ప్రశంస అక్కడక్కడ కనిపిస్తుంది. కాగా, కందుకూరి వారంటే భారతికి ఎనలేని ఆదరభావమనవచ్చు. "మీకు తెలుగు వచ్చునా?" అని పంతులుగారు తెలుగులోనే విశాలాక్షిని అడిగినట్టుగా కూడా భారతి ఒక చోట పేర్కొన్నాడు.

తిరునెల్వేలి జిల్లాలోని ఎట్టయపురంలో జన్మించిన సుబ్రహ్మణ్య భారతికి తెలుగు వచ్చునని చెప్పవచ్చు. ఎట్టయపురం మహారాజు అయిన జగదీశ్వర రామకుమార ఎట్టప్ప హూణాంధ్ర ద్రవిడ భాషలలో అతి సమర్థులు. ఆయన ప్రోత్సాహంతో ప్రసిద్ధ సంగీత శాస్త్రజ్ఞులు సుబ్బరామదీక్షితులు కవిత్రయం వారి భారతాన్ని తమిళం చేశాడు, దీక్షితులపట్ల భారతికి అపారమైన గౌరవం. అది పురస్కరించుకుని భారతి "సుబ్బరామ దీక్షితర్" అనే ఒక కవిత వెలయించాడు. ఆయన వద్ద భారతి తెలుగు నేర్చుకుని ఉండవచ్చు.

1921 సెప్టెంబర్ 11న భారతి కాలధర్మం చెందాడు.

ఆయన దహనసంస్కారం గురించి ఒక తమిళ రచయిత ఇలా వ్రాశాడు. "భారతి మరణవార్త తెలియగానే శ్రీయుతులు పుదుచ్చేరి శ్రీనివాసాచారి, తిరుమలాచారి, హరిహరశర్మ ప్రభృతులు ఆన ఇంటికి వచ్చారు. దహనసంస్కారం జరిగేందుకు ముందు శ్రీయుతులు శర్కరై సెట్టియార్, కృష్ణస్వామి శర్మ, రామచంద్ర అయ్యర్ ప్రభృతులు తమిళంలోనూ, సురేంద్రనాథ్ ఆర్యా తెలుగులోను ఉపన్యసించారు. ఆ తర్వాత భారతి రచించిన గీతాలు ఆలపించారు...'

తెలుగు భాషా సాహిత్యాలను, తెలుగువారినీ ఎంతగానో అభిమానించిన జాతీయ కవి సుబ్రహ్మణ్య భారతి, భాషాభేదాలు, ప్రాంతీయ భేదాలు మొదలైనవి నానాటికీ ఎక్కువవుతున్న ఈ రోజులలో భాషాదురభిమానం మచ్చుకైనా లేని భారతి ఆదర్శపురుషుడనడం అత్యుక్తికాదు!

మన సాహిత్య చరిత్రలోనేకాక దేశచరిత్రలోనూ స్థానం సంపాదించుకున్న ఆ మహాకవికి జోహారులు అర్పించడం మన ధర్మం!

*(కీ॥శే॥ చల్లా రాధాకృష్ణ శర్మ 'తమిళవిందు' పుస్తకం నుండి)* ♦



# పొలం కాళ్ళు నగరానికొచ్చాయి

- శ్రీరాం
9963482597

ఒకటిగా పారేందుకు
రెండు నదులు కలసి చెరిపేస్తున్న
మట్టి మనుషుల ఆనవాళ్ళని
ఎర్రటి అగ్ని పూలుగా తలలకెత్తుకుని
బుల్లెట్ రైలు పట్టాలు మింగేస్తున్న
కలల సాగుబడి పురాతన దేహాన్ని
వెన్నెముక్కి వేడుకగా తగిలించుకుని
కాలుతున్న
నల్లటి తార్రోడ్డు ఎండ మీద
బక్క పల్చటి దు:ఖమొకదాన్ని
దర్జాగా తలపాగాలా చుట్టుకుని
పొలం కాళ్ళు నగరానికొచ్చాయి
విత్తనాల్లాంటి అడుగులేస్తూ
ఆ అరికాళ్ళ చెమ్మలో
ఒక్కొక్క రక్తపాదాన్ని చిగురిస్తూ
కలత నడకంతా దగా పడి
రంగువెలిసిన కన్నీటి వానలా కురుస్తూ
పంట పాదముద్రలు
పట్నం కూడలిలో నిలబడ్డాయి

ఆ పాదాలు
ఉదయాస్తమయాల తీరిక మీది నడకలా రాలేదు
పాల పొదుక్కి దూరంగా
గొంతెండిపోయిన లేగ దూడ దాహపు పాటను
నెమ్మదిగా పాడుతూ వచ్చాయి
తోడు పెరిగిన అడవి బయట
దిసమొలేసుకున్న ఒంటరి విలుకాడి పదునుదేలిన బాణాన్ని
భుజానేసుకుని వచ్చాయి
ఆ నాగేటి చాళ్ళు,
గొంతెత్తి ఒక్క మాట మాట్లాడవు,
హక్కుల దండకమూ చదవ్వు,
అప్పుల దారుణమూ చెప్పవు, అవి
రాజ్యం అరాచక గతుకుల దారంతా నడచి
బొబ్బలెక్కిన పాదాల్ని గాలికారబెట్టుకుంటాయి
నిరసన నిశ్శబ్దాన్ని నగరమంతా పరచి
వాసనేస్తున్న చెమట అలసట తీర్చుకుంటాయి.

కల్లంలో పచ్చి బాలింతను తీసుకుని
చెవులకే చెప్పుడు గాలీ సోకకుండా,
చావిట్లోని ఆవూ గేదేలకి,
ఎవ్వరికీ మాట మాత్రం చెప్పకుండా,
కనీసం చెప్పులైనా తొడుక్కోకుండా,
భూసేకరణ సింహాసనం వేసుకున్న
రాజుగారి ఏసీ సభ ఇంటిముందు
పంచనామ రిపోర్ట్ కావాలని
శవాన్ని ముందు పడుకోబెట్టుకుని
రొమ్ములెండిపోయిన పొలం
నిఘా యంత్రాల నడిమధ్యలో
ఎర్రటి ప్రశ్నల సమూహంలా కూర్చుంటుంది.
నిత్యం దగ్ధమయ్యే
శ్మశాన వైరాగ్యంలాంటి నగరానికిప్పుడు
తన మట్టి చేతుల్ని తనలోనే సమాధి చేసుకుని
ఆ చేతుల్తోనే గుండెలపై
పిల్లల్నాడిస్తున్న పొలం అమ్మతనం
రహస్య వర్తమానంలా వినబడుతుంది
ఆకలి దీర్చేవాడే దేవుడని గుర్తొస్తుంది
పొలం పాదాల్ని కళ్ళకద్దుకోవాలనిపిస్తుంది

ధనవంతుల్తో పేదదైన దేశానికి
వేలు పట్టి అన్నం తినిపించే వాడి
పాద యాత్రలో.... ఇప్పుడు
నాగళ్ళు నడచిన దూరమంతా
భూమిని ముద్దాడే
పెదాలకున్న దగ్గరితనంలా కనిపించింది.
నగరం
ఇప్పటికైనా పొలాన్ని దగ్గరికి తీసుకోవాలి
హత్తుకుని గట్టిగా ముద్దు పెట్టుకోవాలి.

◆

# ఎంతో చిన్నది జీవితం

మహీధర శేషారత్నం



ఆ వేళ పౌర్ణమి. వెండి వెన్నెల భూమ్యాకాశాలను ఏకం చేస్తూ వర్షిస్తోంది. చెట్ల ఆకులు వెన్నెల స్నానం చేస్తూ మురిసిపోతున్నాయి. పిల్లగాలి సంతోషంగా చెట్లను పలకరించి పోతోంది. గాలి తాకిడికి చెట్లు సిగ్గు సిగ్గుగా కదిలిపోతున్నాయి.

రోజూ ఆ సమయానికి భోజనం పూర్తిచేసి గదిలో రాసుకుంటూ కూర్చునే కృష్ణమూర్తి పౌర్ణమికి మాత్రం ఆరుబయట మంచం వేసుకుని ఆకాశంలోకి తదేకంగా చూస్తూ వెన్నెలను ఆస్వాదిస్తూ ఉంటాడు. అతని మనసు పరవశిస్తూ ఉంటుంది. భార్య రుక్మిణి దృష్టిలో ఇదొక వెర్రి.

"ఏమిటో ఈయన... దోమల కుట్టవూ!" అంటుంది సాగదీస్తూ.

పెళ్ళైన కొత్తలో రుక్మిణిని కూడా ఆ ప్రపంచంలోకి లాగాలని చూసాడు. కాని ఒకటి రెండు సార్లు మొహమాటానికి కూర్చుని దోమలు కుడుతున్నాయని, కాలవలో నుండి మురికి వాసన అని బయటికి రావడం మానేసింది. తరువాత కృష్ణమూర్తి కూడా పిలవడం మానేసాడు. ఇలా ఏకచ్ఛత్రాధిపత్యంగా ఎవరికి వారు వారి వారి ఇష్టాన్ని ఆస్వాదిస్తూ ఉంటారు.

అంతేకాక రుక్మిణికి కృష్ణమూర్తి ఆరుబయట వేసుకునే మడత మంచం అంటే చిన్న చూపు. డబల్‌కాట్లు, సోఫాలు ఉండే ఆ ఇంట్లో ఈ పాత మడత మంచం అంటే ఆవిడకి చికాకు. ఈ విషయంలో మాత్రం కృష్ణమూర్తి ఆవిడ మాటలు వినడు. "నీకేం అడ్డు వచ్చింది" అంటాడు. ప్రతి పది, పదిహేను రోజులకొకసారి మడత మంచం గుడ్డ తానే తీసి ఉతుక్కుంటాడు. ఆవిడ టి.వి. చూసుకుంటూ కూర్చుంటుంది.

అయితే ఈ రోజు అందుకు భిన్నంగా రుక్మిణి కూడా బయట మెట్ల మీద వెన్నెట్లో కూర్చుంది. దానికి కారణం ఆవిడ ముద్దుల కూతురు వసంత. వసంత రుక్మిణీ కృష్ణమూర్తుల ఏకైక సంతానం. కొత్తగా పెళ్ళైన కూతురు. ఆషాఢ మాసం... అని పుట్టింటికి వచ్చింది.

ఆ పిల్లకి కొన్ని విషయాలలో తండ్రి అభిరుచులున్నాయి. వెన్నెల... ఆ పైన పక్కనే విరజాజి పందిరి. విరబూసిన పూల గుబాళింపులు... ఆహ్లాదాన్ని పోగుచేసినట్టుంది.

"అమ్మా! కాసేపే బయట కూచుందామే" అన్న కూతురుతో బయటికి వచ్చి మెట్ల మీద చతికిలబడింది రుక్మిణి. ఆవిడని చూస్తూనే ఫక్కున నవ్వేడు కృష్ణమూర్తి. తండ్రి ఎందుకు

నవ్వాడో అర్థంకాక ప్రశ్నార్థకంగా చూసింది వసంత. కృష్ణమూర్తి చప్పున చూపు తిప్పుకొని ఆకాశంలోకి చూసాడు.

"ఏమిటి నాన్నా!" అంది అయోమయంగా వసంత.

"ఏం లేదమ్మా! ఆకాశంలో మబ్బులున్నాయేమో, వెన్నెల మాయమై వాన కురుస్తుందా!" అని చూస్తున్నాను.

"ఆయన అంతేలే! పుచ్చపువ్వులా వెన్నెల కాస్తుంటే వాన అంటారేమిటి? ఎప్పుడూ ఇంతే..." రుక్మిణి సాగదీసింది.

తండ్రి ఎందుకన్నాడో అర్థమై వసంత కూడా ఫక్కుమంది.

రుక్మిణికి ఈ నవ్వులర్థం కాలేదు.

"ఆయన వెర్రిలో సగం నీక్కూడా వుందేమిటే?" అంది రుక్మిణి.

తల్లి అలా అనడం వసంతకి నచ్చలేదు. తండ్రంటే ఆ పిల్లకి చాలా ఇష్టం.

"ఉండొచ్చు. నాకూ కూతురేగా...'

"సరేలెండి. ఎప్పుడూ ఉండేదేగా.." అంటూ "సరే గాని వసంతా! ఇంట్లో వంటెవరు చేస్తారూ?". కూతురి కొత్త కాపురం గురించి ఆరా మొదలెట్టింది రుక్మిణి.

కృష్ణమూర్తికి ఆ సంభాషణ నచ్చకపోయినా మౌనంగా ఉన్నాడు. రుక్మిణి వసంతలకు ఈ గమనం లేదు.

"వంటంతా ఆవిడే చేస్తారనుకో!... కాఫీ సెక్షనూ, పనమ్మాయికి అంట్లు బయట పడెయ్యడం, కూరలు తరగడం, ఇల్లు చిమ్మడం... అన్నీ నావే"

"మరి మీ ఆడపడుచు.."

"ఆ అమ్మాయి ఇంటర్ కదా! ఎంసెట్, కోచింగు క్లాసులూ... పొద్దున్న ఏడింటికి వెడితే రాత్రి ఎనిమిదే.. ఇంకేం చేస్తుంది" కనుబొమలెగరేస్తూ అంది వసంత.

"తండ్రీ, కొడుకూ ఇద్దరూ సంపాదిస్తున్నారు. ఇల్లు కూడా పనమ్మాయి చేత చిమ్మించుకోవచ్చుగా! కూరలు తరిగితే వంటెంత సేపు... " గింజుకుంది రుక్మిణి.

"పని మనిషి కూడా లేకుండా మొన్నటి దాకా ఇంటి పనంతా నువ్వే చేసుకోలేదా రుక్మిణీ! నలుగురు మనుషుల కెంత పని ఉంటుంది చెప్పు" కృష్ణమూర్తి సంభాషణను ఆపడానికితన వంతు ప్రయత్నం చేసాడు.

"మూడు లక్షల రొక్కం కట్నం, ఆడపడుచు కట్నం అంటూ ఏభైవేలు గుంజారు. ఇంకా పెళ్ళి ఖర్చులు అవీ, ఇవీ అన్నీ కలిపి గ్రాండ్.. గ్రాండ్ అంటూ పది పదిహేను లక్షలు వదిల్చారు. వాళ్ళేమాత్రం పెట్టారు బంగారం... గీసి గీసి ఐదు సవరలు పెట్టారు." విసురుగా అంది రుక్మిణి.

కృష్ణమూర్తికి ఒళ్ళు మండింది. వెన్నెలలో ఆహ్లాదం పోయి వేడెక్కినట్టు అనిపించింది. అక్కణ్ణుంచి లేచి పోదామనుకున్నాడు. తండ్రి మనసు 'నిగ్రహించుకో' అంది.

"అబ్బాయి జీతం నీ చేతికే ఇస్తాడా?"

"ఊహూ! మామగారికే ఇస్తాడు. నాకేమైనా కావలిస్తే మా అత్తగార్నే అడగాలి. అయినా ఇంతవరకు ఆ అవసరం రాలేదనుకో! ఎప్పుడైనా సినిమాకో, షికారుకో వెడితే ఆయనతోనే కదా! రోజూ సాయంత్రం దేవుడికి పువ్వులు కొంటారు. కొత్త కోడల్ని కదా! అని ఓ మూర పువ్వులు ముందే నాకు ఇచ్చేస్తారు. ఆవిడ శాస్త్రానికి ముత్తైదువ పువ్వంటూ ఒక పువ్వు తుంపి తలలో పెట్టుకుంటారు. ఆ అమ్మాయి అసలు పువ్వులే పెట్టుకోదు..." పకపకా నవ్వింది వసంత.

"అయినా మా అత్తగారు అన్నీ పద్ధతిగా చేస్తారులే అమ్మా!" అంది వసంత మళ్ళీ తనే.

రుక్మిణికి ఈ చివరి మాట మింగుడు పడలేదు. కృష్ణమూర్తికి కాస్త గాలి వీచినట్లైంది.

"అయినా కొద్దో గొప్పో అడిగి తీసుకో, నీకంటూ ఏదైనా పది రూపాయలుండాలి.." గురుబోధ చేసింది రుక్మిణి.

"ఊ...! ఊ...! అడిగి తీసుకోవచ్చు! మీ అయన నీకెంత ఇస్తున్నాడు ప్రతినెలా అని కూడా అడుగమ్మా!" అన్నాడు నవ్వుతూ కృష్ణమూర్తి.

"ఆ! ఏమిటిచ్చేది, పెళ్ళయి పాతికేళ్ళయింది. ఏనాడైనా పదిరూపాయలిచ్చారా! ముచ్చటకైనా..."

"కదా మరి! కనుక అమ్మాయికి అలాంటి బోధ చెయ్యకు. అత్త మామల్ని అమ్మానాన్నల్లా చూసుకో. ఆడపడుచును చెల్లెలుగా చూసుకో, లేకపోతే ఫ్రెండ్‌లా కలిసి ఉండు అని చెప్పు... ఇంత సేపట్నుంచి వింటున్నాను మీ సంభాషణ. ఆ అమ్మాయి అనకపోతే ఆ అమ్మాయికి.. అదే మీ ఆడపడుచుకు ఒక పేరు ఉంది కదమ్మా! సాటి ఆడపిల్ల. చక్కగా పేరుతో చెప్పమ్మా! అది బాగుంటుంది." మెత్తగా అన్నాడు కృష్ణమూర్తి.

వసంత తల ఊపింది.

"ఆ ! మీరెప్పుడూ అంతే! రేపు పిల్లా పాప పుట్టాక ఖర్చు పెరుగుతుంది. ఇల్లూ వాకిలీ ఏర్పాటు చేసుకోవాలి కదా! మొగుడూ, పెళ్ళాలు కలిసి ఇంటా బయటా చక్కదిద్దుకోవాలి కదా!..." వదల లేదు రుక్మిణి.

"నిజమే. ఆర్థిక విషయాలు భార్యాభర్తలిద్దరూ కలిసే

నిర్వహించుకోవాలి. భర్త భార్యతో అన్నీ సంప్రదించాలి. ఏదీ దాచకూడదు. కలిసి బండి లాగాల్సిన వాళ్ళు కనుక ఇద్దరికీ సరియైన అవగాహన ఉండాలి. అంటే దాని అర్థం అంతవరకు ఉమ్మడి కుటుంబంగా సాగుతున్న సంసారాన్ని చీల్చి వెళ్ళిన మర్నాడే గొడవలు పెట్టుకోవడం కాదు. అసలు అల్లుడు అలా జీతం అంతా తెచ్చి తండ్రిని కాదని భార్యకి ఇస్తే నాకే నచ్చదు ముందు. అలా చేస్తే పెద్దలను గౌరవించే సంస్కారం లేనివాడు. పెద్దవాళ్ళు అనుభవ జ్ఞానాన్ని ఉపయోగించుకునే తెలివి లేని వాడుగా కనిపిస్తాడు. మెల్లిగా అవగాహన, ఆత్మీయతలూ పెరగాలి. అత్తామామలు కూడా ఇదివరకట్లా ఎవరూ ఉండటం లేదు. అందుకని గౌరవం ఇచ్చిపుచ్చుకుంటే హూందాగా ఉంటుంది" అన్నాడు కృష్ణమూర్తి.

''మరి వీళ్ళ భవిష్యత్తు గురించి వీళ్ళు ఆలోచించుకోనక్కర్లేదా?" ఉక్రోశంగా అడిగింది రుక్మిణి.

"ఇవేమీ నేను కాదనడం లేదు రుక్మిణీ! ఆత్మీయతలు పెరిగి, అవగాహన పెరిగే వరకు పద్ధతిగా ఉంటే బండి పట్టాల మీదకి తేలికగా ఎక్కుతుంది. కట్నం... కట్నం... అంటున్నావు. అది మనం ఇష్టపడే ఇచ్చాం. మంచి సంబంధం. బ్యాంకు ఆఫీసరు. అమ్మాయి సుఖపడుతుంది. ఉద్యోగం కూడా చెయ్యక్కర్లేదన్నారు. ఇంటా, బయటా కూడా కష్టపడక్కర్లేదు అని ఆలోచించావు. మనకి ఏ పదిమంది ఉన్నారు, ఒక్కతే కూతురు గ్రాండ్‌గా చెయ్యాలని నువ్వే ఊదరగొట్టావు. ఇప్పుడిలా మాట్లాడుతున్నావు. ఇదేమైనా బాగుందా రుక్మిణీ! అమ్మాయికిలా చెప్పకు" నచ్చ చెబుతున్నట్టుగా అన్నాడు కృష్ణమూర్తి.

"ఇప్పుడేమన్నానని క్లాసు పీకడం... కొత్త చోటు అమ్మాయెలా ఉందో తెలుసుకోవద్దా!" విసురుగా అంది రుక్మిణి.

కృష్ణమూర్తికి చర్రున కోపం వచ్చింది. అయినా నిగ్రహించుకున్నాడు.

"తెలుసుకోవడం వేరు... ఆరా వేరు రుక్మిణీ. అయినా అమ్మాయి ముఖం చూస్తే తెలియటం లేదా! అక్కడ సుఖంగా ఉందని, అలాగే గంటలు గంటలు మొగుడితో సెల్‌ఫోన్‌లో గుసగుసలు చెప్పటం లేదా!... అల్లుడు బాగానే చూసుకుంటున్నాడని. "నవ్వుతూ అన్నాడు కృష్ణమూర్తి.

"ఫో! నాన్నా... నువ్వు మరీను.." సిగ్గుపడింది వసంత.

''అమ్మ ఏదో ఆరాటంతో అడుగుతుంది కాని పట్టించుకోకమ్మా! నువ్వు మొదటి రెండేళ్ళు కాస్త అమ్మా, నాన్నా అంటూ ఆలోచిస్తావు. తరువాత నా ఇల్లు, నా మొగుడు, నా పిల్లలు అంటూ రానేరావు. మీ అమ్మైనా అంతేగా. అలాగే ఉండమ్మా! పాతికేళ్ళ జీవితం అత్తింట్లో. మెల్లిగా వాళ్ళ పద్ధతులు అలవాటు పడాలి అలాగే నీకేదైనా ఇబ్బందులుంటే అత్తమామలతోనో, మొగుడితోనో చెప్పుకో. వేరు వేరు చోట్ల పెరిగిన పిల్లలకు మొదట్లో ఈ సర్దుబాట్లు తప్పవు'' అనునయంగా అన్నాడు.

"ఆడపిల్లలకేనా నాన్నా! సర్దుబాట్లు మగపిల్లలకుండవా?" చురుగ్గా అడిగింది వసంత.

అలా అడుగు అన్నట్టు తనూ చురుగ్గా చూసింది రుక్మిణి. కృష్ణమూర్తి కాసేపు నిశ్శబ్దంగా ఉన్నాడు. తల్లీ కూతురూ కూడా మౌనంగా ఉండిపోయారు.

"మంచి ప్రశ్న వేసావు కదూ! నిజానికి మన విషయంలో సమస్యలే లేవు. భార్యాభర్తలిద్దరూ ఉద్యోగాలు చేసేవాళ్ళయినప్పుడు ముఖ్యంగా సాఫ్ట్‌వేర్ ఉద్యోగులైనప్పుడు, కోట్ల టర్నోవర్‌లో బిజినెస్ చేసే కంపెనీలలో పనిచేసేటప్పుడు డెడ్‌లైన్లు, వర్క్ స్టక్ అయిపోవడం ఒత్తిడితో పేలిపోయేటట్లు ఉండడం, చేతిలో నిండా డబ్బు, పెద్దవాళ్ళ సహాయం లేకపోవడం, నేను మగవాడిని అనే పురుషాహంకారం ఇంకా పోని కుటుంబాలు కూలిపోవడం ఎన్నో చూస్తున్నాం. పెళ్ళి విడాకులు మళ్ళీ పెళ్ళి అది మాత్రం ఎంత బాగుంటుందో తెలియని దుస్థితి. కడుపు నిండా దు:ఖం, పెదాల మీద లిప్‌స్టిక్కు నవ్వులు.. ఎన్ని చూడడం లేదు. ఎన్ని వినడం లేదు. అంతకంటె కొద్దిపాటి నిగ్రహం, అవగాహన ఉంటే ఎంత సుఖపడవచ్చో ఆలోచించు."

"నీకు మన కుటుంబంలో విషయమే చెప్తాను. విను. నువ్వు చదువుకున్నదానివి. విజ్ఞత కలదానివి. ఆలోచించగలవనుకుంటాను."

నవ్వులతో మొదలైన వాతావరణం కొంచెం గంభీరమైంది.

"రుక్మిణీ! మా అన్నయ్య ఇంట్లోంచి పారిపోయాడని ఒకసారి చెప్పాను గుర్తుందా! మా అమ్మ పోయేదాకా పెద్దాడా! పెద్దాడా! అంటూ గొణుక్కుంటూనే ఉండేది. నీకు గుర్తుందా!"

"ఏమో! మన పెళ్ళయ్యాక ఒకటి రెండేళ్ళేగా ఆవిడ ఉన్నది. బాగా గుర్తులేదు" సాలోచనగా అంది రుక్మిణి. వసంత మౌనంగా వింటుంది.

"మా అన్నయ్యకూ, నాకూ పదేళ్ళకు పైగా వార ఉంది.

మధ్యలో ఒక ఆడపిల్ల పుట్టి పోయిందట అమ్మకు. అమ్మకు కొంత వయసయ్యాక పుట్టాను నేను. అన్నయ్యకు పెళ్ళయ్యేటప్పటికి నాన్నగారు పోయారు. అమ్మ, అన్నయ్యకు పెళ్ళయితే చేసింది కాని ఏదో అభద్రత ఉండేదో, భయమో కాని ఎప్పుడూ అన్నతో వదిన మీద ఏవో నేరాలు చెపుతూనే ఉండేది. మౌనంగా ఉంటే మాట్లాడేవరకూ చెండుకు తినేది. దాంతో అన్నయ్యకు, వదినకు యుద్ధం. మధ్యలో చేరి తప్పులు పడుతూ పుల్లలు వేస్తుండేది. చిలికి చిలికి గాలివాన అయింది. మనస్పర్థలొచ్చి ఇద్దరూ విడిపోయారు. నేను అందరి మాటలు వినడమే గాని ఏమీ చెప్పగలిగే వయసు గాదు. వదిన తల్లిదండ్రులు వచ్చి గొడవ పెట్టుకున్నారు. పల్లెటూరు కదా! పెద్దమనుషులు, పంచాయతీ మామూలే. మాకు రెండెకరాల పొలం మాత్రం ఉండేది. అన్నయ్య ఆ గొడవ వదిలించుకోవడానికి తన వాటా ఎకరం పొలం వదినకి రాసిచ్చేసాడు. వదిన వెళ్ళిపోయింది. నోటి దగ్గర కూడు లాక్కుని వెళ్ళిపోయిందని అమ్మ ఆవిడని తిట్టని రోజు లేదు. చవట, చేతకాని వెధవ, పెళ్ళాన్ని వంచడం చేతకాక ఎకరం పొలం పోగొట్టి చచ్చాడు... అని అన్నయ్యను కూడా తిడుతూనే ఉండేది. ఒకరోజు అన్నయ్య ఎదురు తిరిగేడు.

"నువ్వు నా జీవితం నాశనం చెయ్యలేదా?" అంటూ.

అమ్మ స్వభావం అఘాయిత్యం చెయ్యడం, బెదిరించడం.. దాంతో నన్ను ఏమైనా అంటే చస్తానని ఒంటిమీద కిరసనాయిలు పోసుకుంది. అన్నయ్య మౌనంగా బయటికి వెళ్ళిపోయాడు. ఏమయ్యాడో తెలియదు. మళ్ళీ తిరిగి రాలేదు. అమ్మ స్వభావం మారలేదు. ఎప్పుడు చూసినా వాళ్ళిద్దరినీ తిడుతూనే ఉండేది. నేను లేటుగా పెళ్ళి చేసుకోవడానికి ఇదే కారణం రుక్మిణీ! పెళ్ళంటే ఏవేవో కోరికలకన్నా నా జీవితం ఏమవుతుందో అనే బెదురు నాలో పనిచేస్తుండేది. ఎందుకొచ్చిన లంపటం అనిపించేది.

■■■

కృష్ణమూర్తి మధ్యలో ఆపేసి కళ్ళుమూసుకుని పడుకున్నాడు నిశ్శబ్దంగా.

రుక్మిణికి తను మరిచిపోయిన గతం ఒకసారి కదలాడింది కళ్ళముందు. తను మరిచిపోయిందనడం కన్నా కృష్ణమూర్తి మరిపించాడనడం నిజం.

తల్లిపోయి తండ్రి రెండోపెళ్ళి చేసుకున్నాడు. సవతి తల్లికి ఇద్దరు పిల్లలు. వాళ్ళని ఆడించడానికి, ఎత్తుకోవడానికి వీలుగా టెన్త్ క్లాసులో చదువు ఆపించేసారు. గంతకు తగ్గ బొంత అంటూ చదువూ సంధ్యా సరిగా లేని వాణ్ణి ఇచ్చి కట్టబెట్టడానికి ప్రయత్నించాడు తండ్రి. పైగా నాజూగ్గా ఏం చెయ్యనమ్మా! నీ వెనకాల నాకింకా ఇద్దరు పిల్లలున్నారు అంటూ కల్లబొల్లి ఏడుపేడ్చాడు. పైగా వయసులో పదేళ్ళ పెద్దవాడు తనకంటే... అదుగో సరిగ్గా అప్పుడు చూసాడు కృష్ణమూర్తి. కృష్ణమూర్తి ఒక్కడూ ఒక గది అద్దెకు తీసుకుని ఉద్యోగం చేసుకునేవాడు. అతడు అద్దెకున్న ఇల్లు తన స్నేహితురాలిది. తను ఏడుస్తుంటే విని విషయం తెలుసుకుని తండ్రిని కలుసుకుని కానీ కట్నం లేకుండా పెళ్ళి చేసుకున్నాడు. తను ఎప్పుడూ తిరిగి ఆ గుమ్మం తొక్కలేదు. తను ఈ ఇంటికి మహారాణే అనుకుంది. పొరపాటున కూడా కృష్ణమూర్తి తన గురించి కాని, తన తండ్రి గురించి కాని ఎప్పుడూ ఒక్కమాట కూడా అనలేదు. ఇంకా తనే...

రుక్మిణి కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. కృష్ణమూర్తికి అర్థమయి మౌనంగా ఉన్నాడు.

"ఇన్నేళ్ళలో పెదనాన్నగారు ఒకసారీ రాలేదా నాన్నా!" నెమ్మదిగా అడిగింది వసంత.

"లేదమ్మా! ఎంతకాలం గడిచినా రాకపోయే సరికి మీ నాయనమ్మ దిగులు పెట్టుకుంది. ఎంతైనా కన్నపేగు కదా! పోయేదాకా పెద్దాడా! పెద్దాడా! అంటూ గొణుక్కుంటూనే ఉండేది. ఏం లాభం? అర్థం లేని అహంకారాల వల్ల రెండు జీవితాలు నాశనం అయ్యాయి..."

భారంగా నిట్టూర్చాడు కృష్ణమూర్తి.

"పాతికేళ్ళ వైవాహిక జీవితంలో ఇంత పెద్ద విషయం ఎప్పుడూ నాకు చెప్పలేదే?" ఆశ్చర్యంగా చూసింది రుక్మిణి.

"అవసరం రాలేదు. ఇప్పుడైనా చెప్పకపోదును. భార్యాభర్తల మధ్య అటు వాళ్ళైనా, ఇటు వాళ్ళైనా ఒక విషపు విత్తు తెలిసో తెలియక నాటితే అది పెరిగి మహావృక్షమై విషఫలాలనే ఇస్తుంది. జీవితాలను నాశనం చేస్తుంది. ఇంతవరకు ఇది నీకు చెప్పాల్సిన అవసరం రాలేదు. అందుకని చెప్పలేదు."

వసంతకి మనసు తత్తర పడింది. తన భర్త కళ్ళముందు కదిలాడు. క్షణంలో అతని సన్నిధిలో వాలాలనిపించింది.

ఆహ్లాదంగా కూర్చుని కబుర్లు చెప్పుకోవాలనుకున్న

## సాహిత్య ప్రస్థానం ఫిబ్రవరి, మార్చి నెలల పురస్కారాలు

| శ్వాస | మోహం తీర్చే విమర్శ ఏది? | చిగురించేకాలంకోసం |
|---|---|---|
| కథకు: రూ.700/- | వ్యాసానికి : రూ.500/- | కవితకు : రూ .500/- |
| రచయిత : బి. వేణుగోపాల రెడ్డి | రచయిత : టి. సతీష్ | రచయిత : పి. గోపినాథ్ |
| ఫిబ్రవరి సంచిక | మార్చి సంచిక | మార్చి సంచిక |

■■■

కథ, కవితకు సినీ రచయిత జనార్దన మహర్షి అందిస్తున్న పురస్కారం, వ్యాసానికి కర్లపాలెం రుక్మిణమ్మ పురస్కారం చెక్కులు ఈ రచయితలకు అందుతాయి

■■■

పాఠకులు తాము చదివిన కవితలు, కథలు, వ్యాసాలలో నచ్చినవి కారణాలతో సూచించవచ్చు. సీనియర్, ప్రసిద్ధ రచయితల రచనలు కాక ఔత్సాహికులను, ఇటీవల రాస్తున్నవారిని ప్రోత్సహించడమే ఈ పురస్కారాల ఉద్దేశ్యంగా గ్రహించగలరు.

- ఎడిటర్

వాతావరణం కాస్తా భారంగా, నిశ్శబ్దంగా తయారయింది. తనెప్పుడూ చూడని పెదనాన్న, పెద్దమ్మ, నాన్నమ్మలు...

తను ఇంతకాలం నాయనమ్మకి నాన్నొక్కడే సంతానం అనుకుంది. కాదా... అనుకుంది వసంత.

"మరి పెద్దమ్మ ఉందా నాన్నా! ఎక్కడుందో తెలుసా?" వసంత నెమ్మదిగా అడిగింది.

తన గొంతులో ఉండచుట్టుకుని, తను అడగలేక పోయిన ప్రశ్న కూతురడగడంతో రుక్మిణి తాను కూడా కుతూహలంగా చూసింది.

"ఉందమ్మా! మన పక్క ఊరే! మన పొలం అమ్మడానికి వెళ్ళినప్పుడు చూసాను. ఐదేళ్ళ కింద. పోనీ తనేమైనా సుఖంగా ఉందా అంటే ఒకటి రెండేళ్ళు తల్లితండ్రులున్నంత వరకు బాగానే గడిచింది. ఇప్పుడు అన్నదమ్ములకి, వాళ్ళ పిల్లలకి చాకిరీ చేస్తూ గడుపుతోంది. ఓపిక లేకపోయినా అలాగే చేస్తూ బ్రతుకుతోంది. ఆ పనేదో తన ఇంట్లోనే చేసుకుంటే తన ఇంటికి తనే రాణి అయ్యేది. చిన్న వయసు... పెద్దవాళ్ళకే లేని ఆలోచనలు ... చిన్నవాళ్ళకెలా వస్తాయి. ఉడుకు రక్తం కదా!" నిట్టూర్చాడు కృష్ణమూర్తి.

"అయితే విడాకులకు నువ్వు వ్యతిరేకమా నాన్నా!"

"కాదు. సర్దుకోలేనంత పెద్ద కారణాలు, వివాదాలు, బాధలు ఉంటే తప్పకుండా విడాకులు తీసుకోవచ్చు. పరువు పోతుందనే లాంటి కారణాలతో కష్టాల్లో ఉన్న పిల్లల్ని తల్లితండ్రులు వదిలెయ్యకూడదు. కాని కొన్ని కారణాలు చిత్రంగా ఉంటాయి. మా అమ్మా, వదిన విషయమే చూడు. మా వదిన పట్టణంలో పెరిగింది. పెద్దగా చదువు కోలేదు. కాని టెన్త్ పాసయింది. ఆవిడకు పేడ ముట్టుకోవడం, బర్రెల దగ్గర పనిచేయడం చేతకాదు. అసహ్యం. పోనీ అని మా అమ్మ ఆ పనులు నే చేస్తాలే అమ్మాయి! నువ్వు ఇల్లు చిమ్మడం, వంట చెయ్యడం లాంటివి చూడు అని సర్దుకోలేదు. ఎందుకు చెయ్యదు అని ఆవిడ పంతం. నాకిష్టం లేని పని ఎందుకు చెయ్యాలి అని వదిన పంతం. ఇద్దరి పంతాల మధ్య అన్నయ్య పాపం నలిగిపోయాడు. ఏమయిపోయాడో, ఎక్కడ ఉన్నాడో అసలు ఉన్నాడో లేడో కూడా తెలియదు" బాధగా అన్నాడు కృష్ణమూర్తి.

రుక్మిణి మౌనంగా లేచి భర్త భుజం మీద ఓదార్పుగా చెయ్యి వేసింది. ఆవిడకు "యోగక్షేమం వహామ్యహం" అంటూ దీపం ఆరిపోకుండా చేతులు అడ్డుపెట్టే ఎల్.ఐ.సి. యాడ్ గుర్తుకు వచ్చింది.

వసంతకి తండ్రి చెప్పదలుచుకున్నది బాగానే అర్థం అయింది. వెనక నుంచి వచ్చి తండ్రి భుజాల మీదుగా తన చేతులు దండలా వేసింది. కృష్ణమూర్తి ఆ రెండు చేతుల మీదుగా తన చేతులుంచాడు ప్రేమగా.

మబ్బులు తొలిగిన చంద్రుడు నిండుగా వెలుగుతూ వెన్నెల వెదజల్లుతూ కనపడ్డాడు.

వసంతకీ, కృష్ణమూర్తికీ ఇప్పుడు వెన్నెల మరింత చల్లగా తోచింది.

◆

## టమోటా రైతు

- కిల్లాడ సత్యనారాయణ
8333987838

టమోటా బీజాల నుండి
కరెన్సీ నోట్లు పుడతాయనుకోవడం తప్పే
తన చర్మంతో టమోటాకు బట్టకుట్టి
తన జీవితాన్ని పండించాలనుకోవడం తప్పే
గుప్పెడు గుండెను పంటకు కాపలా పెట్టి
గాఢాంధకారంలో లాంతరు వెలుగులో
డొల్లయిపోతున్న తన జీవితబింబాన్ని
టమోటారంగుతో దిద్దుకోవాలనుకోవడం తప్పే
ఇంటిల్లిపాదినీ రంగుల లోకంలో
ఉయ్యాలూగించి నోరూరించిన
టమోటా పండు ఎక్కడ?
ఇంకా–
పొలంగట్టున ప్రాణాయామం చేస్తుంది
విలాసాల సీసాల్లోంచి పొంగిపొర్లుతూన్న
వెకిలి నవ్వుల సాక్షిగా
విద్యుత్ కాంతుల ప్రవాహంలోంచి ఉరకలు వేస్తున్న
నగర వికాసాల సాక్షిగా
రైతుబజార్లో అతను ఒట్టేసి చెబుతున్నాడు–
టమోటా రంగు ఆవిరైపోయిన
తన నెత్తురుదేనని



టమోటాతో రుచి ఇంకిపోయిన
తన చెమట చుక్కలదేనని
లేకుంటే–
ఆపిల్‌పండు అసూయపడే అందం
టమోటాకు ఎలా వచ్చింది?
చింతపండు సిగ్గుపడే గుణం
టమోటాకు ఎక్కడినుండి వచ్చింది?
ఇంత చెప్పినా–
అంగట్లో పెట్టిన టమోటా అందానికి
కన్నుగొట్టేవారే గాని
కొనుక్కునేవారు లేరు
బీటలు వారిన అతని పెదాలకు
మాటలు చెప్పేవారే గాని
ఆదుకునేవారు లేరు
ఆశల పేగుల్ని మెడకు చుట్టుకున్న
ఆ రైతు పరమేశ్వరుణ్ణి
ధరలలేమి కట్లపామై కాటేసింది! ◆

---

## ఒరిగిన వరికంకు

- మార్ని జానకిరామ్ చౌదరి
9440338303

మేనినున్న చెమటనంతా
ఎగరేసుకుపోయిన మేఘం
చుక్కనైనా రాల్చకుండా
దోబూచులాడుతుంది
అరిగిన చెప్పుల్లోంచి
పొడుచుకొచ్చిన తుమ్మముళ్ళు
పాదాల్లో దిగుతుంటే
కంటజారిన నీటిచుక్క
పగుళ్ళుదీసిన మట్టిలో
మొలక కోసం వెదుకుతోంది
ఆలుబిడ్డల పస్తులెట్టి
ఇంటి దస్త్రం కుదువపెట్టి
నాటువేసిన నకిలీ విత్తు
పుడమి గర్భస్రావంతో
నిర్జీవ శకలమైంది
ప్రకృతి ప్రకోపానికి



దళారీల వికృతానికి
మన్నును అన్నంలా మార్చే
అతని వెన్నెముక
విరిగిన వరికంకైంది
పసుపురాసిన నాగలి కర్రూ
అటకెక్కిన పలుగూ, పారా
పాతరాతియుగం నాటి
పనిముట్లుగా మారుతున్నాయ్
బక్కచిక్కిన దుక్కిటెద్దు
కబేళాకు పయనమవుతూ
కడసారి చూపుగా
రెండు కన్నీటి బొట్లు రాలిస్తే
గూడ తెగిన కిర్రుచెప్పులు
నిశ్శబ్దంగా రోదించాయి

దోసెడు నీళ్ళుపోసి పెంచిన
మామిడికొమ్మ
ఋణం తీర్చుకోటానికి
ఉరికొయ్యగా మారింది
పలుపుతాడు సాక్షిగా
చెమటూడ్చిన తుండుగుడ్డ
కొయ్యకు వేలాడుతున్న దేహంపై
జెండాలా రెపరెపలాడుతుంది ◆



# నా ప్రాపంచిక, సాహిత్య దృక్పథం

## - కడియాల రామమోహనరాయ్

◆ **మీ కుటుంబ నేపథ్యం**

సిరిపురం (గుంటూరు జిల్లా, మేడికొండూరు మండలం) మా సొంత వూరు. పుట్టిన తేది 11.04.1944. కమల, కడియాల భద్రయ్య నా తల్లితండ్రులు. మాది మధ్యతరగతి రైతు కుటుంబం. మా అమ్మ చిన్న వయస్సులో నా మూడవ ఏట చనిపోయింది. నాన్నగారు మళ్ళీ పెళ్ళి చేసుకోలేదు. నాన్నగారు, నాయనమ్మ, అక్కయ్య సుమలత నన్ను పెంచి పెద్ద చేశారు.

మా నాన్న ఎఫ్.ఆర్ చదివారు. గొప్ప సాహిత్యాభిమాని. తెలుగు ఇంగ్లీషు భాషలలో చాలా పుస్తకాలు చదివారు. మనుచరిత్ర, రాఘవ పాండవీయము, త్రిపురనేని రామస్వామి- సూత పురాణము, జాషువా ఖండ కావ్యాలు ఆయనకు కంఠతా వచ్చు. మా వూళ్లో వెన్నెల రాత్రులు ఆరుబయట పడుకున్నప్పుడు పుస్తకమేదీ లేకుండ శ్రావ్యమైన కంఠస్వరంతో ఆ కావ్యాల్లో పద్యాలు వినించేవారు. అల్లసాని పెద్దన అశువుగా చెప్పిన 'పూతమెఱుంగులంబసురు బూపబెడుంగులు జూపునట్టి వా కైతలు(28 పంక్తుల ఉత్పలమాలిక) చెవికింపుగా విన్పించడమే గాక, నా చేత తిరిగి అప్పజెప్పించుకుని చాలా అనందించారు.

మా నాన్నగారు హేతువాది. నాస్తికులు. మా ఇంట్లో ఎప్పుడూ ఏ దేవుణ్ణీ పూజించలేదు. ఇప్పుడూ అలాగే. ఆయన కమ్యూనిస్టు పార్టీ అభిమాని. కారల్‌మార్క్స్, ఏంగెల్స్, లెనిన్, స్టాలిన్, మావోల రచనలు, జీవిత చరిత్రలు చదివారు. ఆయనకు సోవియట్ రష్యా అన్నా, స్టాలిన్ అన్నా చాలా అభిమానం.

నేను ఎస్ఎస్ఎల్‌సి (1958) చదివేనాటికి నాకు హేతువాదం, నాస్తికత్వం, మార్క్సిజం వొంటబట్టాయి. 'ఇండియన్ ఎక్స్‌ప్రెస్', 'బ్లిట్జ్'(ఆర్.కె. కరంజియా, కె.ఏ. అబ్బాస్‌ల రచనలు), 'చందమామ', 'బాల' పత్రికలు చాలా ఇష్టంగా చదివేవాడిని. శరత్‌బాబు నవలలు (శ్రీకాంత్, శేషప్రశ్న, బడదీదీ, దేవదాసు, భారతి), అమ్మ (మాక్సింగోర్కీ) తెలుగులో చదివి ఆనందించాను.

నా ప్రాపంచిక, సాహిత్య దృక్పథం మా నాన్న ప్రసాదించిన జ్ఞానచక్షువే.

◆ **మీ రచనా నేపథ్యం...**

నా పదహారవ యేట (1960) నా పద్యరచన ఉమర్ ఉద్బోధలు (ఖండకావ్యం) 'ప్రజామత' పత్రికలో

ప్రచురితమైంది. అప్పుడు గుంటూరు హిందూ కాలేజీలో బి.ఏ. మొదటి సంవత్సరం చదువుతున్నాను. తొలి రచన అచ్చులో చూసుకున్నప్పుడు చాల ఆనందం కలిగింది.

అదే సంవత్సరం ఒక కథ రాశాను 'సూరయ్య తాత'. దానికి మా కాలేజీ వారు జరిపిన కథల పోటీలో బహుమతి వచ్చింది. ఆ కథను నేను ప్రచురణకు పంపించలేదు.

1958లో మహాకవి శ్రీశ్రీ 'మహాప్రస్థానం' చదివి కొత్తలోకంలోకి వచ్చిన అనుభూతి పొందాను. ఒక రూపాయి చెల్లించి మహాప్రస్థానం కొనుక్కున్నాను. కొద్దిరోజుల్లో అందులో కవితలు చాల వరకు నా నోటికి వచ్చేశాయి. "అనుభవించి పలవరించాను".

1962-64 మధ్యకాలంలో ఆంధ్రవిశ్వవిద్యాలయంలో ఎం.ఏ.(తెలుగు భాషా సాహిత్యాలు) చదివాను. అప్పుడు మొదటి సారిగా మహాకవి శ్రీశ్రీ ప్రసంగం విని ఉత్తేజితుణ్ణి అయ్యాను. 'అధివాస్తవికుల ప్రవేశం' అన్న కవిత ఆయన అనర్గళంగా చదవటం నాకింకా జ్ఞాపకం వున్నది.

1964 డిసెంబర్‌లో శ్రీశ్రీని మద్రాసులో వారి ఇంటికి వెళ్ళి కలుసుకున్నాను. మార్క్సిజం గురించి తెలియాలంటే ఏ పుస్తకాలు చదవాలని అయన్ను అడిగాను. దాస్ కేపిటల్ తర్వాత చదవొచ్చు, ముందుగా జార్జ్ బెర్నార్డ్‌షా రాసిన ఎన్ ఇంటిలిజెంట్ వుమన్స్ గైడ్ టు సోషలిజం చదవమని సలహా ఇచ్చారు. ఆ పుస్తకం ఇప్పుడు షాపుల్లో దొరుకుతుందో లేదో గాని మూర్ మార్కెట్‌లో తప్పక దొరుకుతుందని తెలిపారు. ఆయన చెప్పినట్లే ఆ పుస్తకం మూర్ మార్కెట్‌లో దొరికింది. దాన్ని చదివి, ఇప్పటికీ ఆ పుస్తకాన్ని నా గ్రంథాలయంలో భద్రపరుచుకున్నాను.

సాహిత్య విమర్శకునిగా నా తొలిరచనలు 'రాజమార్గం'లో సుప్రసిద్ధ సాహిత్య మాసపత్రిక 'భారతి'లో వచ్చాయి. మాన్యులు శివలెంక శంభుప్రసాద్ కోరిన మీదటనే నేను 'భారతి'లో సాహిత్య విమర్శ వ్యాసాలు, పుస్తక సమీక్షలూ రాశాను. 1965-1975 మధ్యకాలంలో భారతి, ఆంధ్రపత్రిక ఉగాది సంచిక, ఆంధ్రపత్రిక దినపత్రికలలో చాల వ్యాసాలు, పుస్తక సమీక్షలూ రాశాను. 1975 తర్వాత నా రచనలు ఆంధ్రజ్యోతి, ఆంధ్రప్రభ, విశాలాంధ్ర మొదలైన పత్రికలలో వచ్చాయి.

**◆ మీ పుస్తకాల గురించి...**

**తెలుగు కవితా వికాసం**- ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమి- 1982. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ వారు ఆధునికాంధ్ర కవిత్వపు తీరుతెన్నులపై చారిత్రక విమర్శ గ్రంథం రాయమని నన్ను కోరారు. ఈ పుస్తకానికి మంచి స్పందన వచ్చింది. సాహిత్యాభిమానులు, విశ్వవిద్యాలయాల విద్యార్థులు, తెలుగు సాహిత్య పరిశోధకులు చాలామంది ఈ పుస్తకం చదివారు. 30 ఏళ్ళ తర్వాత గూడ తెలుగు సాహిత్య వేత్తలు యీ పుస్తకాన్ని ప్రస్తావిస్తుండడం నా కృషికి తగిన గుర్తింపుగా భావిస్తాను.

**కృష్ణశాస్త్రి కవితా వైభవం** - యువభారతి, హైదరాబాదు - 1984, **పదమూడు ఉత్తమ కథలు** - నేషనల్ బుక్‌ట్రస్ట్, న్యూఢిల్లీ - 1997. ఇంగ్లీషు నుండి తెలుగులోకి అనువాదం చేసిన కథలు ఇవి. ఇందులో సత్యజిత్‌రే, రస్కిన్‌బాండ్ మొదలైన ప్రసిద్ధ భారతీయ రచయితల కథలు వున్నాయి.

**సహృదయ' విమర్శ వ్యాస సంపుటి** - విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్ - 2002. తెలుగు కథలు, నవలలపై విమర్శ వ్యాస సంపుటి.

**ఇరవయ్యో శతాబ్దపు తెలుగు కవిత్వం** - పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం - 2003.

**ఉత్తరాంధ్ర నవలా వికాసం** -'వెలుగు' - విశాఖపట్టణము - 2005

**గుంటూరు శేషేంద్రశర్మ** - ద్రావిడ విశ్వవిద్యాలయం, కుప్పం- 2008

**శ్రీశ్రీపై ముఖాముఖి** - శ్రీశ్రీ సాహిత్య నిధి, విజయవాడ - 2010. మహాకవి శ్రీశ్రీ మరణానంతరం ఆయన రచనలు తెలుగు సాహిత్యాన్ని ఏ విధంగా ప్రభావితం చేసినదీ తెలిపిన రచన. 18 మంది తెలుగు సాహితీ ప్రముఖులతో జరిపిన ఇంటర్వ్యూలు ఇందులో వున్నాయి.

**శ్రీశ్రీ రచనల ప్రభావం** - శ్రీశ్రీ సాహిత్య నిధి, విజయవాడ - 2012. ఆధునికాంధ్ర సాహిత్యం - కవిత, కథ, నవల, నాటకం, వ్యాసం, విమర్శలపై శ్రీశ్రీ రచనలు కలిగించిన ప్రభావాన్ని విశ్లేషించిన గ్రంథం.

**మన తెలుగు నవలలు** - అజో-విభో- కందాళం ఫౌండేషన్, హైదరాబాదు- 2012. నూరు తెలుగు నవలల తీరు తెన్నులను గుణదోషాలను తెల్పిన విమర్శ గ్రంథం.

**విప్లవవాదం** - పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వ విద్యాలయం - 2012. ఆంధ్రప్రదేశ్‌లో విప్లవోద్యమం వృద్ధి క్షయాలను వివరించిన పుస్తకం.

పుస్తకరూపంలో రానివి- ప్రత్యేక సంచికల కోసం రాసిన వ్యాసాలు, విమర్శ వ్యాసాలు, సమీక్షలు, ఆకాశవాణి ప్రసంగాలు వున్నాయి.

◆ **మీ పరిశోధనలు....**

**తెలుగు సాహిత్యంలో రైతు జీవితం** –10 సంవత్సరాలు పరిశోధన చేసి 1983లో నాగార్జున విశ్వవిద్యాలయం నుండి పి.హెచ్‌డి పట్టం పొందిన గ్రంథం. దీనికి ఆచార్య దోణప్ప ఉత్తమ పరిశోధన స్వర్ణ పురస్కారం లభించింది. (అముద్రితం)

**'ఇరవైయవ శతాబ్ది తెలుగు సాహిత్య వికాసం** (యూనివర్సిటీ గ్రాంట్స్ కమీషన్, న్యూ ఢిల్లీ వారి మేజర్ రీసెర్చి ప్రాజెక్ట్ – 1997 – 1999). అముద్రితం.

**వెయ్యేళ్ళ తెలుగు పద్యవికాసం – సమగ్ర పరిశీలన** (యూనివర్శిటీ గ్రాంట్స్ కమిషన్ వారి మేజర్ రీసెర్చి ప్రాజెక్ట్ – 2002 – 2005). తెలుగు పద్యం: ఇతివృత్త వైవిధ్యం, ఛందస్సు, శైలి, శిల్పం (నిర్మాణ చాతుర్యం) అలంకారాలు – వర్ణనలు – రసము – ధ్వని – ఔచిత్యం మొదలైన అంశాల పరిశీలన. (అముద్రితం)

**మన తెలుగు నాటకాలు – నాటికలు** (యుజిసి వారి మేజర్ రీసెర్చి ప్రాజెక్ట్ – 2013 – 2015) (అముద్రితం)

◆ **ఇటీవల తెలుగు కవిత్వంలో పరిణామాలు**

1989 నుండి 25 ఏళ్లపాటు తెలుగు కవిత్వ వార్షిక సమీక్షలు రచించాను. ఆంధ్రప్రదేశ్‌లో అన్ని ప్రాంతాలలో ఉద్యమాల ఉధృతి తగ్గింది. 21వ శతాబ్దంలో శక్తిమంతమైన కొత్త కవులు కొద్దిమంది మాత్రమే వచ్చారు.

జీవితానుభవాలను కవిత్వంగా రూపొందించటంలో, ప్రకృతి పరిశీలనలో, సమాజాభ్యుదయాన్ని కాంక్షించటంలో ప్రతిభ కనపరుస్తున్నారు.

స్త్రీవాద, దళిత వాదాలు తెలుగు సాహిత్యానికి పుష్టిని చేకూర్చాయి. 21వ శతాబ్దంలో యీ వాదాలలో కొత్తదనం లేకపోగా నీరస ప్రతిధ్వనులు వినవస్తున్నాయి. ముత్యాల సరాల నుండి హైకూల దాకా తెలుగు కవిత్వ భావ వ్యక్తీకరణలో చాల ప్రయోగాలు జరిగాయి. ఇది ఆహ్వానించదగిన పరిణామం.

◆ **ఇటీవలి సాహిత్యపు తీరుతెన్నులు...**

ఒకప్పుడు తెలుగు సాహిత్యంలో మధ్యతరగతి అగ్ర వర్ణాల రచయితల రచనలే ఎక్కువగా వచ్చాయి. కవయిత్రులు, రచయిత్రులు మరీ తక్కువగా వుండేవారు. ఇప్పుడు పరిస్థితి కొంత మారింది. వివిధ వృత్తుల వారు రచనలు చేస్తున్నారు. బొగ్గుగని కార్మికులు, చేనేత పనివారు, కల్లు గీత కార్మికులు – ఇంకా చాకలి, మంగలి, మాదిగ మొదలైన వృత్తిపనివారు వాళ్ల జీవిత గాథల్ని అక్షర బద్ధం చేస్తున్నారు– ఇది మెచ్చదగిన పరిణామం.

**– మార్క్సిస్టు సాహిత్య విమర్శ...**

మార్క్సిస్టు సాహిత్య విమర్శ కొద్దిమంది విజ్ఞుల రచనలకు పరిమితమైంది. సమసమాజ నిర్మాణాన్ని కోరేవారందరూ మార్క్సిస్టు విమర్శకుల కాలేరు. ఈ విమర్శ చేయటానికి లోతైన అధ్యయనం కావాలి. క్రిష్టోఫర్ కాడ్వెల్, ఫ్రాన్సిస్ థాంప్సన్, లూనాచరస్కీ, లెనిన్, మావో, టాల్‌స్టాయ్ రచనలను చదివి ఆకళించుకోవాలి. ముందుగా కమ్యూనిస్టు మేనిఫెస్టో చదివి మార్క్సిస్టు మూలసూత్రాలను బోధపరచుకోవాలి. మార్క్సిస్టు విమర్శ చేసేటప్పుడు గతితార్కిక భౌతిక వాద సిద్ధాంత పరిభాషను ఎంత తక్కువ వాడితే అంత మంచిది.

కమ్యూనిస్టు పార్టీ నాయకులు రచయితల రచనలు తమ పార్టీ లైన్‌కి భిన్నంగా వుంటే ఆ భావాలను ఉపసంహరించుకోమని రచయితలను శాసించకూడదు. రచయితలు తమ రచన ఏ మంచికి హాని చేస్తుందో, ఏ చెడ్డకు సాయం చేస్తుందో పరిశీలించుకోవాలి. మంచి యన్నది పెంచుమన్నా' అనే సూక్తిని మరచిపోకూడదు.

◆ **మీ కవితలు...**

నేను రాసిన కవితలు కొద్ది. కవిత్వంలో హాస్యం, వ్యంగ్యం, పదును వుండాలని కోరుకుంటాను. అనువాదాలు: సమకాలిక భారతీయ భాషలలో నాకు నచ్చిన కవితలు కొన్ని ఇంగ్లీషు నుండి తెనిగించాను. నిసీమ్ ఎజికిల్, కమలాదాస్, ఎ.కె. రామానుజన్ (ఇంగ్లీషు) ఇందిరా సంత్ (మరాఠీ) అశోక్ వాజ్‌పాయ్ (హిందీ) ఉణ్ణామలై (తమిళం) సావిత్రీ రాజీవన్ (తమిళం) కవితలు – అనుసృజన చేసే ప్రయత్నం చేశాను.

◆ **పురస్కారాలు...**

నా రచనలేవీ పోటీలకు పంపలేదు– నా సాహిత్య కృషిని గుర్తించి ఇచ్చిన పురస్కారాలు కొన్ని వున్నాయి. పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం వారు విద్వద్విమర్శ – పరిశోధనకు ప్రతిభా పురస్కారంతో సత్కరించారు (2001), ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యం గారి జీవియస్ కళాపీఠం వారు ఉత్తమ విమర్శ పురస్కార మిచ్చి సన్మానించారు. (2002), తెలుగు అసోసియేషన్ ఆఫ్ నార్త్ అమెరికా (తానా) వారు వాషింగ్టన్ (2007)లో జరిపిన వార్షికోత్సవంలో ఉత్తమ విమర్శక పురస్కారంతో గౌరవించారు. నవ్యాంధ్ర ప్రదేశ్, సాంస్కృతిక శాఖ వారు గిడుగు రామమూర్తి జయంతి సందర్భంగా భాషా పురస్కారమిచ్చి సన్మానించారు. (2017),

# ఇప్పుడంతా... నీ చేతుల్లోనే ఉంది

- జడా సుబ్బారావు
9849031587



ఆటలంటే ఒకప్పుడు...
శారీరక ధారుఢ్యానికి
మానసిక వికాసానికి కేంద్రాలు!
కానీ ఇప్పుడు...
దించిన తల ఎత్తకుండానే
దేహాలు రాలిపోవడానికి
నమూనాలు!
చేతి నరాలనే
ఉరితాడుగా
పేనుకుంటున్న వైనాలు!

చల్లని సాయంత్రాలన్నీ
ఏ గంగలో కలిసిపోయాయో?
నలుగురితో ముచ్చట్లు
ఏ నట్టేట్లో కొట్టుకుపోయాయో?
ప్రపంచమంతా...
ఏదో మత్తుజల్లినట్టు...
ఎవరో మాయచేసినట్టు
అరచేతిలో
మరణపాశాన్ని పెట్టుకుని
'నెట్టా'రణ్యంలో
అయోమయంగా
పరిగెడుతూనే ఉంది

పగలూ రాత్రీ లేదు
పండుగ సరదాలు లేవు
కామెంట్ల కోసం
కలతనిద్రతో కలవరింతలు
లైకుల కోసం
నిద్రలేమితో ఎదురుచూపులు
సెల్ఫీల కోసం
ప్రమాదకరమైన ఫీట్లలో
తలమునకలు

ఇప్పుడు...
నువ్వు నువ్వు కాదు
నీ దేహం నీది కాదు
నీ రూపంపై నీకు అధికారం లేదు
ఊరించి
ఊహాతీరాలకు లాక్కెళ్లి
ఊపిరితీసే
బ్లూవేల్ భూతపు వలలో
అమాయకంగా చిక్కుకుపోతావు
సుడిగుండాల ప్రశ్నల తాకిడిలో
ప్రాణాల్ని పణంగా పెట్టి ఓడిపోతావు

ఉపయోగాల ఊసేమోగానీ
అసువులు తీస్తున్న ఆనవాళ్లే ఎక్కువ
పనికొచ్చే ప్రయోగాల మాటేమోగానీ
ఉసురుతీసే మాయలపైనే మక్కువ

ఇంకేం మిగిలింది...
కన్నుమూసి తెరిచేలోగా
కాలగర్భంలో కలుస్తున్న
నూరేళ్ల నిండుజీవితమంతా
ఆరడుగుల నేలనే ఆశ్రయం కోరుతోంది
కళ్లు తెరవడమో
కాలంలో కరిగిపోవడమో
ఎదగడమో ఏడిపించడమో
బాధ్యతలు గుర్తెరగడమో
బానిసలుగా బతుకీడ్చడమో
ఇప్పుడంతా... నీ చేతల్లోనే ఉంది
భవిష్యత్తంతా... నీ చేతుల్లోనే ఉంది ♦

---

♦ **భవిష్యత్తు ప్రణాళికలు**

నా సాహిత్య కృషిలో నా స్నేహితురాలు, అర్థాంగి రాజ్యలక్ష్మి తోడ్పాటు చాల వున్నది. ఆమె సహకారంతో మరికొన్ని రచనలు చేయాలని సంకల్పించాను.

1. ఆధునిక కవిత్రయం: విశ్వనాథ - కృష్ణశాస్త్రి - శ్రీశ్రీ (సత్యం - సుందరం - శివం)

2. ఆధునికాంధ్ర సాహిత్య చరిత్ర (క్రీ.శ. 1801 నుండి 2018 వరకు)

3. హ్యాండ్సమ్ ఈజ్ దట్ హ్యాండ్సమ్ డజ్. సత్కర్మాచరణమే సౌందర్యం. 'ఒన్ హండ్రెడ్ బ్యూటిఫుల్ థింగ్స్ ఇన్ మై లైఫ్'- 'నా జీవితంలో మధురమైన జ్ఞాపకాలు ఒక వంద. ఈ రచనలు చేయాలని వున్నది.

ఇంటర్వ్యూ : వొరప్రసాద్ ♦




# వీరేశలింగం ప్రహసనాలు మూఢాచారాలపై ముష్టిఘాతాలు

- డా॥ విజయబక్ష్
9441382303

కందుకూరి వీరేశలింగం అనగానే ఓ సంస్కరణ భాస్కరుడు మనకు స్ఫురణకు వస్తాడు. ఆ సంస్కరణ కార్యకలాపాలకు ఆయన కార్య రంగంలో ముఖ్య భూమిక వహించినవి ఆయన రచనలు. ఆ రచనా ప్రక్రియ ద్వారా ఆయన చేపట్టిన కార్యకలాపాలకు శాశ్వతత్వం సమకూడింది. ఆయన తాను రచనలు చేసేటపుడు వాటి శాశ్వతత్వాని కంటే అప్పటి తాత్కాలిక ప్రయోజనాన్నే ఎక్కువగా ఆశించి వుండవచ్చు. అందుకే వాటిల్లో సాహిత్య విమర్శకులు ఆశించే కళాత్మక విలువలు లేకపోవచ్చు. ఆయన ఏ సాహిత్య ప్రక్రియ చేపట్టినా అది నవల కావచ్చు, వ్యాసం కావచ్చు, నాటకం కావచ్చు... అవి సంస్కరణ మార్గం వైపే నడిచేవి. అట్లా ఆయన ఏదో ఒక దురాచారాన్ని తీసికొని దాన్ని దుయ్యబడుతూ రాసినవే అసంఖ్యాక 'ప్రవాసనాలు' ఆ ప్రహసన ప్రక్రియకు ఆయనే ఆద్యుడు.

ఆనాటి ఎందరెందరో సంఘసంస్కర్తలచేత అనేక విధాలుగా కొనియాడబడ్డ ఆయన్ని తెలుగువారే గుర్తించక పోవటం బాధాకరం.

'ప్రజాశక్తి' వారు ఆయన ప్రహసనాలన్నింటిని 'హాస్య సంజీవిని' పేరుతో పునర్ముద్రించారు. వాటిల్లో ఆయన ఏ అంశాలనైతే తీసికొని ప్రహసన రూపం కల్పించారో, ఇప్పటికి 150 ఏళ్ళ తర్వాత కూడా ఆయా అంశాలు ఇంకా సమాజంలో వాటి వికృత రూపాన్ని ప్రదర్శిస్తూనే వున్నాయి. ఈ పుస్తకానికి ముందుమాట రాస్తూ తెలకపల్లి రవి అన్నట్లు 'ఇప్పుడు పునర్మూల్యాంకనాల పేరిట కొందరు ఆయన విశిష్టతను పరిమితం చేస్తుండ వచ్చుగాని నేటికీ ఆయన కృషి మార్గదర్శకంగానే ఉంటుంది... అనేది అక్షర సత్యం.

శిలా సదృశ్యమైన మూఢాచారాలను బద్దలు కొట్టాలి. అందుచేతనే ఆయన రచనల్లో ఆనాటి సమస్యలు, వాటి తీవ్రత, వాటి వల్ల వస్తోన్న నష్టం ప్రస్తావనలు ఎక్కువగా వుంటాయి. వాటినొక వ్యంగ్యాత్మక ధోరణిలో పరిహసిస్తూ, ఖండిస్తూ ప్రవాసనం కొనసాగుతోంది.

ఏ రకమైన మూఢవిశ్వాసమైనా, దురాచారమైనా ఆయన దృష్టి నుండి తప్పించుకో లేకపోయింది. అప్పటికే ప్రబలంగా సమాజంలో వ్యాపించిన అవినీతి, ఉద్యోగుల్లో లంచగొండి తనం, వేశ్యాలోలత్వం, బాల్య వివాహాలు, కన్యాశుల్కం వీటన్నింటిని విమర్శకు గురిచేశాడు. తాను బ్రాహ్మడైనప్పటికీ

తన సొంతకులంలో వున్న దురలవాట్లను ఏ మాత్రం సంశయించక ఎండగట్టాడు. ఏ విషయాన్నైనా హేతు దృష్టితో చూడాలన్న తలంపే తప్ప స్వపరభేదం కనబడదు.

ముదిమి వయసులో మూడోపెళ్ళి, నాలుగో పెళ్ళికి సిద్ధపడే బ్రాహ్మలపై విమర్శ చేయటం, కాటికి కాళ్ళు చాపుకొని కూర్చున్న వానికైనా సరే డబ్బులు కాశపడి ఆడపిల్లలను ముక్కుపచ్చలారని వయసులో అమ్మేందుకు సిద్ధపడ్డ వాళ్ళను తూర్పారబట్టాడు. పెళ్ళి చేసుకోక పోయినా ముండ నుంచుకోటం తప్పుకాదనే అప్పటి వారి అభిప్రాయం. అంతేకాదు భోగం వృత్తి అక్కరలేదన్న వారి మీద కత్తి గట్టేవారు. అట్లా సమర్థించే ఓ పాత్రను, విమర్శించే ఓ పాత్రను ప్రవేశ పెట్టి సంభాషణాత్మకంగా విషయాన్ని విమర్శించేవాడు.

బ్రాహ్మచర్యం బహు కష్టమని, పెళ్ళయి భార్య కాపురానికి వచ్చేదాకా, ఒక వేళ వచ్చినా అనాకారి అయితే, జబ్బు పడితే, పుట్టింటికి వెళితే మగవాళ్ళు భోగం వాళ్ళ వద్దకు వెళ్ళటాన్ని సమర్థించే వానితో, ఈ లక్షణాలన్ని పురుషుల్లో వున్నప్పుడు స్త్రీలు కూడా మొగవాళ్ళలో భోగం జాతి వాళ్ళను ఏర్పరిస్తే వాళ్ళతో కలవవచ్చునా అనే ప్రశ్నకు సమాధానంగా, "మొగుళు ళ్ళ యేమి చేసినా ఆడముండలు ఇంట్లో చచ్చినట్లు పడివుండవలె. బ్రహ్మదేవుడు వాళ్ళ నొసట అలా వ్రాసి పెట్టినాడు" అని చెప్పటం మగ దురహంకారానికి, స్త్రీబానిసత్వానికి చాలా సహజంగానే అలవాటు పడిపోయిన వారి సమాధానం.

ఆనాడు అప్పుడప్పుడే వ్యాప్తిలోకి వస్తోన్న ఇంగ్లీషు చదువుల్ని పనికి మాలినవిగా తేల్చేయ్యటం. ఇంగ్లీషు వైద్యాన్ని, డాక్టర్లని హేళన చేయడం, దానికంటె నవగ్రహజపం చేయించటం మేలనటం, గ్రహశాంతికై బ్రహ్మణ సంతర్పణ చేయించటం, ఏదో ప్రయోగం వల్ల అనారోగ్యం ప్రాప్తించిందని దెయ్యం బట్టిందనీ, వైద్యం చేయించకుండా భూతప్రేతాలను పారదోలటానికై భూతవైద్యుడ్ని పిలిపించి నానా తతంగం చేయించటం వల్ల రోగి ప్రాణం మీదికి రావటం.... ఇట్లాటి నమ్మకాలు అపుడు ఇప్పుడు కూడా వున్నాయి.

అతి బాల్య వివాహము అనే ప్రహసనంలో నాలుగేళ్ళు కూడా నిండని పిల్లలకు పెళ్ళి చేయటాన్ని తీవ్రంగా నిరసించే భుజంగరావు పెళ్లి వుద్దేశం యావజ్జీవం వధూవరులు సుఖపడడానికి గాని భాజాభజంత్రులు చూచి మనం సంతోషించడానికి గాదని,... పది రూపాయలతో చేసినా పెళ్ళే అవుతుంది, పదివేలతో చేసినా పెళ్ళే అవుతుంది... కాటికి కాళ్ళు చాచుకొని కూర్చున్న ముసలి వగ్గయిన తండ్రి వేడుక కోసం, మూడేళ్ళ పసికూన అయిన మనుమరాలికి వేగిరం పెళ్ళి చేయమని పట్టు బడితే...ఆపై ఆ చిన్నదానికి వైధవ్యం ప్రాప్తిస్తే ఈయన స్వర్గంలో కూర్చుని వుండి ఆ పిల్లదాని దు:ఖానికి అడ్డుపడతాడా? ఆయన కంత వేడుకైతే బొమ్మల వంటి పిల్లలకి కాక బొమ్మల రెంటినీ పల్లకీలో పెట్టి భాజాభజంత్రీలతో ఊరేగించి ఆయన వేడుక తీర్చండి అంటాడు.

హిందూ మత సభ అనే ప్రహసనంలోనే హిందువుల్లోని శైవులు, వైష్ణవులు, శాక్తేయులు, స్మార్తులు మొదలైన వారిలో ఐకమత్యం లేకపోవటాన్ని నిరసిస్తూ, ఈ లోకంలో సత్యంతో సమానమైన ధర్మమేది లేదని, ఇది సర్వ వర్ణముల వారు అనుసరించాలని, ఈశ్వర భక్తి కలవారికి లోకమే కుటుంబమని, కాయక్లేశం చేత, తీర్ధయాత్రలచేత పుణ్యపదం రాదని, మనో జయము చేత మాత్రమే అది సాధ్యమని విశాల దృక్పధాన్ని వెల్లడిస్తాడు.

పుష్కరాల నిమిత్తం ఎక్కడెక్కడో దూరాభారాన్న వున్న వాళ్ళు వచ్చి గోదావరి తీరాన వున్న వారిని యాతన పెట్టటం, మరి కొందరు నదిలో మునిగి ప్రమాదవశాత్తు మరణించటం, అప్పుడు కనబడే అపరిశుభ్రత, అకారణంగా ఆ ప్రాంతంలోని వస్తువుల ధరలు ప్రియం అవటం, దీని వల్ల బీదలకు కష్టం యిదే పుష్కర మహాత్యం అంటూ విమర్శించాడు పుష్కరాలను.

పైపైన కనబడే వేషభాషలే బ్రాహ్మణ్యానికి ప్రతీక అనేవారు, ఇంగ్లీషు చదువుల వల్ల వర్ణసంకరమై పోతోందని గగ్గోలు పెట్టేవారు, కులాచార ధర్మం తిన్నగావుంటే చాలు- తిండి లేకపోయినా ముష్టెత్తుకొనైనా బతక వచ్చుననే వారు వున్నారు. బ్రాహ్మడు ఎంత తప్పు చేసినా వాడ్ని శిక్షించకూడదు అని ఒక బ్రాహ్మడంటే తప్పిదం చేసేవాడు ఎవడయినా సరే శిక్షార్హుడేనని మరో బ్రాహ్మడు అభిప్రాయ పడతాడు. ఇట్లా ఈ ప్రహసనాల్లో ఒక పాత్ర కులాచారం ఎంత దుష్టమైనదైనా అనుసరణీయమే అంటే మరొక పాత్ర దాన్ని ఎదుర్కొంటూ వుంటోంది.

ముసలి వాళ్ళ మళ్ళి మళ్ళి పెళ్ళి ఆరాటం, మూడవది, నాల్గవది అయిన భార్య చనిపోయిన వెంటనే, శవం కూడా లేవకముందే మళ్లి పెళ్ళికి ఆరాట పడటం, అర్జంటుగా పెళ్ళి చేసుకొని యజ్ఞాది క్రతువులు చేసి స్వర్గానికి వెళ్ళి రంభాసంభోగం పొందాలనే కామాతురులు, ఏ మాత్రం

శాస్త్రగౌరవం లేకున్నా శాస్త్రాలన్నింటినీ తమకు అనుకూలంగా అన్వయించుకొనే కుహనా పండితులు, భార్యకు, అన్నానికి, బట్టకు లోపం చేయకుండా వుంటే చాలు ఏ అవసరము తీరనవసరం లేదనుకొనే తమ సుఖాన్ని గూర్చి మాత్రమే ఆలోచించే ప్రబుద్ధులు ఈ ప్రవాసనాల నిండా మనకు కనబడతారు. ఇట్లాటి కొన్ని కొన్ని ఆచారాలు ఆనాటి కాలానికి మాత్రమే చెందినవి కాగా, ఈ నూటయాభై ఏళ్ళల్లో ఆ ఆచారాల తీవ్రత కొంత తగ్గి కొన్నీను, మరొక రూపు సంతరించుకొని మరి కొన్నీను చెదురు మదురుగా కనబడుతోనే వున్నాయి.

ముఖ్యంగా కొన్ని విషయాల్లో ఆయన శాస్త్ర ప్రమాణకంగా చూపిన అంశాలు నేటికి 'నమ్మకం' మీదనే ఆధారపడి ఇంకా అప్పటి వలెనే వాటి ఉనికిని చాటుకొంటూనే వున్నాయి. గ్రహణాలు, శకునాలు, ముహుర్తాలు, యోగాభ్యాసము, వర్షము, రోగచికిత్స, పూర్వాచారాలు మొదలైన వాటి పట్ల ఏ మాత్రం నమ్మకం సడలలేదు.

మేఘాలకు ప్రాణం వుందని, వరుణ దేవుడూ, ఇంద్రుని కృపవల్లనే వర్షాలు పడతాయనీ, వారి దయలేకుంటే క్షామాలు వస్తాయని, బ్రాహ్మలచేత వరుణ మంత్రాలు చదివించి, సహస్ర ఘటాభిషేకాలు చేయిస్తే అదివరకు ఒక చుక్కకూడ పడనిది మూడు రోజుల్లోనే వర్షం కురుస్తుందనే నమ్మకం తప్పని ఇది ఒట్టి మూఢత్వమని, అందువల్ల డబ్బులు వ్యర్ధమవటం తప్ప మరొకటి కాదని అంటాడు. వర్షము అనే ప్రహసనంలో ఇప్పటికీ వర్షాల కోసం చేసే యజ్ఞాలు, కప్పల పెళ్ళిళ్ళు మనం చూస్తూనే వున్నాం కదా!

అమావాస్య నాడే ఎవరు వద్దంటున్నా వినిపించుకోకుండా ఉద్యోగంలో ప్రవేశించిన వీరేశలింగం శకునాలను, ముహుర్తాలను, జ్యోతిష్యాన్ని నమ్మవద్దంటాడు. ఆ వంకతో భయపెట్టి డబ్బులు గుంజేవారి మాటలు పట్టించుకో కూడదని చెప్తాడు.

సూర్యుడికీ, భూమికీ మధ్య చంద్రుడు అడ్డం వస్తే సూర్యగ్రహణం, సూర్యుడికీ చంద్రుడికీ మధ్య భూమి వుండి భూమి నీడ చంద్రుడిమీద పడితే చంద్రగ్రహణం అనే శాస్త్రజ్ఞానాన్ని తిరస్కరించి యిదంతా ఇంగ్లీషు చదువుల మహిమనీ, మన శాస్త్రం ప్రకారం రాహుకేతువులు సూర్యచంద్రుల్ని మింగటం వల్లనే గ్రహణాలు పడతాయని, అందుకే మనం మైల సోకినప్పటి వలె పట్టు విడుపు స్నానాలు చేయాలని చెబుతాడు బ్రాహ్మడు. ఇప్పటికీ మనం ఈ నమ్మకం ఎంత సజీవంగా వుందో చూస్తున్నాం. పైగా గ్రహణ సమయంలో కొన్ని సిద్ధులు ఫలిస్తాయని శిశువుని బలివ్వటాన్ని ఈ 21వ శతాబ్దంలోను చూశాం.

అట్లాగే చదువు సందెలేని వాళ్ళు, జులాయిగా తిరిగేవారు భూతవైద్యుల మంటూ, మంత్ర తంత్రాదులతో వున్న రోగాన్ని ఎక్కువచేసి ప్రాణాలు సైతం పోగొట్టే వారున్నారని చెబుతూ 'ఈ హిందూ దేశానికి ఈ మూఢత్వం ఎప్పుడు వదలిపోతుందో జనులు దేహారోగ్య విధులు తెలుసుకొని చాదస్తం వదలి ఎప్పుడు బాగుపడతారో...' అనే వాక్యాలు అప్పటికే కాదు ఇప్పటికీ వర్తిస్తాయి.

తేలు మంత్రాలు, పాము మంత్రాలు వున్నాయని నమ్మి, ఆ మంత్రం వల్లనే బతికామని వాదించే వారు ఎప్పుడూ వున్నారు. మంత్రంలో గొప్ప మహాత్యం వున్నదనీ, ఉపదేశమైన వాళ్ళు దాన్ని తిన్నగా పునశ్చరణ చెయ్యకపోతే ఫలించదని నమ్మేవారు వున్నారు. అదంతా మన లోపమే కాని మంత్ర లోపం ఏమీ లేదనటం, మంత్రం కాదు, మందుల కోసం ప్రయత్నం చెయ్యమని, వంచకులచేత మోసపోవద్దనీ అన్నవారిని నాస్తికులని దూషిస్తారు.

యోగాభ్యాసము ద్వారా శక్తులన్నీ సంపాదించిన వాడిని నిప్పు కాల్చదని, నీరు ముంచదని, మట్టి కప్పివెయ్యలేదు, విషవాయువులు చంపలేవు. అంతేకాదు ఆకాశ గమనము, కాళ్ళతడి కాకుండా నీళ్ళమీద నడవ గలగటం ఇత్యాది అసాధ్యమైన శక్తులన్ని సమకూరుతాయి అన్నవారితో మరొకడు దీనికి శాస్త్ర ప్రమాణమున్నదా అని ప్రశ్నిస్తే, నీవు నాస్తికుడవు అని నిందిస్తాడు. దానికి ప్రశ్నించిన వాడే సమాధానం చెబుతాడు. ఏ విషయమైనా సత్య శోధనకు పనికి వచ్చేది జ్ఞానమొక్కటే, పరిశోధన సాధనంగా వెల్లడవుతోంది. సత్యమైన జ్ఞానము శోధన చెయ్యనిదే లేశమూ మంత్రాలతో రాదు అని తేల్చి చెబుతాడు. అంతేకాదు మరొక ప్రహసనంలో పూర్వులే బుద్ధిమంతులని, ఇప్పటివారంతా బుద్ధిహీనులనియు, పూర్వాచారాలు మీరి ప్రవర్తించ కూడదన్నది వెర్రిమాట... పూర్వమున్న ఈశ్వరుడే ఇప్పుడే వున్నాడు. పూర్వుల కిచ్చినట్లే ఇప్పటి వారికి బుద్ధి యిచ్చాడు. దాని ఉపయోగించుకోక పోవటం మన తప్పు అంటూ శాస్త్రాలు మనుషుల సౌఖ్యాభివృద్ధికై చేయబడ్డవిగాని, శాస్త్రాల గౌరవం కాపాడుటకై మనుషులు చేయబడలేదని, ఎప్పుడో చేయబడిన శాస్త్రాలు నష్ట కారకములు, పనికి మాలినవి అయినప్పుడు వాటిని

# విగ్రహాలు

- డా. రావి రంగారావు
9247581825



పూలకో, పూల మొక్కలకో, పండ్లకో, పండ్ల చెట్లకో
విగ్రహాలు పెట్టారా ఎప్పుడైనా!
అవెప్పుడూ మన ఎదురుగానే
చిరంజీవులుగా, ప్రాణ దాతలుగా...

కొందరు మనుషు లుంటారు,
దేవుళ్ళతో పోరాడి అమృతం తెచ్చి
ప్రజలకు పంచి పెట్టి దేవుళ్ళయి పోతారు,
దేవుళ్ళకు పెట్టినట్లే జనం
మహాత్ములకు కూడా విగ్రహాలు పెడతారు...
గూండా లొచ్చి తెచ్చిపెట్టిన పెట్టు విగ్రహాలు కావవి,
ప్రజల గుండెల్లోంచి వచ్చిన పుట్టు విగ్రహా లివి...

అసలు విగ్రహా లెందుకు పగలగొడతారు!
నిగ్రహం లేని దుష్ట గ్రహాలే విగ్రహాలు పగలగొడతాయి...
విగ్రహాలు ప్రాణం పోసుకొని తమ ప్రాణం తీస్తాయని
భయపడినవారి ఆగ్రహాలే విగ్రహాలు పగల గొడతాయి...

నేను చీకటి ముద్దలతో చేసిన
విగ్రహాల గురించి మాట్లాడటం లేదు,
పూలో పండ్లో చెట్లో,
ఒక సూర్యుడో చంద్రుడో ఒక మేఘమో
మనుషులుగా పుట్టి మానవత్వాన్ని మోసినవారి
వెలుతురుతో చేసిన విగ్రహాల గురించి మాట్లాడుతున్నాను...

కొన్ని విగ్రహాల్లోంచి నిరంతరం సూర్యోదయ మవుతూనే,
జీవనదులుగా దేశంలోకి దూసుకుపోయే ప్రవాహా లవుతూనే...
సూర్యోదయాన్ని, జీవనదుల్ని పగలగొట్టగలరా!
ప్రాణ వాయువును, కామధేనువును నరికిపెట్టగలరా!

పగలును వెలిగించిన రవి కిరణాలకు
కాలం పెట్టుకున్న విగ్రహాలు చుక్కలు,
వెన్నెల వచ్చి చుక్కల్ని పగలగొడుతూ హంగామా చేసినా
ఆ తరువాత చూడు- అద్భుత కాంతితో చుక్కలు
ఎలా వెలుగుతుంటాయో!

మీరు విగ్రహాన్ని పగలగొట్టారు కాబట్టే
ప్రజ లింకా బలంగా ఆయనను నాటుకొంటున్నారు,
విగ్రహాలకు మూలాలు రోడ్లు కాదు-
ప్రజల మనసులు. ♦

---

మార్చుకోక తప్పదు అంటాడు. అంతేకాదు ఎంతగా శాస్త్ర ప్రమాణాలను చూపుతున్నా, తగవు అన్న వాటిని విడిచి శూద్రాదులు విద్యద్వారా వృద్ధి పొందటం వారి బుద్ధిని వినియోగించటం వల్లనే అంటాడు. ఆ బుద్ధిని వినియోగించకపోతే అభివృద్ధి శూన్యం అవుతోంది కదా!

ఇక ఈ ప్రహసనాల్లో ఆయన ఆయా పాత్రల కుంచిన పేర్లు వారి వారి స్వభావాలను తేటతెల్లం చేసేలా వుంటాయి. వేశ్యాప్రియరావు - విరాగాచార్యులు - జనవంచకాచార్యులు - మతిహీనరావు పంతులు - వివేకభూషణుడు - జమిన్‌దారు దివాంధరాయడు - దివాన్ సత్కరాచార్యులు - గుమస్తా జంబుకరావు - యోగి - అపయోగి - మహాయోగి - అతియోగి - కామావధానులు - దంభవ్రతుడు - బిడాలవ్రతుడు - బకవ్రతుడు - పంతయ్యపంతులు - జంబుకేశ్వరవర్మ పూర్వాచారదీక్షితులు - నవనాగరిక శాస్త్రి - చాదస్తపు చలమమ్మా - ఆచారపు అన్నమ్మ.

ఇట్లా ఈ ప్రహసనాల్లో ఆయన తన నాటికి సమాజంలో ప్రబలివున్న దురాచారాలకు చర్చా రూపమైన, సంభాషణాత్మకమైన ఒక ప్రక్రియ రూపం కల్పించి, ఆలోచింపచేసే అస్కారమిచ్చాడు. మానవాతీతమైన మహాత్యాలను ఖండించాడు. ఆచారాలు, శాస్త్రాలంటూ బూటకాలు చెప్పే వారిని నమ్మవద్దని హెచ్చరిక చేశాడు. ప్రామాణికతలేని అంశాలకు తిలోదకాలిమ్మన్నాడు. ♦

# దిక్సూచి

- డా॥ కత్తి పద్మారావు
9849741695



సంప్రదాయం రాగబద్ధంగా
వినిపిస్తుంది
ఎన్నో గొంతులు పాడిందే
పాడుతున్నాయి
వారి స్వరపేటికలకు
రంధ్రాలవుతున్నాయి
వారు కొలుస్తున్న వారెవరో ఇంత
వరకు
దిగిరాలేదు సుమా!
దేవుళ్ళను సృష్టిస్తూనే వెళుతున్నారు
కొత్త కొత్త రూపాలు, శిల్పవిన్యాసాలు
రాళ్ళకు రప్పలకు ధారబోసిన
రాగమాలికలు వాడిపోయాయి
ఆ శిశువు రణగొణ ధ్వనుల మధ్య
మురుగు కాసారాల మధ్య
పెరుగుతోంది
దోమకాటుకు ఆ బిడ్డకు మలేరియా
వచ్చింది
జ్వరంతో గజగజ వణుకుతోంది
ఆ చెవులకు స్వాంతనమైన మాట
వినిపించుటలేదు.
ఆ నృత్యంలో కళ లేదు
వారు కసరత్తులు చేస్తున్నారు
వికటమైన హాస్యం బీభత్స
రసప్రధానం
అవును! వారు శృతి మధురమైన
ధ్వనుల్లో మునిగిపోయారు
తమను నుతించడం వారికి బాగా
ఇష్టంగా వుంది
తమలో లేనివి దృశ్యమానం
అవుతున్నప్పుడు
వారు భ్రమల వలయాల్లో సుడులు
తిరుగుతున్నారు
అతడు రైలు పట్టాల మీద నడుస్తూ
తన ప్రియురాలితో మాట్లాడుతున్నాడు
అంతలో రైలు అతని వీపును తట్టింది
అతని స్వరం ఇక వినిపించలేదు
అతి స్వరవ్యామోహం
ప్రమాదపుటంచుల్లో నడక
ప్రేమ వేరు, వ్యామోహం వేరు
అక్షరాలకు దూరం అయినపుడు
చిన్న చిన్న ధ్వనులే ఆక్రమిస్తాయి
లక్ష్యం సుదూరంలో వుంది
గమనం మందంగా వుంది
తియ్యనివి చేదుగా ఉన్నాయి
చేదువి తియ్యగా ఉన్నాయి
లేఖనం తగ్గినకొద్దీ
శూన్యం పెరుగుతోంది
లిపి ఓడిపోతుంది బొమ్మగెలుస్తుంది
అబద్ధాల్ని వింటానికి మందలుగా
జనాన్ని తోలుకొస్తున్నారు
గొర్రెల్లా జనం తొక్కిసలాటకు
గురవుతున్నారు
నిప్పుకణికల మీద నడుస్తున్నవాడు
ఎవరినో జపిస్తున్నాడు
క్షణం ఆలస్యమైతే కాళ్ళకు బొబ్బలు
మౌఢ్యం ఆబోతు ఎర్రవస్త్రాన్ని చూసి
రెచ్చిపోయి ఉరకలేస్తుంది
కుండలో ఉంది మజ్జిగని
చెబుతున్నారు
కానీ, అందులో విషగుళికలున్నాయి
నిజాయితీ లోపించాక మనిషి
జీవచ్ఛవం అవుతున్నాడు
నీకు అనుభవం ఎంత వుందని కాదు
నీ మాటలో నీతి వుందా! లేదా! అనేదే
ప్రశ్న
నీవు నీతి పరుడవైతే రోజూ
పరీక్షలెందుకు?
నీకు నీవే లోతైన గొయ్యి ఎందుకు
తవ్వుకుంటున్నావు
పుత్రవ్యామోహం నిన్ను అంధుణ్ణి
చేయలేదా!
నీకు అతి సమీపంలో నీరు
కలుషితమై జనం మరణిస్తుంటే!
నీ మనస్సు ఎందుకు కరగలేదు?
నీ కన్నుల్లో నీరు ఎందుకు
ఎండిపోయింది?
ఎప్పుడైనా ఓ బొట్టు రాలితే
ప్రజలు ఎందుకు నవ్వుకొంటున్నారు
నీవు నటిస్తూ జీవిస్తే ఆ జీవితానికి
అర్థం ఏమిటి?
రోజూ బోనులో నిలబడటం కంటే
దుర్భరమేముంది
అవును! ఎందరో రాజులు వచ్చారు!
పోయారు
నియంతలు, ఆత్మహననానికి
గురయ్యారు
అధికారం అంటే పులివేటా?
జింకలను చీల్చి రక్తాన్ని
పుడిసిలించడమా?
ఆ చూలాలి కాన్పుకు పడకనివ్వలేదు
మరి నీవు వేల కోట్లకు పడగలెత్తావు
అవును! రాజ్యం అంటే అవినీతి
బొక్కసంకాదు
నీవు ఓడినమాట నిజం
జనం గెలిచిన మాట కూడ నిజం
నిజాయితీదే అంతిమ విజయం
వివేచనే మనిషికి గమన దిక్సూచి ♦

# బ్రౌన్ నిఘంటు నిర్మాణ కృషి

- ఆచార్య మూలె విజయలక్ష్మి
9966138779



*వేమన పద్యాల సేకరణ, ఆంగ్లానువాదం, చాటు పద్యాల సేకరణ, మెకంజీ కైఫీయత్తులు **62** సంపుటాలు ఎత్తిరాయించటం అన్నింటి కంటే ఐదు నిఘంటువుల నిర్మాణం బ్రౌన్ భాషా సాహిత్య పాటవానికి గీటురాళ్ళు. **1817**లో అక్షరాలు దిద్ది,**1822** నాటికి అనర్గళంగా మాట్లాడగలిగి **1824**లో నిఘంటువులు నిర్మాణం ఆరంభించారు. బ్రౌన్‌కు ఖ్యాతిని, తెలుగు జాతికి పదసంపద చేకూర్చినవి నిఘంటువులు. బ్రౌన్ అకుంఠిత దీక్షకు పట్టుదలకు, నిర్విరామ కృషికి నిదర్శనాలు. జీవితాన్ని, ధనాన్ని, కాలాన్ని వెచ్చించి, పరిశ్రమించిన కృషీవలుడు.*

**సి.పి.బ్రౌన్** ఆంగ్లేయుడు. పరాయిపాలన పరంగా భారతదేశంలో అధికారిగా నియమితుడు. కానీ తెలుగువారికి ఆత్మీయుడు. తెలుగు భాషా సాహిత్యాలకు అనన్య సేవలందించిన మహనీయుడు. బహుభాషావేత్త. సంస్కృతాంధ్ర పండితుల గ్రంథాలను సంప్రదించి, పరిష్కరణలను, అర్థ నిర్ణయాలను సరిదిద్దగల దిట్ట. పలు ప్రాచీన తెలుగు కావ్యాల ప్రతులను సేకరించి, పరిష్కరించి, ప్రచురించి తెలుగు తల్లి కర్పించిన భాషాకోవిదుడు. సి.పి.బ్రౌన్ కృషి లేకపోతే ఉత్కృష్టమైన తెలుగు కావ్య సంపద కొంతయినా శిలమైపోయిండేదేమో!

వేమన పద్యాల సేకరణ, ఆంగ్లానువాదం, చాటు పద్యాల సేకరణ, మెకంజీకైఫీయత్తులు 62 సంపుటాలు ఎత్తిరాయించటం అన్నింటి కంటే ఐదు నిఘంటువుల నిర్మాణం బ్రౌన్ భాషా సాహిత్య పాటవానికి గీటురాళ్ళు. 1817లో అక్షరాలు దిద్ది,1822 నాటికి అనర్గళంగా మాట్లాడగలిగి 1824లో నిఘంటువులు నిర్మాణం ఆరంభించారు. బ్రౌన్‌కు ఖ్యాతిని, తెలుగు జాతికి పదసంపద చేకూర్చినవి నిఘంటువులు. బ్రౌన్ అకుంఠిత దీక్షకు పట్టుదలకు, నిర్విరామ కృషికి నిదర్శనాలు. జీవితాన్ని, ధనాన్ని, కాలాన్ని వెచ్చించి, పరిశ్రమించిన కృషీవలుడు. వీరు నిర్మించిన నిఘంటువులు ఇప్పటికీ వాడుకలో ఉంటూ పునర్ముద్రణలు పొందుతున్నాయి. నిఘంటు నిర్మాణానికి అవసరమైన ప్రామాణిక ప్రయోగాల కోసం ప్రసిద్ధి గ్రంథాలను సేకరించారు. తెలుగు ప్రజలందరూ తనకుచదువు చెప్పిన గురువులని కృతజ్ఞత తెల్పిన వినయశీలి. తెలుగు బిడ్డలకు ధర్మబడులు పెట్టిన దానశీలి.

సి.పి.బ్రౌన్ కడప జిల్లాధికారి (1820)గా, మచిలీపట్నంలో న్యాయమూర్తి (1822-38)గా, పర్షియన్ భాషానువాదకులు (1858)గా పదవులు నిర్వహించారు. వీరు ఐదు నిఘంటువులు నిర్మించారు. అవి బ్రౌణ్య తెలుగు - ఇంగ్లీషు (1852), బ్రౌణ్య ఇంగ్లీషు - తెలుగు (1853), బ్రౌణ్య మిశ్రభాషా నిఘంటువు (1854), జిల్లా నిఘంటువు (1855), లఘుకోశం (1852).

1855లో ఇంగ్లండుకు వెళ్ళిన తర్వాత విల్సన్ - కోర్టు రెవిన్యూ పదజాల పట్టిక మార్పులు చేర్పులు చేశారు. జాన్సన్ ఇంగ్లీషు నిఘంటువుకు అనుబంధం కూర్చారు.

బ్రౌణ్య తెలుగు - ఇంగ్లీషు నిఘంటువుకు మూడు రకాల ప్రతులు లభ్యమవుతున్నాయి. 1852లో సి.పి.బ్రౌన్‌చే

ముద్రించిన ప్రతి. ఈ ప్రతి కడప సి.పి.బ్రౌన్ గ్రంథాలయంలో భద్రపరచబడింది. తెలుగు పర్యాయపద నిఘంటు నిర్మాణ సందర్భంలో ఆచార్య జి.యన్. రెడ్డిగారి వద్ద వుండేది. ఈ నిఘంటువు యథాతథంగా పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వ విద్యాలయంచే 2007 లో ముద్రించబడింది. అనుబంధంగా మిశ్రభాషా నిఘంటువు ఉంది.

రెండవ ప్రతి ఎం. వెంకరత్నం, డబ్ల్యుహెచ్, క్యాంప్‌బెల్, రావుబహద్దూర్ వీరేశలింగం పంతులు పరిష్కరించిన ప్రతి. ఏషియన్ ఎడ్యుకేషనల్ సర్వీసెస్, న్యూఢిల్లీ వారిచే 1903లో ముద్రించబడింది. పరిష్కర్తలు మార్పులు చేర్పులు చేశారు. నాటి ప్రతి 2004, 2005, 2006 నాలుగు పునర్ముద్రణలు పొందింది.

మూడవ ప్రతి బ్రౌణ్య తెలుగు - ఇంగ్లీషు నిఘంటువు ఆవంచ సత్యనారాయణ విక్టరీ పబ్లికేషన్స్‌చే ముద్రితం. 1854 నాటి మిశ్రభాషా నిఘంటువు దాని ముందు Explanation to Telugu Alphabetical చేర్చబడింది. వ్యాకరణ గ్రంథం కూడా ఇవ్వబడింది. సి.పి.బ్రౌన్ జీవిత రేఖలు, బ్రౌన్ పరిశీలించి మద్రాసు ప్రాచ్యలిఖిత భాండాగారానికి సమర్పించిన పుస్తకాలు, సి.పి.బ్రౌన్ భాషాసాహిత్య, వ్యాకరణాలు తదితర కృషిని Biography of C.P.Browns Principal of Works శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయంచే ముద్రించబడిన Literary Autobiography సి.పి.బ్రౌన్ నుంచి గ్రహించి ముద్రించారు.

1852 నాటి సి.పి.బ్రౌన్ తెలుగు - ఇంగ్లీషు నిఘంటువు నేటికి ప్రమాణంగా వుంది. దీనికి మూల ఆకరం కాంబెల్ నిఘంటువు. ఇంకా అనేక పద్యగద్య కోశాల నుండి పదసేకరణ జరిగింది.

అమరకోశానికి వచ్చిన వివిధ తెలుగు వ్యాఖ్యానాలు, విల్సన్ సంస్కృత - ఇంగ్లీషు నిఘంటువు, శబ్దార్థకల్పతరువు, ఆంధ్రనామ సంగ్రహం, ఆంధ్రదీపిక, ఆంధ్రభాషార్ణవం, ఆంధ్ర భాషా బూషణం, ఓరుగల్లు పదజాలం, కర్కంబాడి నిఘంటువు నుండి ఆరోపాలు గ్రహించారు. ఆంధ్ర నామసంగ్రహం, ఆంధ్రనామశేషము, వెంకటేశ నిఘంటువు, సాంబనిఘంటువు ఈ నాలుగు పద్య నిఘంటువులలోని పదాలు ఆకారాదిలో కూర్చినది కర్కంబాడి నిఘంటువు. ఇంకా తమిళ, కన్నడ, బెంగాలీ నిఘంటువులను సంప్రదించారు.

నిఘంటువుల నుండే కాకుండా ప్రజల వ్యవహారంలోని అనేక పదాలు చేర్చారు. 1824లో ప్రారంభించిన నిఘంటువు 1844లో ముద్రణకు ఆదేశాలు వచ్చినా, వంద తెలుగు గ్రంథాల నుండి ఉదాహరణలు పొందుపరిచారు. కాంబెల్ నిఘంటువులో 14,862 పదాలుంటే అదనంగా 16,203 పదాలు చేర్చినట్లు బ్రౌన్ పేర్కొన్నారు.

వర్ణక్రమంలో అచ్చులు వరసగా పాటించినా, హల్లుల విషయంలో ఒక వర్గంలోని అను నాసికాక్షరం తప్ప తక్కిన వాటినన్నిటినీ వర్గక్రమంలో కూర్చారు. ఉదాహరణకు ఒక వర్గాన్ని గమనిస్తే క,ఖ,గ,ఘ; కా,ఖా,గా,ఘా; కి,ఖి,గి,ఘి; కు, ఖు, గు, ఘు... ఇలా క్రమం పేర్కొన్నారు. అందులో కూడా ఆరోపాలు కలగాపులగంగా ఉన్నాయి. శ,ష,స ఒకటిగా హ,ళ,క్ష విడివిడిగా ఇచ్చారు.

అంతకుముందు కాంబెల్, మారిస్ తమ నిఘంటువులలో అర్ధానుస్వారం పాటించినా బ్రౌను ఉపరిహరించారు. దంత్యతాలవ్య చ, జల భేదం పాటించలేదు. అది ప్రత్యేకంగా గుర్తింపవలసిందికాదని పేర్కొన్నారు. సాధుశకటరేఫల భేదం పాటించలేదు. మామిడి వెంకటయ్య తమ కాలానికే వాడుకలో లేవన్న బండిరాలను, అరసున్నలను ఉత్తరోత్తర గ్రాంథికవాదులు రెక్కపట్టుకొని తీసుకువచ్చి గ్రంథాలలో చొప్పించారనీ, బ్రౌను పరిశీలించిన కావ్యాల రాతప్రతులలో లేదని ఆరుద్ర పేర్కొన్నారు. బ్రౌన్ నిఘంటువులో అరసున్న, శకటరేఫం లేని పదాలు సూర్యరాయాంధ్ర నిఘంటువులో (1936) అరసున్న, శకటరేఫతో కన్పిస్తాయి. ఉదా : మెఱుఁగుడునూనె, మెఱుఁగెక్కు, మెఱుఁగురిక్క వంటివి అనేకం. తెలుగు వ్యుత్పత్తి కోశంలో కూడా అరసున్న, శకట రేఫ పాటించారు.

రెండవ ప్రతిలో సజాతీయ సమస్త పదాలనన్నిటినీ ఒక సమూహంగా ఇవ్వడం ప్రధాన మార్పు. ఉదా : దేవతరువు, దేవతాజీవము, దేవతాడిచెట్టు, దేవదత్తము, దేవదత్తుడు, దేవదారువు, దేవదాసి, దేవనాగరి, దేవభూతము, దేవసాయుజ్యం, దేవత్వం, దేవమణి, దేవమాతృకము, దేవ యజ్ఞం, దేవతా విమానం.....వగైరాలన్నీ దేవుడు ఆరోపంలో ఇవ్వబడినాయి. ఇలా సముహాలుగా ఇవ్వడం వల్ల అకారాదిలో పదం దొరకదు.

అంతేకాక బ్రౌన్ పాటించని దంత్యతాలవ్య చ, జలు రెండో ప్రతిలో పాటించి ఆరోపాలు ప్రత్యేకంగా చూపించబడ్డాయి.

మొదటి ప్రతిలోని కావ్య ప్రయోగాలను

అనవసరమనిపించిన వాటిని రెండో ప్రతిలో తొలగించామని పరిష్కర్తలు ముందు మాటలో తెల్పారు. ఉదా: తొడరుట అనే ఆరోపంలో పోరాడుట, యుద్ధముచేసుట, మార్కొనుట, పోరుట, పొందుట, పూనుట, విజృంభించుట, చెలరేగుట, అర్థాలిస్తూ ఆయా అర్థాలకు సంబంధించి 19 ప్రయోగాలు వివిధ కావ్యాలనుండి బ్రౌను ఇచ్చారు. రెండో ప్రతిలో కలుగు, పూను, యత్నించు, సక్తమగు, తొట్రుపడు, అనుసరించు, ఎదిరించు, ప్రాపించు అనే అర్థాలకు మూడు ప్రయోగాలు మాత్రమే ఇచ్చి ఏ అర్థంలో ఏ ప్రయోగమో కూడా సూచించలేదు. ఇలా తొలగించటం వల్ల ఆయా అర్థాలను సూచించే ప్రాచీన కావ్య ప్రయోగాలు నిఘంటువులో లేకపోవడమే కాకుండా, అర్థావగాహనలో స్పష్టత పోతుంది. ఆయా అర్ధఛాయల కనుగుణంగా ఇచ్చిన ప్రయోగాలు అవసరం.

నిఘంటువుల అధ్యయనం వల్ల ప్రాచీనపదాలు, వాటి అర్థాలు, ప్రయోగరీతులు, సామాజిక, సాంస్కృతికాంశాలు వెల్లడవుతాయి. సి.పి.బ్రౌన్ తెలుగు - ఇంగ్లీషు నిఘంటువును పరిశీలించినపుడు నేడు జంట పదాల్లో మాత్రమేకన్పించే రెండో పదం వ్యస్తంగా ప్రయోగం వున్నట్లు తెలుస్తోంది. గొడ్డు గోద, గడ్డీ గాదం వంటి జంటపదాల్లో రెండో పదానికి కూడా అర్థాలున్నాయి. గోద - any horned Cattle, a beast గొడ్డు గోద Kine, a bull

గొడ్డు - a beast యెనపగొడ్డు,

ఎలుగుగొడ్డు, చిరుతగొడ్డు అనే పదాల్లో గొడ్డుతో సమస్త పదాలు కన్పిస్తాయి.

గడ్డీ గాదం జంట పదంలో గాదం అంటే Knot grass that infests field of dry grain;

గడ్డీ, ఆకు, కలుపుగడ్డి అని తెలుగు వ్యుత్పత్తి కోశంలో అర్థం.

కొన్ని ప్రాచీన పదాలు ఈ నిఘంటువుల్లో కన్పిస్తాయి. జానుగు (కంకి); తిడిమి (రథంపోయేటపుడు మోత); దుంత (దున్నపోతు), తద్దె (పండుగ) తదితరాలు

మేన - విశేషంగా మేనమరిది, మేనవదిన, మేనమరదలు, మేబావ వంటి బంధుత్వ వాచకాల్లో ఉంది. నేడు మేనత్త, మేనకోడలు, మేనల్లుడు, మేనమామ అనే పదాల్లోనే ఎక్కువ వాడుక.

కొన్ని పదాలు నేడు అర్థవిపరిణామం పొందినట్లు గమనించవచ్చు.

సవ్వడి - జాడ (ప్రా), శబ్దం (ఆధు).

ముఠా - Sub division of district (ప్రా) (అక్రమ పనులు చేసే) గుంపు (ఆధు)

పారణ - వ్రతాంతభోజనము, ఉపవాసం ఉండి మరునాడు చేసే భోజనం (ప్రా)పండుగ మరుసటిరోజు (ఆధు)

పెంట A heap, as dirt sweeping or trash, a dung hill

కోళ్ళపెంట, తుమ్మలపెంట, గొల్లపెంట పాదాల్లో Spot, land అని అర్థం.

పశువుల మలం అనీ, ఇబ్బంది కల్గించే విషయం అని నుడికారంగా నేడు వాడుక ఆ పెంట మనకెందుకు అని ప్రయోగం.

కొన్ని జాతీయాలకు సహజార్థం అక్షణార్థం రెండూ సూచింపబడినాయి. ఉదాహరణకు : వాని చేతికి నరాలు లేవు : he has no nerves in his, hand i.e., he is a very open handed man.

పదాల్లో కాలక్రమంలో జరిగిన ధ్వని మార్పులు గుర్తించవచ్చు. పదాది సంయుక్తాక్షరాల్లో రకారం ఉన్న రూపాలు అధికంగాను, రకారం ఉన్న లోపించిన రూపాలూ రెండూ ఉన్న ఆరోపాలు ఉన్నాయి.

**ఉదా :** క్రంత, క్రక్కు, క్రంప, క్రుళ్ళు క్రుంకు, క్రిందు; క్రానుగు - కానుగ మ్రాసు - మాను క్రొత్త కొత్త

ఒకభాషా పదజాలం సమాజ సంస్కృతిని ప్రతిబింబిస్తుంది. ఆచార వ్యవహారాలు, సంస్కృతి సంబంధి అంశాలు విశదంగా ఇవ్వడం ఈ నిఘంటువులోని మరో ప్రత్యేకత.

చిమ్మిరి, చిమ్మిలి, or చిమ్మిలుంటలు - a Sweetmeat made of fried sesamum seeds with dry coconut kernel and sugar. It is eaten during pregnancy

ఆరతి Or హారతి Or మంగళహారతి Oblation or wave offering an offering of lights, or of water, turmeric and chunam, waved over a deity or over any individual, to take off the supposed ill effects of the evil looks. This ceremony is performed at marriages or on other happy occasions, it answers to lustration or sprinkiling with holy water.

అరశతాబ్ది కిందట పల్లెల్లో చప్పటగా flooring

నాపరాయి పరిచిఉన్నా ఇల్లంతా పేడతో అలికేవారు. చక్కని పేడనీళ్ళు చల్లేవారు. ఇప్పుడు ఇంటి ముందర మాత్రమే కళ్లాపి చల్లుతున్నారు. పట్టణాల్లో కళ్లాపి Or పు ఆరోపం ఇల్లంతా పేన్నీళ్ళు చల్లే పద్ధతిని తెల్పుతోంది.

**కళ్లాపి** Or **పు:** Cow ding and water sprinkled over the floor of a houses or used marks (see బరగడ) on heaps of grain రెండో ప్రతిలో ఈ ఆరోపం లేదు.

ప్రాచీన కాలంలో బండి, రథచక్రాలు రాయితో చేసేవారని అంశం బండికల్లు ఆరోపం తెల్పుతోంది. బండికల్లు Or కల్లు The wheel of a carriage or cart కల్లు, రథచక్రము D; కల్లు is a stone as the wheels were originally made of stone and such are still seen in remote towns.

నెట్టుబుట్టనగోలలు, గోర్పిల్లాడు (పుట్టచెండాడు) ఈనెగాజులువంటి నాటి ఆటల పేర్లు దూడలగొట్టిగాడు, పిడేరపుగువ్వ, దేవరాయికొంగ వంటి పక్షుల పేర్లు అనేకం ఈ నిఘంటువులో పొందుపరచబడినాయి.

**బ్రౌణ్య ఇంగ్లీషు - తెలుగు నిఘంటువు :** పాశ్చాత్యులు నిర్మించిన ఇంగ్లీషు - తెలుగు నిఘంటువులలో జె.యస్. మారిస్ నిర్మించినది మొదటిది. బ్రౌన్ ఇంగ్లీషు - తెలుగు నిఘంటువు రెండవది. 1853లో ముద్రితం. తెలుగు - ఇంగ్లీషు నిఘంటువుకు సమాంతరంగా ఈ నిఘంటు నిర్మాణం జరిగింది. ఆంగ్ల సాహిత్యగ్రంథాలు చదవని తెలుగు వారికి సులభం చేయటమే ప్రధాన ఉద్దేశమని బ్రౌన్ పేర్కొన్నారు.

**బ్రౌణ్య మిశ్రభాషా నిఘంటువు :** తెలుగు భాషపై అన్యభాషా ప్రభావాన్ని తెలుసుకోవటానికి ఈ నిఘంటువు బహుప్రయోజనకారి. మధ్యయుగాల్లో పర్షో అరబిక్ పదాలు తెలుగులో అనేకం చేరాయి. తెలుగు - ఇంగ్లీషు నిఘంటువుకు అనుబంధంగా ఇవ్వబడింది. ఆరోపం తెలుగు లిపిలో పక్కనే ఏ భాషా పదమైతే ఆ లిపిలో, తర్వాత రోమన్ లిపిలో ఉంది. అర్థం ఆంగ్లంలోను, తెలుగులోను తెల్పారు. మొత్తం ఆరోపాలు 2286. హిందూస్థానీ, ఆంగ్ల, తమిళ, కన్నడ, బెంగాలీ, ఒరియా తదితర భాషల నుంచి చేరిన అన్యదేశాలున్నాయి. పదసేకరణ బ్రౌన్ సేకరించిన లేఖలు, మెకంజీ రికార్డ్సు, బ్రౌన్ పనిచేసే న్యాయస్థానంలో రికార్డ్సు నుండి చేశారు.

తెలుగు భాషనుండి అన్యభాషా పదాలు తొలగించడానికి వీలుగా కొన్ని చోట్ల తెలుగు పర్యాయపదాలు సూచించారు.

బస్తా : A bale of goods నగ, కట్ట, మూట

మన్నా / మనా Prohibition, hindrance, prevention అభ్యంతరము, అడ్డి

ఈ పదం దేవుడీమన్నాచేయు జాతీయంలో ఉంది.

దేవుడి; దేవిడీ. కోటవాకిలి, నగరవాకిలి, దేముడీమన్నాచేయు అంటే ఓడించు అని అర్థం.

ఈ నిఘంటువులోని పదాలన్నీ ప్రజలువాడే పదాలేనని, సాధ్యమయినంతవరకు రాసేటప్పుడు, మాట్లాడేటప్పుడు విదేశీ పదాలు పరిహరించాలని బ్రౌన్ సూచించారు.

మహమ్మదీయ పాలన కాలంలో వేలాది పార్సీ, అరబిక్ భాషాపదాలు దక్షిణ భారతీయ భాషల్లో కలిసిపోయాయి, నేడు హిందూస్థానీ పదాల స్థానంలో ఆంగ్లపదాలు చేరుతున్నాయని అభిప్రాయపడ్డారు. ఆంగ్లేయుల పరిపాలన సంబంధం కలవారికి ఆంగ్లభాషా పరిచయం అవసరం కారణంగా నిత్యవ్యవహారంలోను, వ్యాపార సంబంధిగాను అనేక ఆంగ్లపదాలు చేరినట్లు ఇంగ్లీషు - తెలుగు నిఘంటువు ముందుమాటలో పేర్కొన్నారు.

మిశ్రభాషా నిఘంటువులోని చాలా పదాలు రెండవ ప్రతిలో కలుపబడినాయి. కొన్ని పదాలకు అదనపు అర్థాలను, సమస్త పదాలను చేర్చారు. భావార్థక రూపాలు, క్రియారూపాలుగా మార్చబడినాయి.

అడుచుట - To close, to shut మూసివేయుట అందులో నాలుగు వాకిళ్ళు అడిచియున్నవి four of the gates are closed, Walled up ఆ గుడ్డలను ఈ పెట్టెలో అడుచు. the clothes into the box) అని మొదటి ప్రతిలో ఉండగా, అదనంగా Also, V.a. To beat, strike, thrash. To destroy కొట్టు, నశింపచేయు. "ఎమ్ములిరియగ శిలతో నడిచిన' p.i.729 అడుచుకొను a d u t sukonu v. to cntract, choke, be stopped

ఆ కాలవలో ఇసుక అడుచుకొన్నది The channel is choked with sand రొమ్మడుచుకొన్నది He has a contraction of the chest గొంతు ఆడుచుకొన్నది మాట్లాడకూడలేదు His throat is hoarse, he cannot speak.

కొన్ని పదాలు తొలగింపబడినాయి. **ఉదా:** అట్కారి, అట్కాపు, అట్టవగై, అడుపు, అడ్డాకులచెట్టు తదితర ఆరోపాలు చేర్చలేదు.

మూడవ ప్రతిలో ఎమ్. వెంకటరత్నం తదితరులు

# రేడియో కట్ట

- ఈ.రాఘవేంద్ర
9494074022



తలపై చిన్నగదిని
దేహంపై రెండుచెట్లను కలిగి
నింపాదిగా నడి ఊరున
శయనిస్తున్న ఆకాశం....

పుష్పగర్భంలో దుద్దులా
రాత్రి వెన్నెలను తనలోకి ఒంపుకొని
పల్లెనదిని ఈదుతున్న నావ

అదొక వెలుతురు రేఖ
ట్రాఫిక్ పోలీస్ నిలబడినట్లు
దిక్సూచిలా వుండేది
దానిని చూసినప్పుడల్లా
మావూరి
స్టాచ్యూఆఫ్ లిబర్టీ అనిపించేది

మావూరి చరిత్రకు
సాక్ష్యంగా నిలబడిన పతాకం
దేశ స్వతంత్ర సంగ్రామానికి ప్రతీక

దేశంలోని విషయాలన్నీ అక్కడే
రెక్కలు వాల్చేవి
సాయంత్రం అయిందంటే
చెవులను కళ్ళు చేసుకొని
అక్కడ ఊరుఊరంతా
వాలిపోయే వాళ్ళం
టీవీలొచ్చాక
రేడియో రెక్కలు మూగబోయినా
ఆనాటి తీపిగుర్తులా
కట్టడం నిలబడే ఉండేది

బడిగంట ముగియగానే
రెక్కలల్లార్చుకుంటూ వాలిపోయే వాళ్ళం
పిల్లల ఆటలైన
పెద్దల ముచ్చట్లయిన
డ్రామాలు,రికార్డింగ్ డాన్సులు,చర్చలూ
ప్రక్రియ ఏదైనా
పాత్రధారులు ఎవరైనా
వేదిక మాత్రం అదే !

కుంగిపోయిన పొద్దు
అవనతం చెందినట్లు
రోడ్డువిస్తరణలో
కట్టడం హత్య చేయబడింది
ఒక సుదీర్ఘ చరిత్ర
మౌనంలోకి జారుకుంది

నేనూరికెళ్లిన ప్రతీసారి
నా రెండు కళ్ళను పుష్పాలను చేసి
అక్కడ సమర్పిస్తుంటా
నా మదిని జ్ఞాపకం
గునపమై తవ్వుతూనే వుంటుంది ♦

---

పరిష్కరించిన నిఘంటువుకు మిశ్రభాషా నిఘంటువు అనుబంధంగా ఇచ్చారు. ఆయా భాషల లిపులను తొలగించారు. ఆరోపం ఏ భాషా పదమో సూచించటానికి తమిళ కన్నడాది భాషా పదాలను మాత్రమే భాషలను సూచించారు. తక్కినవన్నీ హిందుస్థానీ పదాలుగా భావించవచ్చు. బ్రౌన్ మిశ్రభాషా నిఘంటువులోని పదాలను తెలుగు - ఇంగ్లీషు నిఘంటువు (రెండవ ప్రతి)లోని అన్యదేశాల మార్పులు చేర్పులను ప్రత్యేకంగా అధ్యయనం చేయవలసిన అవసరముంది. 1852లో ప్రకటించిన తెలుగురీడరుకు అనుబంధంగా 4000 పదాలతో కూడిన లఘుకోశం చేర్చబడింది. వ్యవహారిక పదాలకు ఆంగ్లంలో అర్థం వివరించబడింది. తెలుగు నేర్చుకొనే పాశ్చాత్యులకు ప్రయోజనకారి. జిల్లా నిఘంటువు 1852లో నిర్మాణం అయింది. ఈ నిఘంటువులోని పదాలు విల్సన్ ఎగ్లోసరీ ఆప్ జుడిషియల్ అండ్ రెవిన్యూటర్మ్స్ సంకలనంలో చేరాయి. తెలుగు ప్రజల అవసరాల దృష్ట్యా నిర్మించినా పున: పరిశీలించాలనీ బ్రౌన్ పేర్కొన్నారు.

బ్రౌన్ నిఘంటు నిర్మాణ కృషి అభినందనీయం. భాషాపరిణామాన్ని గుర్తించటానికి, తెలుగుపై అన్యభాషా ప్రభావాన్ని అధ్యయనం చేయుటానికి సామాజిక సాంస్కృతాంశాల్లో వచ్చిన మార్పును అనుశీలించటానికి బ్రౌన్ నిఘంటువులు ప్రయోజనకారి. వ్యవహారభాషా పదజాలానికి నిఘంటువులో స్థానమిచ్చిన వారిలో బ్రౌన్ అగ్రగణ్యుడు. వీరి నిఘంటు నిర్మాణ కృషి స్ఫూర్తిదాయకం. ♦

# ఇంటిపాదాల వద్ద...

- పొనుగుమట్ల అశోక్‌కుమార్
9959379709



అమ్మ మసలిన ఇంటిస్పర్శ కోసం
గుండె తలుపులను బార్లా
తెరుచుకొని
పేగుబంధం ముడిపడిన
పుట్టిన ఊరులోని
ఇంటికి వెళుతున్నాను
తాడుతో కట్టిన లేగదూడను
పాలకోసం వదిలినప్పుడు
ఒక్కసారిగా తల్లి దగ్గరకు దూకినట్టు
అప్పుడప్పుడు ఉన్నట్టుండి నన్నెవరో
భుజాన్నెత్తుకొని మోసుకెళ్ళినట్టు
అమ్మలేని ఇంటికి వెళుతుంటాను

ఇంటికి వెళ్ళాలన్న చిన్న తృప్తే గాని
అమ్మను మరిపించే
అనురాగపు వర్షం కురవని
అనావృష్టి స్థితిలో
అమ్మలేని ఇంటికి వెళ్ళడం
నీరులేని బావిలోకి చేదను
వదిలినట్టుగా ఉంటుంది
అమ్మ ఉన్నప్పుడు ఇల్లు
ఇల్లంతా నాకు అమ్మలానే
కనిపించేది. ఇప్పుడు నా కళ్ళకు
అనాకారంగా కనిపిస్తుంది
అమ్మ ఫొటోను
గుండెలకు హత్తుకున్న ఇంటిగోడ
నావైపు మౌనంగా... దీనంగా
చూస్తుంటుంది. అవును
ఆ గోడ ఆవేదన నాకు ఎరుకే

ఇంటిగోడకు జారబడి
కూర్చునేది అమ్మ
ఇప్పుడు అమ్మ ప్రాపుకు దూరమైన
ఇంటిగోడ అమ్మ ఫొటోను గుండెలపై
అపురూపంగా మోస్తున్నది

కోడిపిల్లలు తల్లికోడి
రెక్కల్లోకి దూరిపోయినట్టు
అమ్మమాటల కొంగులో
ఒదిగిపోయేవాడిని. ఇప్పుడు
ఆ మాటల జ్ఞాపకాల తడికోసం
నన్నునేను తవ్వుకుంటాను
మజ్జిగను చిలికిన కవ్వం
మెత్తని వెన్నను పట్టినట్టు
ఇల్లంతా కలియతిరిగి
అమ్మతో ఆనందంగా గడిపిన
తియ్యని బాల్యపు తేనెతుట్టను
ఎదనిండా పిండుకుంటాను

వేడిపాలు చల్లారి
పైకి మీగడ తేలినట్టు
చల్లని మంచు కురిసినట్టు
అమ్మకు నామీద కోపం
వచ్చిన కాసేపటికి...
అమ్మ నాపై ప్రేమనిండిన
చిరునవ్వులను ఒలగబోసి
లాలిత్యంతో బుజ్జగించేది.
ప్రాణం లేచివచ్చినట్టుగా ఉండే
ఆ బుజ్జగింపుల నిధికోసం ఇప్పుడు
ఇంటిని అణువణువు శోధిస్తాను.

ఇంటిలో ఉన్నంతసేపు
మౌనముద్రలో నన్ను నేను
అరగదీసుకుంటూ
నాలో నేను పెనుగులాడుతున్నప్పుడు...
సుడిగుండాలైన నా కళ్ళనుంచి జారిన
అశ్రువులతో అమ్మకు నివాళులర్పిస్తాను
అమ్మ తుదిశ్వాస విడిచిన
ఇంటిపాదాల వద్ద మోకరిల్లి ◆

---

# దహనవాటిక

- రత్నాల బాలకృష్ణ
9440143488



దహించేది
ఒక అణువయినపుడు
దహించబడేదీ
ఒక అణువే
దహనం
నిరంతర ప్రక్రియ అయినపుడు
దగ్ధమవడానికి
భయపడతావెందుకు?

శ్వాస నిశ్వాస క్రియలో
నిరంతరం వేల అణువులు
దగ్ధమవుతునే వుంటాయి
చైతన్యం శ్వాసగా మారితే
దేహమంతా చైతన్య స్రవంతే!
ఆ స్రవంతి

అణువుకీ అణువుకీ మధ్య
అంగారమై
జ్వలించిపుడు
ప్రతిదేహమూ
ఒక దహన వాటికే ! ◆

# జీవన సౌరభం

కావేరిపాకం రవిశేఖర్
9849388182



సాయంత్రం.....

పగలుకి, రాత్రికి మధ్య ఎన్నో వేల యేళ్ళ నుంచి జరుగుతున్న పోరాటానికి ప్రత్యక్షసాక్షి. ఎవరు గెలిచారో చెప్పలేక నానాతంటాలు పడుతోంది. రోగికి పథ్యం కింద పాత మద్యం లాంటి పద్యం వద్దంటే గుటుక్కుమని మింగి, కిసుక్కున నవ్వుతూ రాగం తీస్తోంది. ఆకాశం నగ్నంగా నిలుచుంటే దానికి సాయంత్రం సంజె రంగుల బట్టలు కట్టబెడుతున్నట్టుంది.

అది నగరానికి దూరంగా వుండే కాలని. అక్కడ అద్దె తక్కువ. అటువంటి కాలనిలో మూలనున్న ఇంటిలో.......కాదు...కాదు... ఓ గదిలాంటి ఇంటిలో ఉంటున్నాడు. రెండు నెలలుగా అద్దె కట్టడంలేదని ఇంటి ఓనరు ఒకటే పోరు. ఒకట్రెండు రోజుల్లో సామాను గిరవాటేస్తానని ఖండితంగా చెప్పాడు.

ఆ సామానంటూ ఏముంది? దండెం మీద రెండు జతల బట్టలు, ఓ చిరిగిన పంచె, మూలన నిండీ నిండని కుండ,..ఓ పాత గ్లాసు, కొన్ని ఇంజనీరింగు పుస్తకాలు, ఓ చింకి చాప అతని లాగే.

అతనో ఇంజనీరింగ్ గ్రాడ్యుయేట్, తొంభై శాతం మార్కులతో పాసైనవాడు. అతనికింకా ఉద్యోగం రాలేదు. రోజూ ఇంటర్వ్యూలకు హాజరవడం, అతనికి రాకపోవడం. దాంతో అతను బాగా కుంగిపోయాడు. ఎంతలా అంటే అదే తన జీవితంలో ఆఖరిరోజు అన్నట్టు.

అదేం చిత్రమో గాని ఎక్కడో ఓ అగ్రరాజ్యం అలిగి కూర్చుంటే ఇక్కడ మనదేశంలో కుర్రాళ్ళకు ఉద్యోగాలు రాకపోవడం. అతడు తనలో తనే ఇలా అనుకున్నాడు "కాలేజి రోజుల్లో ప్రపంచం కలర్ ఫుల్ గా కనిపిస్తుంది. కష్టాల్లోనే కురూపిగా కనిపిస్తుంది".

చాప మీద నుంచి లేచాడు. నిన్నటి నుంచి ఏమి తినకపోవడంతో తూలి పడబోయి గోడని ఆసరా చేసుకొని నిలబడ్డాడు. ఓ గ్లాసు నీళ్ళు తాగాడు, కాస్త ఉపశమనం లభించినట్టుంది. బయటకెళ్ళి బకెట్ లోని నీళ్ళతో, అరిగిపోయిన సబ్బుముక్కతో మొహం కడుక్కున్నాడు. ఆ సబ్బుముక్క కాకి కూడా పట్టుకెళ్ళలేనంతగా అరిగిపోయుంది.

నెమ్మదిగా గదిలోకొచ్చాడు. పాత టవల్తో మొహం తుడుచుకున్నాడు. దండెం పైనున్న బట్టలు వేసుకున్నాడు.

నెమ్మదిగా వెళ్ళి అద్దం ముందు నిలబడి లేని ఓపిక తెచ్చుకొని తల దువ్వుకున్నాడు. డబ్బాలోని విభూతి వేలికి కూడా అందనంత అడుక్కొచ్చేసింది. దాన్ని నీటితో తడిపి నుదిటిపై మూడు వేళ్ళతో పెట్టుకున్నాడు.

దాంతో ఊళ్ళోని అమ్మా, నాన్న గుర్తుకొచ్చారు. నెమ్మదిగా రెండు చెంపలపైకి జారాయి కన్నీటిబొట్లు వాటికి ఓపిక లేనట్లు. గతం అతని నుదుటిపై బొట్టై నిలిచింది.

ఊర్లో వాళ్ళ నాన్న ఓ గుళ్ళో పూజారి. అదీ ఆదాయం లేని గుళ్ళో. దారిద్ర్యం వాళ్ళింటి చుట్టూరా పందిరి వేసుకున్నట్టుంది. గుడి మాన్యం తాలూకు డబ్బు ఎప్పుడూ సరిగా ఇవ్వరు. ఊరి పెద్ద మనుషులకు గుడి, చెరువు రెండు కళ్ళు. ఎందుకంటె అవే వాళ్ళకు ఆదాయ మార్గాలు. వాళ్ళెప్పుడూ ప్రశ్నించని దేవుడిని ప్రశంసిస్తూనే ఉంటారు. ఓ రోజు అతడు అమ్మా! నేను సిటీకెళ్ళి ఉద్యోగ ప్రయత్నాలు చేయాలన్నాడు. దానికి వాళ్ళ నాన్న, సిటీలో ఉండడమంటే ఖర్చుతో కూడుకున్న పని అన్నాడు. అమ్మా నాకు కాస్త డబ్బు సర్దితే చాలని పట్టుబట్టాడు. వాళ్ళని, వీళ్ళని అడిగి ఎలాగోలా కాస్త డబ్బు సర్దుబాటు చేశాడు. ఇది జరిగి సుమారు ఆరు నెలలైంది.

అద్దం ముందు విభూతి దిద్దుకొని ప్యాంటు జేబును తడుముకున్నాడు, ఆఖరి అయిదు రూపాయల బిళ్ళ తగిలింది. రేపట్నించి మెయిల్ చూసుకునేదానికి లేదన్నమాట! ప్ఛ్.... అనుకున్నాడు.

విసురుగా తోలిన గాలికి నోట్ బుక్ పేజీలు ఎగిరి ఎప్పుడో తను రాసింది కనిపించింది. అది ఇలా వుంది "మనసు లేని రూపాయిది మరో తత్వం, " లేని వాడిని ఊరించి, ఉడికించి వెంట తిప్పుకుంటుంది. ఉన్నవాడింట్లో జాగ్రత్తగా ఊడిగం చేస్తుంది".

అతని రూంకు దగ్గర్లోనే ఓ ఛారిటబుల్ ట్రష్టు వాళ్ళు నిరుపేదలకు అయిదు రూపాయలకే అన్నం ప్యాకెట్, సుమారు యాభై మందికి ఇస్తారు. నిన్నటి రోజు ఇతగాడికి అన్నం దొరకలేదు.

నెమ్మదిగా చెప్పులు వేసుకొని రూం లోంచి బయటకొచ్చాడు. బాగా నీరసంగా ఉన్నాడు. అయినా రెండు చేతులు ప్యాంటు జేబుల్లో పెట్టుకొని రొడ్డు పైకొచ్చాడు. సిటీకి దూరంగా ఉన్నా హడావుడి మాత్రం ఉంటుంది. స్కూళ్ళ నుంచి వచ్చె పిల్లలను తీసుకెళ్ళే వాళ్ళు, ఫ్యాక్టరీల నుంచి ఇళ్ళకెళ్ళేవాళ్ళతో సందడిగా ఉంటుంది.

జనం....జనం...ఎక్కడ చూసినా జనం. లోకంలో ఓ వైపు కడుపు నిండినా తింటూనే ఉండేవాళ్ళు కొంతమందైతే, కడుపు మండే ఆకలితో అల్లల్లాడే వాళ్ళు ఎంతో మంది. అక్కడకు కాస్త దూరంగా ఓ చెత్తకుండీ పక్కనే చిత్తు కాగితాలు, పాతసీసాలు ఏరుకునే పిల్లల గుంపు ఒకటి. వీళ్ళే మన రేపటి భాగ్య విధాతలు అనుకుంటూ ముందుకు కదిలాడు.

మరికొంత ముందుకెళ్తే అక్కడో వైన్ షాపు. ఎప్పుడూ జనాలతో కళకళలాడుతుంటుంది. ఆ షాపు ఓనర్‌కు కాసుల పంట, కాని వీళ్ళిళ్ళల్లో మాత్రం ఆకలి మంట. అక్కడ పేదవాడి చేతిలోని ఆఖరి రూపాయిని వదలరు, చిత్రంగా గుంజుకుంటారు. " దారిద్ర్యానికి వ్యసనం ఆప్తమిత్రుడు మరి".

ఆ ట్రస్టు గది ముందు అప్పటికే క్యూ ఉంది. తనూ వెళ్లి క్యూలో నించున్నాడు ఈ రోజు అన్నం ప్యాకెట్ దొరుకుతుందన్న భరోసాతో. ''ఆకలి మనిషిని శాసిస్తుంది... శోషిస్తుంది".

అక్కడ ప్యాకెట్ ఇచ్చే వ్యక్తి ఒకతన్ని ఎగాదిగా చూసి నీ క్కూడా ప్యాకెట్ కావాలయ్యా? నెలకు అరవై, డెబ్బై వేలు అద్దెలొస్తాయి, పదెకరాలు భూస్వామివి ఏంటయ్యా? ఇది. అనడిగితే అతను కినుక్కున నవ్వి మాఆవిడ రుచిచూద్దామంటే? అంటూ పట్టుకుపోయాడు. "లోకానికి అన్నం పెట్టేవాడు అన్నదాత. మరి ఇటువంటి వాళ్ళనేమనాలో?

అక్కడ ప్యాకెట్‌లు అయిపోతున్నయి. అతనిలో ఆందోళన మొదలైంది. ఇతగాడు అక్కడికి వెళ్ళేసరికి ఆఖరి ప్యాకెట్ ఉంది. ఇతను అయిదు రూపాయల బిళ్ళతీసిచ్చాడు.

అంతలో ఓ ముసలాయన డొక్కలు ఎండి బక్కచిక్కిన ఒళ్ళు, చింపిరి జుట్టు... పీక్కు పోయిన కళ్ళు.. అస్థిపంజరానికి చర్మం తొడిగినట్టున్నాడు. బాబ్బాబూ ఒక్క ప్యాకెట్ ఇవ్వు బాబూ, మా ముసిల్దానికి రెండు రోజుల్నించి తిండి లేదు బాబూ అన్నాడు. కౌంటర్ తలుపు మూసి వెళ్ళిపోయాడు. నేను ప్యాకెట్ తో వెనుదిరిగా.

ఆ ముసలాయన కళ్ళ నిండా నీళ్ళతో అక్కడినుంచి కదిలాడు. ఊరుకోని మనసు ఆయన వెనకే నన్ను నడిపించింది. ఆ ముసలాయన కాలనీ దాటి ముందుకెళు తున్నాడు. మసక చీకట్లు నెమ్మదిగా ముసురు కుంటున్నాయి. నెమ్మదిగా రోడ్డుకు దూరంగా ఉన్న పాతమండపం వైపు

# పూల రెక్కల చప్పుడు

- కటిక మనోహర్
9885533562

డేగ రెక్కల నీడలో
సాగితున్న నరమేధంలో
విరుగుతున్న పూల రెక్కల శబ్ధాలు
మానవత్వపు గుండెల్లో
దిగుతున్న పిడిబాకులు



రక్తపు మరకల పాలబుగ్గలు
రిక్త హస్తాల ఆర్ధనాదాలు
శకలాల్లో పెల్లుబుకుతున్న కన్నీటి ఊటలు
సమితులకు శిఖరాగ్రాలకు వెక్కిరింతలు

తెగిపడ్డ ఒక్కో శరీరం
వందల ప్రశ్నలై
తిరిగి జన్మిస్తుంటే
సమాధానల్లేక సిగ్గుపడుతున్న
మీ మతగ్రంథాల బూడిదను
ప్రపంచపు ఆవలి ఒడ్డుకు విసిరేయండి
చిన్నారుల సమాధులపై కడుతున్న
మీ సింహాసనాల పేర్లను
స్మశానాలుగా మార్చుకోండి

నవ్వులపై తూటాల వర్షం
పువ్వులపై క్షిపణి యుద్ధం
ప్రకటించిన మీ కోసం
జంతుశాస్త్రంలో మరో కొత్త తరగతి అత్యవసరం

కనిపించని ఉగ్రవాదులు
కనీ పెంచిన ఉగ్రవాదులు
కలసి చేస్తున్న మారణహోమంలో
సమిధలవుతున్న చిరునవ్వులను
తిరిగి పూయించడానికి
దేశాల పరిధులన్నీ చెరిపివేసి
ప్రపంచపు దారులన్నీ ఏకం చేద్దాం ◆

---

కదిలాడు.

అక్కడ ఓ ముసలావిడ పడుకొనుంది. అయ్యా! తెచ్చావా అంది నీరసంగా.... ఆమె గొంతు ఎక్కడో నూతిలోంచి వస్తున్నట్టుంది. లేదే ఇయ్యాల కూడా దొరకలేదే అన్నాడు నిరాశగా. పోన్లేయ్యా పాడు పేనం నిన్ను కట్టపేడ్తాంది. ఎదవజనమ...ఎదవజనమ అని కంటి నిండా నీళ్ళు పెట్టుకుంది.

ఓ సోస్...నిన్నటి దాకా నువ్వు పాసిపని సేస్తున్నావు, అప్పుడు లేదా అన్నాడు. అయినా నిన్ను ఈ వొయసులో కట్టపెట్టడం ఏం బాగలేదయ్యా అంది బాధగా. వొయసేందే పిచ్చిదానా, నేను ఎంటీవోడ్నే...ఎంటీవోడ్నే రిచ్చా ఎక్కానంటే అంటా కండలు సూపిస్తుంటే, బోసి నవ్వులు పువ్వులై రాలాయి.

వాళ్ళకు బతుకు మీదున్న ఆశ చూసి వీళ్ళు పండుటాకులు కాదు పడి లేచే కడలి తరంగాలు అనుకున్నాడు. వాళ్ళ జీవితం స్ఫూర్తినిచ్చింది. తాత ఈ అన్నం తీసుకోండి అన్నాడు అతగాడు.మరి తమరికో బాబు అన్నాడు. ముందు మీరు తినండి, అయినా తాతా నీ మనవడి లాంటోడ్ని నన్ను తమరు అనొద్దు. అయినా నీ నోటి కాడి కూడు మేం ఎలా లాక్కొనేది నాయనా అంది ఆ ముసలావిడ.

దాంతో అతను అయితే ఉన్నదాన్నే అందరం తిందాం అన్నాడు. దానికి ఆ ముసలామె అన్నం కలిపి నువ్వు తిను నాయనా అంది.

దానికి అతడు అవ్వా! నువ్వు పెట్టేది అన్నం ముద్ద కాదు, రేపటి బతుకుకు నువ్విచ్చిన భరోసా ఇది అని కళ్ళ నీళ్ళు తుడుచుకుంటూ తినసాగాడు. తిన్నాక అవ్వ ముంతలోని నీళ్ళిచ్చింది. అవి తాగాక మిగిలిన నీళ్ళతో మొహం కడుక్కున్నాడు.....బంధనాలు తొలగిపోయిన పక్షిలా... ఉద్యోగం అంటే పని. అది ఆఫీసుల్లోనే కాదు...ఏదైనా ...ఎక్కడైనా. "ఆశపడి బతకాలి అంతే కాని ఆశకు లోబడి కాదు"

చిందే స్వేదం...అదే నవ వేదం...ఆ జీవనసౌరభం నెమ్మదిగా నాల్గువైపులా గుబాళిస్తూ....... ◆




# వర్తమాన సామాజిక కవితా చిత్రం

- రాచపాళెం చంద్రశేఖర రెడ్డి
9440222117

***జీవితానికీ కాగితానికీ మధ్య
రాకపోకలు సాగిస్తున్న కవిత్వం
మానవత్వాన్ని ఊపిరిగా చేసుకొని
అడుగులు వేస్తుంది*** (రాతి నిశ్శబ్దం : పు 87)

'రాత్రి సూర్యుడు' కవిగా కెరె జగదీశ్ ప్రసిద్ధుడు. ఆయన అనంతపురం జిల్లాలో ఒక చివరన ఉన్న రాయదుర్గం నుండి వచన కవిత్వాన్ని పండిస్తున్నాడు. ఆరు దశాబ్దాలు నిండిన జగదీశ్, కవిత్వరంగంలోకి ఇంత ఆలస్యంగా ప్రవేశించినా, రెండున్నర దశాబ్దాలుగా నిలకడగా కవిత్వం రాస్తున్నాడు. జగదీశ్ 21వ శతాబ్దంలో తొలి తరం కవి 'సముద్రమంతగాయం' 'రాత్రి సూర్యుడు' తర్వాత ఇప్పుడు ఈ 'రాతి నిశ్శబ్దం' కావ్యాన్ని ప్రచురించాడు. ఇందులోని కవితలన్నీ ఇటీవలి ఆరేడు ఏళ్ళలో రాసినవే.

సమాజానికీ సాహిత్యానికీ ఉండే సంబంధం, సాహిత్యం నిర్వహించవలసిన కర్తవ్యం పైన పేర్కొన్న ఖండికలో కవి పేర్కొన్నాడు. ఈ సంపుటిలోని 61 కవితలనూ జాగ్రత్తగా చదివితే, జగదీశ్ కవిత్వంలో కేంద్రవస్తువు మానవత్వమేనని అర్థమౌతుంది. ఈ కావ్యంనిండా కవి మానవత్వాన్ని అన్వేషించాడు. మానవత్వాన్ని కలవరించాడు, పలవరించాడు. ఈ అన్వేషణ ఎందుకు? ఈ కలవరింత, ఈ పలవరింత ఎందుకు? అది నేటి సమాజంలో లేదు గనక. మానవ సమాజంలో మానవత లోపించడం అంటే సమాజం తలకిందులుగా వ్రేలాడడమే. తలకిందులుగా ఉన్న సమాజాన్ని నిలువుగా నిలబెట్టడమే రచయితలూ, కళాకారులూ చేయవలసిన పని. కెరె జగదీష్ 'రాతినిశ్శబ్దం' కావ్యంలో ఈ పనే చేశాడు.

మానవత్వం అంటే నానాగడ్డీ కరచి కోట్లు కూడబెట్టి, అందులోంచి అర్థశాతమో, ఒకశాతమో పుణ్యకార్యాల పేరుతో విరాళాలివ్వడం, దానధర్మాలు చేయడం కాదు. మానవత్వం అంటే మనిషి మనిషితనాన్ని నిలుపుకోవడం. ఒక మనిషి సాటి మనుషుల పట్ల సహజ మానవసంబంధాన్ని కొనసాగించడం. ఒక మనిషి సాటి మనిషి పట్ల బాధ్యతగా వ్యవహరించడం. మానవత్వానికి మనిషిలోని మనిషితోనే సంబంధముండాలి. కులం, మతం, పదవి, హోదాలతో కాదు. భారతీయ సమాజం "మీరేవుట్లు?" సమాజం. మనిషి మనిషితనాన్ని కోల్పోయి కులమతాలవంటి కృత్రిమ చట్రాల్లో ఇరుక్కుపోయిన సమాజం. సాంకేతిక వైజ్ఞానిక విప్లవాలు సాధిస్తున్న కొలదీ, ఇనుమడించవలసిన మానవత్వం,

అదృశ్యమౌతూ ఉండడం విషాదం. వస్తువులకు, యంత్రాలకు, సొంత లాభాలకు బానిసై మనిషి మనిషిని విస్మరించడం మానవత్వం అదృశ్యం కావడమే. అదృశ్యమైన మానవతను కెరె జగదీశ్ అన్వేషిస్తూ ఈ కావ్యం రాశాడు. 'మానవత' అనే మాట ఉపయోగించిగానీ, ఉపయోగించకుండాగానీ, జగదీశ్ ఈ ప్రతి కవితలోనూ మానవత్వ అన్వేషణ చేశాడు. అనేక జీవిత సందర్భాలను, సన్నివేశాలను, సంఘటలను చిత్రిస్తూ వాటిలో లుప్తమైన మానవతను గుర్తు చేశాడు.


కెరె జగదీశ్

*మనిషి వాసనకు దూరమై*
*నీలోని మానవత్వాన్ని*
*నీవే పాతిపెట్టుకోవడం*
*నిన్ను నీవే కోల్పోవడం కాదా?* (పు. 79)
*ఒక కన్నీటిచుక్కను*
*తన ఒడిలో అక్కున చేర్చుకోవడమే*
*మానవీయత* (పు. 80)

వంటి వాక్యాలు ఈ కావ్యం నిండా తారసపడతాయి. మానవత్వ అన్వేషణలో, మానవత్వ స్థాపనలో కవి ఉపాధ్యాయునిగా, ప్రవచనకారునిగా, తాత్వికుడుగా అనేక రూపాలలో కనిపిస్తాడు. గుర్రం జాషువ ఏ వస్తువు మీద కవిత్వం రాస్తున్నా అంతర్లీనంగా అస్పృశ్యవేదన తొంగి చూస్తూ ఉంటుంది. జగదీశ్ ఏ వస్తువుమీద కవిత రాసినా అంతర్లీనంగా మానవత్వాన్వేషణ తొంగిచూస్తూ ఉంటుంది.

సోవియట్ రష్యా, తూర్పు యూరప్ పరిణామాల తర్వాత అమెరికా ఏకైక అగ్రరాజ్యంగా నిలబడి (?) ప్రవేశపెట్టిన ఎల్‌పిజి వ్యవస్థను అనేక దేశాలు తమ ప్రాదేశిక వాస్తవికతతో సంబంధం లేకుండా, ఆమోదించవలసిన, ఆహ్వానించవలసిన భయంకర పరిస్థితి దాపురించింది. ప్రపంచీకరణతో ప్రపంచమంతా ఒక కుగ్రామంగా మారిపోతుందని ప్రచారం జరిగింది. కాని వాస్తవంలో ప్రతి మనిషినీ ఒక ప్రత్యేక ప్రపంచంగా మార్చివేసింది ప్రపంచీకరణ. పెట్టుబడిదారీ వ్యవస్థ పరిపక్వదశ ప్రపంచీకరణ. అది మనిషికీ మనిషికీ మధ్య ఉండే సంబంధాన్ని తుంచి వేస్తున్నది. మానవ సంబంధాలలోంచి రక్త సంబంధాలలోంచి మానవత్వం అనే గింజను చంపేసి, మానవ సమాజాన్ని వంజెగా మార్చివేస్తున్నది. ప్రపంచీకరణ అనే మొరటు ఆయుధంతో రెండు దశాబ్దాలు భారతీయుల్ని చావమోదిన పాలకులు, ఆ తర్వాత సంస్కరణలకు మానవముఖం (హ్యూమన్ ఫేస్) ఉండాలని గుర్తించారు. అధికారానికి గండం ఏర్పడే సరికి మానవముఖం గుర్తుకు వచ్చింది. ఈ లోపల జాతికి జరగవలసిన నష్టం జరిగిపోయింది. ఈ దుర్మార్గం మీద యుద్ధమే "రాతి నిశ్శబ్దం".

ప్రపంచీకరణ ప్రవేశించిన తర్వాత కంప్యూటర్ విద్యకు ప్రాముఖ్యం పెరిగింది. చదివితే కంప్యూటర్ చదువే చదవాలి. ఉద్యోగం చేస్తే అమెరికాలోనే చేయాలి అని రూఢి అయిపోయింది. విదేశీ ఉద్యోగం కుటుంబానికే కాదు, దేశానికే గౌరవం అనే అభిప్రాయం కలిగించగలిగారు పాలకులు. ఫలితంగా కన్నవాళ్ళకు పుట్టిన వాళ్ళకు దూరం పెరిగింది. అంతేకాదు, ధన సంపాదనే జీవిత పరమార్థంగా స్థిరపడింది. మనిషి మనిషిగా కాకుండా, మారకపు వస్తువయ్యాడు. భూమి అంగడి సరుకైంది. వృత్తులు నాశనమయ్యాయి. వృత్తికారులు నాశనమయ్యారు. కొందరు సంపన్నులయ్యారు. అనేకులు దరిద్రులయ్యారు. వ్యాపారం సహజ నీతిని కోల్పోయింది. ఫలితంగా సమాజంలో అమానవీయత తాండవం చేస్తున్నది. కెరె జగదీశ్ తన కావ్యం నిండా మానవతను అదృశ్యం చేస్తున్న అనేక దుష్పరిణామాలను విమర్శనాత్మకంగా ప్రతిబింబించాడు.

స్వదేశంలో ఉన్నా, విదేశంలో ఉన్నా తల్లిదండ్రులను సంతానం నిరాదరించడం ఇటీవల ఎక్కువైంది. తల్లిదండ్రులను పట్టించుకుంటే తమ అభివృద్ధి సాధ్యం కాదని పిల్లలు భావించే స్థితిని కల్పించింది. ప్రపంచీకరణ ఈ అన్యాయాన్ని జగదీశ్ 'క్షమించు తల్లీ!' 'మరణానికి ముందే' వంటి కవితల్లో ఆత్మ విమర్శనాత్మకంగాను, ప్రబోధాత్మకంగాను ప్రతిబింబించాడు.

*అమ్మా......*
*నీవెచ్చని ఒడిలో / గోరుముద్దలు తినిపిస్తూ*
*మా అంతరంగాలలో / వయొలిన్ రాగాలను వినిపించావు.....*
*కాని మేము / మానవత్వాన్ని విస్మరించి*
*నీ భారాన్ని మోయలేక... నిన్ను*
*అనాథను చేశాం...... మాలోని స్వార్థం*
*మాతృరుణాన్ని గుర్తించలేకపోయింది.* (పు. 31, 32)

అని తల్లికి తాము చేసిన ద్రోహాన్ని కన్నబిడ్డలే గుర్తించి పశ్చాత్తాప పడినట్లు జగదీశ్ చిత్రించారు. ఇది తల్లిదండ్రులను నిరాదరించే నేటి తరం వారికి కనువిప్పు కలిగించే కవిత. ప్రపంచీకరణ మత్తులో జోగుతూ తమ మూలాలను మరచిపోయేవారిని ఈ కవిత తట్టి లేపుతుంది. 'మరణానికి ముందే' కవిత కన్నతండ్రిని పట్టించుకోనివాళ్ళ మీద కవితాగ్రహం వ్యక్తం చేస్తుంది.

**కొనవూపిరితో వున్న కన్నతండ్రినే**
**కాటిలోదించి చేతులు దులుపుకున్న నీవు**
**మనిషెలా అవుతావు?**

కవి కంఠం ఎంత తీవ్రంగా ఉందో ఈ కవితలు ధ్వనిస్తాయి.

త్యాగానికీ, అనురాగానికీ ప్రతిరూపమైన మాతృత్వం కూడా ఇవాళ ఒక వ్యాపారమైపోయింది. సహజ తల్లులు అద్దె తల్లులౌతున్నారు. తమకోసం కనవలసిన బిడ్డలను, పేదరికం వల్ల కావచ్చు, మరో కారణం వల్ల కావచ్చు, ఇతరుల కోసం కని అమ్మే వ్యవస్థ వచ్చేసింది. ఇది అవసరాలకు మించిన వ్యాపార రూపం కూడా తీసుకుంటున్నది. పేదరికం, ఆర్థిక అవసరాలు బహుశా మాతృత్వాన్ని అంగట్లో సరుకును చేస్తున్నాయి. ఒక తల్లి తాను కన్నబిడ్డను అమ్ముకోవలసి రావడం, ఇతరుల కోసమే కనవలసి రావడం మానవతలోపించిన సమాజ వ్యవస్థకు సంకేతం. మానవత్వం లేనిది తల్లులకు కాదు, వ్యవస్థకు. జగదీశ్ ఈ అద్దె తల్లుల వ్యవస్థ మానవతారాహిత్యం మీద విమర్శపెట్టాడు. తల్లి గర్భంలోని శిశువే బిడ్డల వ్యాపారానికి చరమగీతం పాడమని తండ్రిని బోధిస్తున్నట్లుగా "చరిత్ర క్షమించదు" కవిత రాశారు. అలాగే "మనిషితనం ఎక్కడ?" అనే కవితతో ఈ ప్రసక్తిని తెచ్చి అధిక్షేపించారు.

**అమ్మతనానికి పాదాభివందనం చేసిన**
**మానవత్వం సిగ్గుతో ఉరేసుకుంది....**
**అమ్మతనాన్ని**
**అద్దెగదిలోకి మార్చిన మగతనమా ఇక**
**నీ వీర్యకణాల్ని విపణివీధిలో**
**అమ్మకానికి పెట్టి**
**నీ మగతనాన్నీ నోట్ల కట్టకింద**
**సమాధిచేసుకో**
**మానవీయతను విస్మరించిన నీకు**
**మనుగడ ఈ ప్రశ్నార్థకమైన వేళ**
**దగ్ధమౌతున్న మానవత్వపు విలువలు**
**అస్తమించకముందే**
**మానవత్వపు జెండాను ఎగురవేయమని**
**అద్దెగర్భంలోని శిశువు తలెత్తి అర్థించింది** (రాతినిశ్శబ్దం. పు.44, 45)

భ్రూణహత్యల దుర్మార్గం భారతదేశంలో అవిచ్ఛిన్నంగా కొనసాగుతున్నది. సైన్సు అభివృద్ధి అనేక విప్లవాలు తెస్తున్నా, అది స్త్రీలకు అన్యాయం చేస్తున్నది. కాదు సైన్సును పురుషస్వామ్య వ్యవస్థ దుర్వినియోగం చేస్తున్నది. పుట్టబోయేది ఆడబిడ్డ అని ముందే స్కానింగ్ ద్వారా తెలుసుకొని చంపేయడం మానవత్వం గల మనుషులు చేసే పని కాదు. ఈ దుర్మార్గం మీద తెలుగు కవులు ప్రారంభం నుంచీ ఉద్యమిస్తున్నారు. జగదీశ్ అందులో భాగస్వామి అయ్యారు. "ఇట్లు నీ మానసపుత్రి" కవిత చదివిన వాళ్ళ ఉద్విగ్నతకు లోనుకాకపోరు.

**అమ్మా !... ఎందుకిలా చేశారు?**
**నేను ఆడపిల్లననేగా**
**ఇంత ఘాతుకానికి ఒడిగట్టారు..**
**నీ ప్రేమ పొరల్లో**
**మొలకగా వూపిరి పోసుకున్న**
**నన్ను**
**చిదిమివేయడానికి మనసెలా వచ్చిందమ్మా !**

(రాతినిశ్శబ్దం : పు.25) అని ఈ కవితలో గర్భస్థ శిశువు ప్రశ్నిస్తుంది. ఈ ప్రశ్న అనేకమంది తల్లిగర్భంలోనే గొంతునులిమి వేయబడుతున్న అమ్మాయిల ప్రశ్నలకు ప్రతినిధి. ఈ ప్రశ్నకు పురుషస్వామ్య వ్యవస్థే సమాధాన చెప్పాలి. వైజ్ఞానిక శాస్త్రాన్ని దుర్వినియోగం చేస్తున్న వాళ్ళు సమాధానం చెప్పాలి.

శాస్త్ర సాంకేతిక రంగాలలో మనం ఎంత అభివృద్ధి సాధిస్తున్నా, భారత దేశంలోని మౌలికాంశాల పట్ల పాత ఆలోచనల నుండి పాత ఆచరణల నుండి బయటపడలేకపోతున్నాం. అలాంటి మౌలికాంశాలలో స్త్రీలపై దౌర్జన్యం కాండ ఒకటి.

స్త్రీలు చదువుకొని అనేక రంగాలలోకి ప్రవేశిస్తున్నారు. "ఎక్కడమ్మా నీవు లేనిది!" అనిపించుకుంటున్నారు. వంట ఇంటి నుంచి విశాల ప్రపంచంలోకి అడుగుపెడుతున్నారు. ఆధునిక పరిజ్ఞానం, ఆధునిక చింతన పెరిగేకొలదీ సమాజంలో ప్రజాస్వామ్య విలువలు పెరగాలి. స్త్రీ విషయంలో భారతదేశం ఇంకా ప్రజాస్వామికం కావలసే ఉంది. స్త్రీలపైన

నిత్యం జరిగే దాడులను నిరసిస్తూ జగదీశ్ "ఒక దీర్ఘ నిశ్శబ్దం" కవిత రాశారు.

***వేదికలు మారినా/ వేదనల తీరు ఒక్కటే కదా!/ ఆడతనం ఆవేదనకు అంతం లేదు కదా..../ దాహం తీర్చుకొనేందుకు/ మానవత్వాన్ని దగ్ధం చేస్తూ/ ఎక్కడబడితే అక్కడ కక్కుర్తిపడి/ పశుత్వాన్ని ప్రదర్శిస్తున్నాయి*** (రాతి నిశ్శబ్దం : పు. 55,56)

అనే విమర్శ పాఠకులకు స్త్రీ వేదనల పట్ల ఆలోచనలను రేకెత్తిస్తుంది. ఆకతాయితనం యువకుల సహజ లక్షణంగా మారిపోవడానికి యువజన విధానం అన్నది జాతీయ స్థాయిలో గాని, రాష్ట్ర స్థాయిలోగాని లేకపోవడమే కారణం. యువతను రాజకీయ ప్రయోజనాలకు ఉపయోగించు కున్నంతగా, దేశ పునర్నిర్మాణంలో ఉపయోగించుకొనే ప్రణాళిక లేదు. యువతను గాలికొదిలేసిన సమాజంలో నష్టపోతుంది స్త్రీలే. బయటి సమాజంలో భారతీయ, మహిళలు అనుభవిస్తున్న బాధలు వర్ణనాతీతం. 'వీక్షణా వేదికలు' కవితలో ఈ వాస్తవికతనే జగదీశ్ చిత్రించారు. నిజానికి ఈ కవిత పెళ్ళిచూపుల తతంగం మీద రాసినది.

"ఓ... ఆడపిల్లకు జన్మనివ్వడమే నేరమా" అని ప్రశ్నించారు ఈ ప్రశ్నకు బదులేదీ? చిన్న బిడ్డల్ని ఒళ్ళోనో, భుజానో వేసుకుని అడుక్కునే స్త్రీలు భారతదేశంలో ఏ ఊరికి వెళ్ళినా కనిపిస్తారు.

***శిలువను మోస్తున్న యేసులా/ శిశువును భుజానికేసుకున్న పేదరికం*** (రాతినిశ్శబ్దం : పు.72) అని 'కన్నీటి కడలిలో' జగదీశ్ చేసిన ఊహ వాస్తవాన్నే ధ్వనిస్తున్నది. జగదీశ్ స్త్రీ ప్రపంచాన్ని అనేక పార్శ్వాల నుంచి పరిశీలించారు. భారతీయ మహిళల బాధామయ గాథల్ని కవితీకరించారు.

భారతదేశాన్నేగాక, మొత్తం ప్రపంచాన్నే ప్రమాదం అంచుకునెట్టి వేస్తున్నది ఉగ్రవాదం. పెట్టుబడిదారీ దేశాలకు అభివృద్ధి చెందుతున్న దేశాలకు మధ్య అంతరాలు పెరగడంలో ఉగ్రవాదం విజృంభిస్తున్నది. మతపరమైన ఉగ్రవాదం అంతర్జాతీయ రూపం తీసుకుంటున్నది. మానవ సంచారం ఉన్నచోట ప్రేలుళ్ళు, దాడులు పెరిగి విధ్వంసం జరుగుతున్నది. హైదరాబాదులోని దిల్‌షుక్‌నగర్, లుంబినీ పార్కు, గోకుల్‌చాట్, చార్‌మినార్ వంటి ప్రదేశాలలో జరిగిన బాంబుదాడులు, పేలుళ్ళు మానవ నాగరికతను, నవ్వులపాలు చేశాయి. మతమౌఢ్యంలోని మానవత్వరాహిత్యాన్ని అవి చాటి చెప్పాయి. "మతం మత్తు మందు." అన్న కార్ల్‌మార్క్స్ ప్రవచనం ఎంత నిజమో రుజువుచేశాయి. ప్రజాతంత్ర దృక్పథం గల కళాకారులెవరూ ఈ మౌఢ్యం చేసే మృత్యునృత్యాన్ని సహించరు. కెరె జగదీశ్ సామాజిక స్పృహ ఉన్న కవి. విశ్వ జనీన మానవసంబంధాల పట్ల విశ్వాసం గల కవి. ఉగ్రవాదం ఉక్కుపాదాల కింద నలిగిపోయే మానవీయతను ఆయన గుర్తించారు. "ప్రతిమరణం కన్నీటి ప్రవాహమ్" కవితలో

***అకస్మాత్తుగా/ ఆకాశం నుండి రాలిన విధ్వంసం/ శవాల జాతరను సృష్టించింది.... / శిథిల బీభత్సాలుగా నగ్నశరీరాలతో/ ఆవరించిన చీకట్లో/ చల్లారని దుఃఖాగ్నితో మానవత్వం చచ్చిపోయింది.*** (రాతినిశ్శబ్దం : పు. 65,66)

అని దిల్‌షుక్‌నగర్ పేలుళ్ళను విమర్శించారు. ఈ మారణకాండతో దద్దరిల్లుతున్న నేలను "విలక్షణమరుభూమి" అనడం విలక్షణ అభివ్యక్తి. ఈ దుర్మార్గాలకు అడ్డుకట్ట వేసేది ఎవరు? అని ప్రశ్నించిన కవే

***కన్నీటి కళ్ళాపి జల్లిన హృదయాలపై/ శాంతిగీతాలు ఆలపిద్దాం*** (పైది)

అని పిలుపునిచ్చారు. లుంబినీపార్కు, గోకుల్‌చాట్ కవి 'శవాలజాతరగా' ఉపమిస్తూ

***అంతా క్షణాలలోనే/ దిక్కుతోచని మానవత్వం/ గుండెలు పగిలి ఉలిక్కిపడింది/ జడలువిప్పిన ఉగ్రవాదం/ మానవత్వపు గుండెలపై/ మాంసపు ముద్దలను పేర్చింది*** (రాతినిశ్శబ్దం : పు. 99) అనడం గుండెలను పిండే అభివ్యక్తి.

భారతీయ సమాజం గురించి ఎవరెన్ని గొప్పలు చెప్పుకున్నా, వాటిని మరపింపజేసే సిగ్గుపడే విషయాలు కూడా చాలా ఉన్నాయి. ఒక దేశంగాని, ఒక సమాజంగాని అందులో లాభపడినవాళ్ళకు గొప్పవనిపిస్తాయి. నష్టపోయిన వాళ్ళకు అవి గొప్పవనిపించవు. భారతీయ సమాజంలోని దళితవ్యవస్థ మనదేశ మానవత్వం ముందు, లౌకికత ముందు పెద్ద ప్రశ్న. వర్ణ/కులవ్యవస్థలోని అమానుషత్వానికి నిలువెత్తు నిదర్శనం దళిత వ్యవస్థ. ఈ దుర్మార్గం మీద భారతదేశచరిత్ర పొడవునా ప్రతిఘటనలు జరుగుతూనే ఉన్నాయి. హైటెక్ యుగంలోనూ ఈ వ్యవస్థ సజీవంగా ఉండడం పెద్ద వైరుధ్యం. దీనిమీద ప్రాచీన కవి పాల్కురి సోమన నుండి నేటిదాకా అనేకులు కవిత్వ యుద్ధం చేస్తూనే ఉన్నారు. కెరె జగదీశ్ 'కొల్లాడిగారు', 'మట్టి అద్దం' కవితలలో దళిత వ్యవస్థలోని మానవత్వ రాహిత్యాన్ని ప్రశ్నించారు. మొదటి కవితలో శంభూకుని ప్రస్తావన, రెండవ కవితలో ఏకలవ్యుని ప్రస్తావన తెచ్చారు. ఈ ప్రస్తావన కవి సామాజిక దృక్పధానికి చిహ్నం. కొల్లాడిగారు చెప్పులు కుట్టి బతికే వ్యక్తి.

**తపస్సు చేసిన నేరానికి/ శంభూకుని తలను తెగనరికిన నేలపై/ పంచముడిగా పుట్టి/ చెప్పులు కుట్టినంత మాత్రాన/ అంటరానితనాన్ని ఒళ్ళంతాపూసి/ చీదరించుకున్న సమాజం** (రాత్రి నిశ్శబ్దం: పు. 107) అని వృత్తి గౌరవం లేని సమాజం అమానవీయతను ఎత్తిచూపిన కవి జీవితాన్ని వెతుక్కుంటూ వెళుతున్న కొలాడిగారు "కుల సమాజంలో అందరివాడు కావాలి" అని ఆకాంక్షించాడు. అంతేకాదు

**ఆ ఇంటి ముంగిట్లోని/ నిశ్శబ్ద నాదాలలో వేదఘోషలు వినిపించాలి/ జీవన ప్రస్థానంలో/ తొలకరి చినుకులు పరిమళాలు/ స్వాగతం పలకాలి** (పైది)

అని కూడా కవి కోరుకున్నాడు.

దళితులను ఊరి అవతలికి నెట్టివేసిన దుర్మార్గాన్ని ఎత్తిచూపిన కవి

**గురుదక్షిణ పరదాచాటున/ తెగిన బొటనవేలు కారుస్తున్న/ నెత్తురు రొచ్చులో దొర్లుతూ/ మోడుకొమ్మలకు వేలాడుతున్న/ గబ్బిలాల బతుకులు** (రాతి నిశ్శబ్దం : పు. 148)

అని ఒక మోసానికున్న చారిత్రక నేపథ్యాన్ని గుర్తు చేశారు కవి. వస్తువుగా తీసుకున్న వస్తువు మూలం మాత్రమేగాక, దాని చరిత్ర కూడా తెలియాలి. ఆ చరిత్రను కవితలో కరిగించేయాలి. వస్తువు నినాదం కాకుండా జాగ్రత్తపడాలి. జగదీశ్ ఇవన్నీ తెలిసిన కవి.

**తెల్లని సమాజంలో/ నల్లబడ్డ నేను** (పైది)

అనడం చాలు భారతదేశంలోని కులవ్యవస్థ ఏమిటో అర్థం కావడానికి ఇవాళ చానెళ్ళ ముందు కూర్చుని ప్రవచనాలు చేసే వర్గం కులవ్యవస్థను రకరకాల డొంక తిరుగుడు వ్యాఖ్యానాలు చేస్తున్నది. అవన్నీ ఈ కవి మాట ముందు సిగ్గుతో తలదించుకుంటాయి. జగదీశ్ సమస్యను ఆవిష్కరించి పాఠకునిలో ఉద్రేకం కలిగించారు. సమస్యకు కారణమైన వాళ్ళకు బుద్ధి చెప్పే ప్రయత్నం చేస్తారు. పీడితులను చైతన్యపరిచే ప్రయత్నమూ చేస్తారు.

**మబ్బులు కమ్మిన జీవితంలో/ ఉషస్సు సొంతం చేసుకొనేందుకు/ మూకుమ్మడి శక్తిని కూడగట్టుకోవాలి** (పైది).

అని దళిత జాతికి ప్రబోధించారు.

చిన్న పిల్లలు పేదరికం వల్లగానీ, కులం వల్లగానీ, మరో కారణం చేత గానీ బాల్యాన్ని కోల్పోవడం దేశానికి గర్వకారణం కాదు. పైగా తలవంపులు, పేదరికాన్ని నిర్మూలించకుండా పైపై సంస్కరణలతో ఈ సమస్య పరిష్కారం కాదు. ఆర్థిక అసమానతల్ని నిర్మూలించే ప్రణాళిక మన పాలకుల దగ్గర లేదు, ఉండదు.

**పేదరికపు శిలువను మోస్తూ/ బాలయేసులా సాగుతున్న ఆకలి ప్రస్థానంలో/ సంధ్యా కిరణం కన్నీరు కార్చింది**

(రాతి శిరస్సు : పు 129) అని 'పగిలిన మేఘం' లో కవి ఆర్ద్రంగా అన్నాడు. ఈ ఆర్ద్రత చర్మం మందమెక్కిన రాజకీయ వ్యవస్థను తాకాలి కదా! జగదీశ్ జాలరుల మీద 'నీటి బతుకులు' ప్రమాదాల మీద 'తగలబడిపోతున్న సంధ్యా కిరణాలు', ప్రకృతి బీభత్సం మీద 'విలయతాండవం', కారుణ్యమరణం మీద 'దుఃఖ సమిధిలో! యువత అరాచకాల మీద 'ఎవరికి ఎవరు?' రాజకీయాల మీద 'దుఃఖనది ఒడ్డున' వంటి కవితలు రాసి వస్తు వైవిధ్యాన్ని తన కవిత్వానికి అలంకారంగా చేసుకున్నారు.

ఎంత విశ్వజనీన భావాలు గల కవి అయినా తన సొంత నేలను విస్మరించడం సాధ్యం కాదు. అనంతపురం జిల్లా వాసిగా జగదీశ్ రాయలసీమ కరువును విస్మరించలేదు. 'కన్నీటి చినుకులా రాలిపోతే', 'కాలం అంచున నడుస్తూ.... సీమా రైతన్న' 'విసిరి వేయబడ్డ జీవితాలు' వంటి కవితలలో కరువు సీమ జీవిత వాస్తవికతను ఆవిష్కరించారు.

"ఆకుపచ్చని సంతకానికి నోచుకోని నేల
చిరిగిపోయిన పేజీలా బీడుపడింది" (రాతి నిశ్శబ్దం : పు. 20)

భుజంపై భారమైన నాగలితో
శిలువ మోస్తున్న ఏసులా
ఆకలిదేహంతో దుఃఖిస్తూ (పై ది : పు. 28)
రైతన్న అడుగులు

వంటి వర్ణనలు సీమ నిర్జల జీవిత చిత్రానికి అక్షర రూపాలు.

వచన కవిత్వం వచనమై తేలిపోకుండా ఉండడానికి జగదీశ్ అన్ని జాగ్రత్తలూ తీసుకున్నాడు. కవిత్వాభి వ్యక్తి పాఠకున్ని ఆత్మీయంగా పలకరిస్తుంది. కదిలిస్తుంది. ఆలోచింపజేస్తుంది. కవిత్వానికి దీనికి మంచి ప్రయోజనమేముంది? Ant unlikely, is born many times అన్నాడు యూరిబోరెల్ అనే సోవియట్ సౌందర్య శాస్త్రవేత్త, జగదీశ్ ప్రతి కవితలోనూ కవిగా పుట్టడానికి ప్రయత్నించాడు.

**మానవీయతను కబళిస్తున్న అవినీతి నేలపై**
**మనిషితనం నిలువెత్తు ఖడ్గమై నిలవాలి**

(రాతి నిశ్శబ్దం : పు. 140) ♦






# నులి వెచ్చని నవత్వం విల్సన్ రావు కవిత్వం

- వై.హెచ్.కె.మోహన్‌రావు
9440154114

చదవడం ప్రారంభిస్తే సంకలనం నందలి కవితలన్నీ పూర్తి చేసే వరకూ వదలిపెట్టనంటాడు విల్సన్‌రావు కొమ్మవరపు. "దేవుడు తప్పిపోయాడు" అనే మకుటంతో ముద్రణలోకి వచ్చిన ఆయన కవితా సంపుటి నిండా చిక్కని కవిత్వాన్ని పుటలు పుటలుగా నింపిపోశాడు. భావుకత, వస్తువు, శిల్పం సమపాళ్లలో నడిచిన కవన కెరటమే "దేవుడు తప్పిపోయాడు". తప్పిపోయిన దేవుడు కవిత్వాన్ని విల్సన్‌రావు కౌగిలింతకు చేర్చాడు. తనచుట్టూ పరిభ్రమిస్తున్న సంఘటనలను కవిత్వంగా మలచడంలో ఆయన కలం తిరిగిన దిట్ట. ఇతివృత్తాన్ని విస్తృతంగా, లోతుగా అధ్యయనం చేయడం, స్పష్టంగా ఆవిష్కరించడం ఆయన కవిత్వం సంతరించుకున్న ప్రత్యేకత. లేలేత పదాలతో అనంతమైన భావాలను పలికించే విల్సన్‌రావు ఇదివరలో "న్యాయ నిర్ణేతవు నీవే", "తెల్లారితే" అనే రెండు పుస్తకాలు తెచ్చారు. 'దేవుడు తప్పిపోయాడు' సంకలనంలోని కవితలన్నింటినీ వివిధ ప్రధాన దిన, వార, మాస మరియు సాహితీ పత్రికలు ప్రచురించినవే! ఈ కవితా సంపుటిని గూర్చి కొలకలూరి ఇనాక్ ఏమంటారంటే! 'దీన్ని తప్ప నేను ఈ మధ్య దేన్నీ ఎత్తుకొని ఎరుగను' అని చెబుతారు. అంటే! ఆయనను ఈ సంకలనం ఎంతగా ఆకట్టుకుందో! ఆయన హృదయాన్ని ఎంత మెత్తగా హత్తుకుందో! మనం అర్థం చేసుకోవచ్చు.

సంకలనంలోని కవిత్వాన్ని విశ్లేషించుకున్నప్పుడు నిక్కచ్చిగా గాఢత, సాంద్రతలో మిళితమైన అక్షరాలు పోత పోసుకున్నట్లు కనిపిస్తాయి. 'ఇనుప గొంతుల పాట' మకుటం గల కవితలో 'నిన్నటి దాకా రాజా రాణిగా వెలిగిన/ పెద్ద నోటు కథ / అర్థరూపాయి కంటే హీనమై / ఖద్దరుతో సహా అందరినీ / వరుసలో నిలబెట్టిన రోజుకు జేజేలు' చెబుతారు విల్సన్‌రావు. సమకాలీన అంశాలపై తక్షణమే స్పందించే లక్షణం కలిగిన కవి విల్సన్‌రావు అని ఈ కవిత బలంగా నిరూపిస్తుంది. కేంద్ర ప్రభుత్వం తీసుకున్న సంచలన పెద్ద నోట్ల రద్దు నిర్ణయం నేపథ్యంలో ఆయన కంటి ముందు కదలాడిన దృశ్యాన్ని ఈ విధంగా కవిత్వీకరించాడు. దేశం మొత్తాన్ని ఒక సంక్షోభంలోనికి అనివార్యంగా నెట్టివేయబడిన నిర్ణయం ఇది. ఈ చర్య దేశంలోని అనేక వర్గాల ప్రజలందరినీ బ్యాంకుల ముంగిళ్లలో, ఏటిఎంల ముంగిట నిలిపిన సందర్భమని చెప్పాలి. ఖద్దరుతో సహా అన్న ధ్వని ఒకింత సందేహాత్మకం. పాలకులూ, ప్రజాప్రతినిధులూ, రాజకీయవేత్తలెవరూ ఈ వరుసలలో కనిపించలేదనే చెప్పొచ్చు. కొందరికైతే కోట్లాది రూపాయల కొత్తనోట్ల కట్టలు మింట్ నుంచే సరాసరి పడక గదికి చేరినాయన్న సంఘటనలు మనం విన్నాం. ఎలక్ట్రానిక్ మీడియా ద్వారా రెండు నేత్రాలతో ప్రత్యక్షంగా బుల్లితెరపై దర్శించాము కూడాను. ఇప్పుడైతే ఈ పద వరుసను విల్సన్‌రావు సవరించుకుంటారేమో! ఏమైనా పెద్దనోట్ల రద్దు అనంతర ముఖ చిత్రాన్ని హృద్యంగా అక్షరీకరించారు కవితాత్మకంగా.

'ప్రశ్నలతో ఉరితీయండి' మకుటం గల కవితలో ఆయన ఆకాశంలో కర్ఫ్యూ నెవరు నిర్బంధించారు / మేఘాల్నెవరు నిషేధించారు / ఆమె ఆర్తనాదానికి ఒక్క చినుకైనా పిడుగవలేదు'

# నగరం

- మల్లారెడ్డి మురళీమోహన్
08861184899



గతి తప్పిన గమనానికి ప్రగతి పేరు పెట్టుకుంటూ
మతి తప్పిన మంది చేష్టలతో వికృతంగా మారుతూ
పరివర్తన చెందుతోంది నగరమిపుడు...

శిశువుగా ఉన్నప్పుడు పచ్చదనం ఒళ్ళో ఆడుకున్న నగరం
ఇప్పుడు పల్లెల పచ్చని కలల్ని దోచుకుంటూ
రాదారికిరువైపులా హరిత సైన్యాన్ని హరిస్తూ
మోడువారి మొరటుదేలింది...

బలిసి ఒళ్ళు విరుచుకున్న నగరదేహంపై
ఉబ్బిన రక్తనాళాల్లా పై వంతెనలు
రియలెస్టేట్ లిప్‌స్టిక్ పూసుకుని
ఆకర్షించే వేశ్యలాంటి నగరదేహంపై
రాకాసి కురుపుల్లా మురికివాడలు...

ప్రాణంకోసం విలవిల్లాడే అంబులెన్స్ అరుపుల్ని
తన పాశవిక ట్రాఫిక్ పరిష్వంగంలో శాశ్వతంగా
నిద్రపుచ్చుతూ
క్షుధార్తుల ఆకలిరోదనలతో కడుపు నింపుకుంటూ
'నరకం' అనే కలం పేరుతో ధ్వంస రచన చేస్తోంది
నగరమిపుడు...
ఉన్నవాడు విప్పుకోలేని, లేనివాడు కప్పుకోలేని
రెండు సమాంతర ప్రపంచాల నడుమ
అంతరాల అగడ్త లోతుని పెంచుకుంటూ
వేల కలల సమాధులపై నర్తిస్తోంది నగరమిపుడు...

ఆక్రమణల కాటుతో చెరువులన్నీ కబ్జాదోసిట్లో తేలుతుంటే
కాలుష్యం కమ్మిన కళ్ళు ఆమ్ల అశ్రువులు చిమ్ముతుంటే
అనివార్యమై అత్యవసర చికిత్సకోసం అలమటిస్తూ
తనకు తానే ఒక ఐ.సీ.యూ.లా మారింది నగరమిపుడు... ♦

అంటూ గర్జించారు. ఒక అఘాయిత్యం పట్ల ధర్మాగ్రహంతో ఊగిపోతూ ఎత్తుగడలోనే ఉద్రేకాన్ని నింపి లోకాన్నీ, ప్రజానీకాన్నీ ప్రశ్నలతో నిలదీస్తూ కవితలను ఆరంభించారు. మొత్తం దేశాన్నే కలవరపాటుకు గురిచేసిన రాజధానిలో జరిగిన ఒక అవాంఛనీయ 'నిర్భయ' ఘోరకలి భూమికగా రాసిన 'కవిత', 'ప్రశ్నలతో ఉరితీయండి'. ఒక ప్రశ్న, ఒక వేదన, ఒక ఆగ్రహం సమ్మిళితమై సాగిన ఈ కవితను ఒక మానసిక సంస్కార పరిణామంతో పరిష్కార ముగింపునిస్తాడు. 'బ్రతుకుకు భరోసానిచ్చి / స్త్రీకి గౌరవాన్నిచ్చే / గొప్ప ఆధునిక ఉద్యమాన్ని నిర్మించాలి' అంటూ ఒక సామాజిక సందేశాన్నిస్తాడు విల్సన్‌రావు. చినుకు పిడుగుగా మారాలనే వ్యక్తీకరణ అద్భుతంగానూ, వినూత్నంగానూ ఉంది.

'నులివెచ్చని జ్ఞాపకాలు' అనే శీర్షిక కలిగిన కవితలో ఆయన 'కొంపలేవో మునిగినట్లు / బొంగురు గొంతును నాకు అరువిచ్చి / నన్నొంటరిని చేసి / నాలోంచి వెళ్లిపోయింది బాల్యం' అని విచారం వెలిబుచ్చుతారు. మొత్తం మనిషి జీవితంలో అమృత తుల్యమైనది బాల్యదశేనని అందరూ ఎరిగిన విషయాన్నే ఆయన మరోమారు గొంతెత్తారు. మూల్యం కట్టలేనిది బాల్యం. చీకూ చింత ఎరుగని స్థితి దానిది. నెమరు వేసుకుంటేనే అనుభూతుల ఆకాశంలో ఆనందంగా విహరిస్తాము. బాల్యం గురించి ఎంత చెప్పుకున్నా ఇంకా మిగిలే ఉంటుంది. ఊహల ఊయలలో, ఆశల మేఘాలలో, ఆటల ఆనందంలో, సంతోష సమయాలలో పరుగులు తీసిన బాల్యాన్ని నెమరు వేసుకుంటేనే అనుభూతుల ఆకాశంలో విహరిస్తాము. అటువంటి బాల్యం గూర్చి విల్సన్‌రావు విప్పిన అంశాలు అందరికీ అనుభవంలోనివే! కవి కొత్తగా తెలిపిన విషయం ఏమంటే! 'బొంగురు గొంతును నాకు అరువిచ్చి' అంటూ కౌమార్యంలోకి ప్రవేశించే బాల్యాన్ని విశదీకరించారు. అయితే ఆ దశ కూడా శాశ్వతం కాదని తెలుపడానికి ఆయన 'అరువిచ్చి' అనే పదాన్ని ప్రయోగించి స్పష్టం చేశారు. కవితీకరణలో, ఆవిష్కరణలో ఆయన సరికొత్త పోకడను ఆచరిస్తారని ఈ సందర్భం వలన తెలుసుకుంటాము. విల్సన్‌రావు కవితలన్నీ చదువరిని గొప్ప అనుభూతికి, అనుభవానికీ తీసుకెళతాయి. కమ్మని కవిత్వం రాసిన విల్సన్‌రావు అభినందనీయుడు. కవిత్వంపైన ఆసక్తి కలవారందరూ చదువుకో దగిన సంపుటి విల్సన్‌రావు 'దేవుడు తప్పిపోయాడు'. ♦






జ్వాలాముఖి
18.04.1938-14.12.2008

# జీవిత వైచిత్రిని వెల్లడించే జ్వాలాముఖి కథలు

- ద్వానా శాస్త్రి
9849293371

శిల్పం, మలుపులు, మెరుపులు మాత్రమే కథలనుకునే రోజులు వెళ్ళిపోయాయి. వస్తువే ఇప్పుడు ముఖ్యం. వస్తువును బట్టి కథనం, సన్నివేశాలు, సంభాషణలు ఉంటాయి. ఇతివృత్తం బలంగా ఉంటే ఆ తర్వాత కథాశిల్పం గురించి మాట్లాడవచ్చు. శిల్పం ఉండదని కాదు - శిల్పం ద్వితీయ ప్రాధాన్యమవుతుంది.

జ్వాలాముఖి కథలు చదివినప్పుడు పై అభిప్రాయం కలుగుతుంది. జ్వాలాముఖి స్వతహా కవి. కాని కవిత్వం కంటె ఆయన కథలు జ్వాలాముఖి హృదయాన్ని పట్టిస్తాయి. కవిలో ఉండే కసి, ఆవేశం కథల్లో కనిపించవు గానీ సంభాషణ, పాత్రల వల్ల ఆ తీవ్రత తగ్గుతుంది. 2010లో నిఖిలేశ్వర్, జితిన్‌కుమార్, ఎ.వి. రామాచారి సంపాదకత్వంలో 12 కథల సంపుటి 'కథాజ్వాల' అచ్చయింది. జితిన్‌కుమార్ ముందుమాట రాస్తూ 'ఎత్తుగడ, గమనం, ప్రభావశీలమయిన ముగింపు, సంభాషణల ద్వారా కథనం లాంటి పడికట్టు సూత్రాలతో ఈ కథలను పరికించబూనటం అనవసరం' అన్నాడు. నా అభిప్రాయమూ ఇదే. కానీ, కథల్ని పరిశీలించేటప్పుడు, విశ్లేషించేటప్పుడు ఆ గుణాలను విస్మరించలేం.

'స్తన్యం' అనే కథ కళాశాలల్లో జరిగే వికృత చేష్ట 'ర్యాగింగ్' గురించి. ఇది 1977లో అచ్చయింది. అప్పటికి ర్యాగింగ్ రాక్షసి ఇవాళంత లేదు గానీ ఆడపిల్లల మీద ఎక్కువగా ఉండేది. ఈ కథను ఉత్తరాంధ్ర తెలుగులో రాశాడు. 'సుజాతను చూడగానే భ్రష్టయువతరం సుళ్ళు తిరగడం ఆరంభించింది. కాగితబ్బాణాలు, ఛీత్కారాలు, కామెంట్లు గొల్లుమంటున్నాయి...' అంటూ తొలిరోజునే గోల్డ్‌మెడలిస్ట్ అయిన సుజాతకి ఎదురైన అమానవీయ సంఘటనలు జ్వాలాముఖి వెల్లడిస్తాడు. 'కరణంగారికి పిల్లాడు పుట్టడం, తల్లి రోగిష్టిది కాబట్టి సుజాత వెళ్ళి పాలిచ్చేది. అటువంటి దయగల ఆమెను కరణమే చెరిపేశాడు'- ఇటువంటి సంఘటనలు పల్లెటూళ్ళల్లో అప్పుడు సాధారణమే. అందుకే గ్రామపెద్దల్లో పశుత్వం ఉండేది.

ఆవేశంతో యువతీయువకులు హద్దులు మీరడం సహజమే. ఇది అప్పటికంటె ఇప్పుడు నిత్యకృత్యమైంది. పెద్దలు కూడా ఏమీ చేయలేక పోతున్నారు. వీళ్ళ చదువులన్నీ మొగ్గల్ని కాలరాయడమే. అయితే జ్వాలాముఖి కొత్త సందేశమిచ్చాడు. సుశీల గర్భవతి కాబోతుందని తెలిసి గర్భం తీసెయ్యాలనుకుంటుంది. అప్పుడు ప్రియుడు 'నీ రక్తమాంసాల్ని నీవు కాదనరాదు. నేను తండ్రి అవటానికి సిద్ధంగా ఉన్నాను. నీకెందుకు దిగులు? దటీజ్ రియాలిటీ. లెటజ్ ఫేసిట్. అబార్షన్ నిన్ను ప్రమాదంలో వేస్తే ఎట్లా?... ఈ దుర్మార్గ వ్యవస్థను మార్చడానికి ప్రయత్నం చేసే మామూలు మనిషిని" అంటూ కథను ముగిస్తాడు. ఏసిడ్ పోసి గానీ, హత్య చేసి గానీ 'పీడను' వదిలించుకుందామనుకుంటున్న నేటి యువతకు గొప్ప

# కన్నీటి లిపి

- అమూల్యాచందు కప్పగంతు
9059824800

శ్రవణుడు అమ్మానాన్నల్ని
కావడిలో మోసినట్టు...
కలాన్ని, కాగితాన్ని
ఎప్పుడూ నా భుజాలపై
మోస్తుంటాను...

పిట్టల్ని, పిందెల్ని
చెట్టు చదువుతున్నట్టు...
నేను కన్నీటి భాషను, ఈ ప్రపంచం
గుండెలోతుల్ని చదువుతుంటాను...

పండగెల్లాక ఖాళీ ప్లాట్‌ఫారంలా
మిగిలిన ఇళ్లల్లా ...
అప్పుడప్పుడు మనసును ఖాళీ చేసి
దూరంగా వెళ్తుంటాను...

ఉదయసాయంత్రాలతో
ఊసులు చెప్పి నడుస్తూ ...
పౌరుషంగా పరిగెత్తే
మబ్బులతో పోటీ పడుతుంటాను...

ఇంకా చిక్కు తియ్యని జుట్టులా
ఉన్న చెట్ల చివర్ల మీద...
ఎందరివో కవిత్వ పుస్తకాల
జెండాలనెగరేస్తాను....

భానుడొదిల్లెల్లిన
విరామ రంగుని పులుముకుని...



ఈ అనాగరిక నగర అద్దంపై
అక్షరాక్షరాల
నీడల ఊడల మర్రినౌతుంటాను... ◆

---

సందేశం 'లెటజ్ ఫేసిట్' అనేది. ప్రతి విషయంలో ఉన్మత్తులవుతున్న యువతకి 'లెటజ్ ఫేసిట్' అనే ధైర్యం ఇచ్చాడు జ్వాలాముఖి.

'బలహీనులకు తెలివి రానంతవరకే బలవంతుల రాజ్యం బలహీనులకు తెలివి రావడమే యుగచైతన్యం. యుగచైతన్యం విప్పిన ఆ పొడుపు కథ సందర్భాల్ని సద్వినియోగం చేసుకున్న పీడిత జాతి విముక్తి గీత' అంటాడు. 'ఉప్పెన విప్పిన పొడుపు కథలు'లో అతని తిరుగుబాటు తత్వం ఇందులో గమనిస్తాం. ఈ కథ 'ఏరూ వచ్చే టుంగా మునిగే – ఎట్లాకెల్లీ ఎట్లా వత్తూ / ఎర్రిబాగుల ఎంకటయ్యా – ఈ బతుకూ ఇంతేనయ్యా' అనే పాటతో ప్రారంభమవుతుంది. ఇది కథకి నేపథ్యం (ఇంట్రో) వంటిది.

'ఈద్ ముబారక్' కథ ఫక్తు పాతబస్తీ కథ. రోజా (ఉపవాసం) దీక్ష చేసినవాడు ఫకీరు బిచ్చం అడిగేటప్పటికి కసురుకుంటాడు. మతాలు వేరైనా, ఎన్ని పూజలూ, నమాజులూ, ప్రార్థనలూ చేసినా అంతరాంతరాల్లో మానవులంతా ఒకటే అని చెప్తుందీ కథ. పైరవీకారు, దందేబాజ్, భట్టేబాజి... ఏ పేరుతో పిలిచినా మోసగాళ్ళే. అంగడి అజ్ఞానాన్ని, అయోమయాన్ని, అనాలోచనను సృష్టించి చిత్తచాంచల్యాన్ని రెచ్చగొట్టి బుద్ధికి పరదావేసి నిలువునా దోచి వేస్తుంది' అనటం బాల్యం నుంచి పాతబస్తీని భూతద్దాలతో చూసిన జ్వాలాముఖి లోకానుశీలనమే.

ముందుమాటలో అన్నట్టు 'ఒక్కో కథా ఒక జీవిత గవాక్షం ఓ అభయహస్తం. కొత్త జీవితానికి కొత్త మార్గాలకు 'ఈద్ ముబారక్'లు చెబుతాయి. జ్వాలాముఖి కథలు ఏం చెప్తాయి అంటే – మంచికోసం నిలబడినా చాలు మానవుడు మహనీయుడే. హైదరాబాద్ వందలాది సంవత్సరాలుగా సహనశీలతకి, సమైక్య వారసత్వానికి నిలయం. కానీ రాజకీయాలు వచ్చి విధ్వంసం చేస్తున్నాయి. ప్రజల బతుకు తండ్లాట 'కథాజ్వాల'లో చూస్తాం.

హైదరాబాద్ సామాన్యుల జీవితాల్ని చిత్రించిన కథల్ని వేరుచేసి సంపాదకులు 'హైదరాబాధలు' అనటం ఔచిత్యంగా ఉంది.

జ్వాలాముఖి పూర్తిపేరు ఆకారం వీరవెల్లి రాఘవాచారి, వైష్ణవ సంప్రదాయ కుటుంబంలో పుట్టినా ఆ వాసనలు వదిలించుకున్నాడు. లేకుంటే కథలు రాయలేడు. ఏం.ఏ. తెలుగుతో పాటు బాగా చదివాడు. హిందీలో 'భూషణ' అయ్యాడు. దిగంబర ఉద్యమం, విప్లవ ఉద్యమాల వల్ల పోరాటశీలి అయ్యాడు. సామ్రాజ్యవాదాన్ని ఎండగట్టాడు. కథా రచయితగా కొ.కు. మార్గంలో కొంత ప్రయాణం చేశాడనవచ్చు. ◆

# ఇలా రువ్వుదామా రంగులు






- డా॥ జోశ్యుల కృష్ణబాబు
9866454340.

నిర్మలంగా, మృదువుగా సంభాషించేవారంటే అందరూ ఇష్టపడతారు. అలా సంభాషించే వ్యక్తి కవి అయితే మరింత ఎక్కువ ఇష్టపడతారు. అలాంటి ఒక మృదువైన కవి డా॥ కోగంటి విజయ్. గుంటూరు డిగ్రీ కళాశాలలో ఆంగ్లోపన్యాసకునిగా పనిచేస్తున్నారు. కవిత్వపులోతుల్ని పరిశీలిస్తూ చక్కని-చిక్కని కవిత్వాన్ని వెలయిస్తున్నారు. ఈయన వెలువరించిన తొలికవితా సంకలనమే "ఇలా రువ్వుదామా రంగులు" అనేది. తొలిప్రయత్నంలోనే ఇది 'నాగభైరవ పురస్కారాన్ని' అందుకోవటం ఒక విశేషం.

ఇరవయ్యోశతాబ్దపు చివరి దశకాల్లో కవిత్వం వివిధ ఉద్యమాల రూపంలో చాలా బలంగా వినిపించింది. అయితే ఎవరి కవిత్వం వారు మాత్రమే చెప్పుకొనేదిశగా సాగి, అది కొంత ఆగింది. ఆపై ప్రపంచీకరణ, సామ్రాజ్యవాద వ్యతిరేకతలు కవితా వస్తువులుగా కవిత్వం సాగుతూ వచ్చింది. సంఘటనాత్మక కవితలైతే తరచూ కనిపిస్తూనే ఉన్నాయి. ఆ తరువాత తరువాత లుప్తమౌతున్న మానవ సంబంధాలు కవితా వస్తువులుగా కవిత్వం రావటం మొదలయింది. జన్మనిచ్చిన అమ్మను గూర్చి, "అమ్మ" అనే కవితా సంకలనం, జీవితాన్నిచ్చిన నాన్నను గూర్చి 'నాయిన' అనే కవితా సంకలనం లాంటివి కూడా వచ్చాయి. వస్తున్నాయి.

అలాగే బాల్యపు జ్ఞాపకాలు, చక్కని పలకరింపులు, మాట, మౌనం, వేసవి, నడక, ఆఖరికి కూలుతున్న పాత ఇల్లు, కూడా అందమైన కవిత్వంగా రూపాంతరం చెందుతోంది. ఎందుకంటే కవికి సత్తా ఉండాలి కాని ఈ లోకంలో కవిత్వానికి వస్తువుకానిదేదీలేదు. ఈ విషయాన్నే ధనంజయుడు దశరూపకంలో "ఏదైనా ఒక వస్తువు అందమైనదైనా, ఏవగింపు కలిగించేదైనా, ఉదారమైనదైనా, నీచమైనదైనా, భయంకరమైనదైనా, ప్రసన్నమైనదైనా, గహనమైనా, వికృతమైనా, సాధారణమైనదైనా, అసాధారణమైనదైనా కవిత్వపు నాడి దొరికిన కవి చేతిలో పడితే అది రససిద్ధిని పొందితీరుతుందంటాడు". అలా ఇందులోని చాలా వస్తువులు మనకు సాధారణ పరిచయాలే కానీ కవిత్వంలో పడి చాలా అందంగా, అసాధారణంగా కనిపిస్తాయి. దీనికి కొప్పర్తి, అఫ్సర్‌ల ముందు మాటలు మరింత సౌందర్యాన్ని, విలువను పెంచాయి. ఇందులో మొత్తం 51 కవితలున్నాయి. ఇంచుమించు అన్నీ వివిధ పత్రికల్లో ప్రచురితమైనవే. నా మనసుకు హత్తుకొన్న కొన్నిటిని మాత్రం స్పృశిస్తాను.

మొదటిగా బాల్కనీలో ఊయల. అసలు ఇతరులెవ్వరికీ కంటపడని, తోచని వస్తువు విజయ్ కంటపడుతుంది. అది కవిత్వంగా ప్రవహిస్తుంది. బాల్కనీలోని ఊయల చాలామందికే ఉంటుంది. కవులకూ, ఉండే ఉంటుంది. కాని కవిత్వానికి అలాంటి దాన్ని కూడా వస్తువుగా చేయగల హృదయం విజయ్‌ది. కవి ఎవ్వరితోనూ పంచుకోని అంశాల్ని కవిత్వ రూపంలో అందరితో పంచుకొంటాడు. 'నాలానే, నా మనసు లానే అన్నిటనీ మోస్తూ ఊగుతుంది ఊయల... అయితే ఒంటరిగా', అంటూ చిన్న భేదంతో తనకీ ఊయలకీ ఉన్న అభేదం చెప్పారు. అలాగే అప్పుడప్పుడు ఖాళీగా ఉన్న ఊయల మనల్ని వచ్చి కూర్చోమని పిలుస్తూన్నట్లే ఉంటుంది. కవి కూడా అలా పిలిచినట్లుగా భావిస్తారు.

ఇక "నేనూ-వానా" ఒక అద్భుతమైన కవిత. ఈ కవిత గురించి, ఎందరు ఎంతచెప్పినా ఇంకా మిగిలి పోతుంది. తొలకరి వర్షాల్లో జుయ్‌మంటూ తూనీగలు ఇంటిముందు ఎగురు తుంటాయి. అవి నేలను సర్వేచేసే హెలికాప్టర్లలా ఉన్నాయనటం ఒక కొత్త ఊహ. ఈ ఊహ ఇంతకు ముందు ఎవరికైనా వచ్చి  ఉండవచ్చు కాని కవిత్వంలో వ్యక్తీకరణ మాత్రం విజయ్‌దే. అంతేకాదు వాన వచ్చేప్పుడు బయటకు చూస్తుంటే ఎన్నో విశేషాలు మనసును తాకుతాయి.వాన వస్తున్న విషయాన్ని 'గాలిబండి' సందుగొందులో ప్రచారం చేస్తోందట. ఇక్కడ 'గాలిబండి' అనే అచ్చిక సమాసం మొత్తం ఆ భావ చరణానికంతటికీ అందాన్నిచ్చింది. అయితే ఆ వానకు భూమికన్నె వళ్ళంతా పులకింతల పరిమళం అన్న ఆ తరువాతి రూపంలో భూమికన్నె అనే కంటే, 'పుడమికన్నె' అంటే మరింత అందంగా ఉండేదేమో అనిపించిదినాకు.

అలాగే వానలో తడిసి ముద్దైన పక్షులజంటల్ని, పిల్లలకేరింతల్ని, మోసుకు పోయే కాగితపు పడవల్ని, చూస్తూ కవి ఏమంటారంటే ఇంతమందికి ఆనందాన్నిచ్చే ఈ వాన నన్ను మాత్రం కిటికీ ఇవతల వెలేసింది అంటారు. మొత్తం కవితకే ఈ వాక్యం ప్రాణం. పెద్దయ్యాక బాల్యంలోలా వర్షంలో చిందులేయలేం కదా! ఆ ఆనందాన్ని తనివితీరా ఆస్వాదించలేం కదా! అదే కవి ఆవేదన.

ఇక పుష్పానికి వికసించటం, పరిమళించటంలాగే జీవితానికి జ్వలించటం, ఉద్వేగపడటం, అనుభూతి పొందటం ఉండాలి గాని జడత్వం అలుముకోకూడదంటారు. "ఇలా, యెలా?" అనే కవితలో.

ఇక 'కూలుతున్న ఇల్లు' అనే కవితను చదివితే నూటికి 80 మందికి ఇది అనుభవంలోకి వచ్చే అంశమే అనిపిస్తుంది. మనం చిన్నప్పటి నుండీ పెరిగి పెద్దైన ఇంటితో ఏదో చెప్పలేని ఒక అనుబంధం ఏర్పడుతుంది. కాని లుప్తమౌతున్న మానవ సంబంధాలవల్ల, అన్నదమ్ముల మాటామాటా పట్టింపులతో ఆ ఇల్లు రెండు ముక్కలుకావటం, చివరకు చిరకాలం దాహార్తి తీర్చిన బావిని కూడా మూసేయటం హద్దులు, సరిహద్దుల రాళ్ళను పేర్చుకోవటం... ఇవన్నీ చూస్తూ తన గర్భం రెండుగా చీలిపోయినంత బాధని అనుభవించే అమ్మ కళ్ళల్లో దైన్యం ఎలా ఉంటాయో? ఒక సినిమాలో సీన్ చూస్తున్నట్టే కవి మన కళ్ళముందుంచుతారు.

ఇక 'జ్వలనమే జననం' అన్న కవితలో జ్వలనం అంటే ఏంటో ఒక క్రొత్త నిర్వచనాన్ని క్రొత్త ఆలోచనని అందించే ప్రయత్నం చేసారు కవి. అంతరాంతరాలలో పేరుకొన్న కోరికలను, దాహాలను, అహాలను, దహిస్తూ జ్వలించటం ఒక జననమే అంటారు. అంతేకాదు జ్వలించటం ఒక పోరాటం, ఒక రూపాంతరం. జ్వలిద్దామా! అని అడుగుతారు కవి.

ఒక్కోసారి జీవితంలో ఏదో ఇదీ అని చెప్పలేని వెలితి ఏర్పడుతూంటుంది. ఒక ఆత్మీయతా స్పర్శ, కావాలనిపిస్తుంది. మనసుకు పట్టిన ఆ ముసురు తొలగిపోవాలంటే, 'ఒక స్నేహాన్ని పంచగల నవ్వుకై పరితపిస్తోంది మనసు', 'ఉద్విగ్నమై మూగబోతోంది' అంటారు 'ముసురు' అనే కవితలో.

కొంతమంది అవతలివాళ్ళు పలకరిస్తే మనం పలకరిద్దాం! అనుకొంటూంటారు. కొందరు ఏమీ ఆలోచించకుండా వెళ్లి ముందే పలకరిస్తారు. అలా నిర్మలంగా, మృదువుగా, అందంగా పలకరించే వాళ్ళను అందరూ ఇష్టపడతారు. అందరూ అంటే మనుషులే కాదు, మల్లెపువ్వు, శిల, చిన్నిగువ్వ, తార, ఇలా అన్నీ, చల్లగాలిలా స్పృశించే ఓ మంచిమాటకి పులకరించిపోతాయట. అందుకే అంటారు కవి 'ఓ ఆత్మీయమైన మాటకన్న మన దాహం తీర్చగల సంద్రాలెక్కడుంటాయి నేస్తం? అందుకే స్వచ్ఛమైన వాన చినుకులా "పలకరించిచూడు" అని.

కవి దృష్టి కేవలం సామాజిక సమస్యలపైనే కాదు చిన్న చిన్న ఆనందాలపైనా, ప్రకృతి పరిసరాలపైనా కూడా ప్రసరించాలి. అందుకే ఈ కవి 'సమ్మర్' అనే కవితలో గ్రీష్మపు

లక్షణాల్ని తనదైన ధోరణిలో... 'ఎర్ర సూర్యుడి కౌగిట్లో' ఉడుకెత్తిన నేల 'ఓ విరిసిన దిరిసెన పువ్వు' లా ఉందంటారు. అంతేకాదు 'అందరినెత్తినా టోపీలు పెడుతూ నవ్వుతున్నాడు వికట సూర్యుడు. అన్నప్పుడు టోపీలు పెట్టటంలోని అభంగశ్లేష అప్రయత్న సిద్ధమేమో అనిపిస్తుంది.

అలాగే 'ఓ మాట విను' అనే కవితలో అహంకారాన్ని, అసురత్వాన్ని అజ్ఞానాన్ని చీల్చేయాలని, మనుషుల మధ్య కురవాల్సిన వెన్నెలజల్లును కొంచెమైనా కురిపించే ప్రయత్నం చేయాలని ఆశిస్తారు కవి.

వందమంది దోషులైనా తప్పించుకోవచ్చుగాని, ఒక్క నిర్దోషి కూడా శిక్షింపబడకూడదు అన్నది న్యాయవ్యవస్థలో అతికీలకమైన అంశం. కాని నిర్దోషి అయి కూడా, ఏడేళ్ళపాటు క్రూరంగా హింసింపబడి నరకం అనుభవించింది ఆదివాసీ ధీర, హిడ్మే. కవి హృదయాన్ని కలచివేసిన ఈ అంశం. "జగదల్‌పూర్ జైల్‌సెల్ అనే నేను" అనే కవిత ద్వారా వెలికివచ్చింది "కళ్ళకే కాక మిగిలిన వాటికీ గంతలు కట్టుకు వేచి చూసే ధృతరాష్ట్ర తీర్పులకు నేనో అంధసాక్షిని!" అంటుంది ఆ జైలు.

ఇక 'దీపావళి' అంటే ఒక సరిక్రొత్త నిర్వచనాన్నిస్తారు కవి. ప్రమిదలు వెలిగిస్తే దీపావళి కాదట. "ముసురుపట్టిన గుండెను" అక్కునచేర్చుకొంటారనే "ఆశ కలిగితే" అది దీపావళిట. ఒక మంచి మాట హృదయాన్ని చుట్టేసి ఉద్వేగాన్ని తొలగిస్తే అది దీపావళి అవుతుందట. అంటే మనం ఇతరుల మనసుకు ఆహ్లాదాన్ని ఆనందాన్ని, ఇవ్వటమే వాళ్ళకి దీపావళి అవుతుందని కవి భావన.

ఒక్కోసారి మనకెంతో ఇష్టమైనవారిమీద ఏదో కోపం వచ్చి వాళ్ళగురించి ఇంక ఆలోచించకూడదను కొంటాం. కాని ఆ భావన వంటరితనాన్ని మరింత నిలదీసి, పరిహసించి, ప్రశ్నిస్తుందంటారు కవి. అలాగే ఇష్టమైన వారి కోసం ఎదురుచూడటం చాలాకష్టం. కాని ఎంతో ఆనందం కూడా! అందుకే "ఎదురుచూసే మనసెపుడూ తలుపు తీసి వేచిన వాకిలే" అంటారు. అంతేకాదు వనంలో ఎన్నిచెట్లున్నా మలయమారుతం లేకపోతే ఎలా ఉంటుందో, ఎందరున్నా మనసుకెంతో ఇష్టమైన వ్యక్తి లేకపోతే అలా

గుబులుగానే ఉంటుందంటారు కవి 'ఒంటరి నడక' అనే కవితలో.

కొన్ని ఆనందాల్నైనా, బాధల్నైనా ఎందుకో అందరితోను పంచుకోలేం. మనసుకు బాగా దగ్గరైనవాళ్ళకే, అదీ కొన్ని సందర్భాల్లోనే చెప్పుకోగలం. అలా పంచుకోవటంకోసం ఈవెనింగ్ వాక్ అనే వంకతో ఆత్మీయ స్నేహితుడ్ని అలా "కాలంతో పాటు వెళ్లి వద్దాం వస్తావా?" అంటూ ప్రాథేయపడతారు కవి. అలా మిత్రునితో కలిసి ఎందుకు నడవాలని ఉందో చెబుతూ

*"నడక శరీరానికి మంచిదే*
*కాని నీతో నడక*
*మనసుకూ మంచిదనిపిస్తోంది'*
*ప్రతి అడుగులోనూ*
*ఒక్కో జ్ఞాపకాన్నీ*
*వెనక్కితోసేస్తూ*
*గుండెను తేలికపరుస్తూ*
*నడుద్దాం, వస్తావా?"* అంటారు. ఇష్టమైన వ్యక్తితో కలిసి నడవటం కూడా ఎంత బాగుంటుందో అర్ధమవుతుంది ఈ కవిత చదివితే.

అలాగే గెరిల్లా యుద్ధ విజేతయైన "ఫిడెల్‌కాస్ట్రో" చనిపోయినపుడు ఓ అభాగ్యులపెన్నిధీ! క్యూబా తొలి వేగుచుక్కా! నీవు మృత్యువును జయించావు! అంటూ ప్రశంసిస్తారు.

కాలం, వానచినుకూ, గాలితెమ్మెరా, వెన్నెలా, ఇవన్నీ అడగకుండానే పలకరించి, ముద్దాడి కౌగిలించుకొని వెళు తుంటాయే? మరి "తోడుగానే పుట్టి పెరిగినవారో, నేస్తమంటూ జతకట్టినవారో, మాత్రం అవసరమొస్తేగాని కనిపించరు, పలకరించరు – "ఎందుకిలా?" అంటూ వాపోతారు కవి.

చాలా కవితల్లో ఈ కవి ఆప్యాయతల కోసం, హృదయ పూర్వక పలకరింపులకోసం, తపించటం కనిపిస్తుంది. గాలి కదలికలకు, కుండలోని చిన్ని ఆకుపచ్చని మొక్క మారాకు తొడిగినందుకూ, కవి హృదయం స్పందిస్తుంది. అందుకే వర్షమెపుడో, హర్షమేమిటో, ఎండ ఎందుకో ఆలోచిస్తూ గదిలోనే కూర్చోక ఒకసారి అలా బయటకొక అడుగేయమంటారు. పోనీ కనీసం పక్కనే ఉన్న కిటికీ రెక్కనైనా తీసి చూడు గాలి కదులుతోందో లేదో? అంటారు.

మౌనానికి–మాటకీ ఉన్న సంబంధాన్ని గుర్చి చెబుతూ, మాట మౌనం నుంచే పుడుతుందని, అలాగే మౌనం కూడా మాట నుంచే పుడుతుందనీ అంటారు. అంతేకాదు "నేనెప్పుడూ మౌనమే! నీ ఆలోచనే నన్ను పలికించే శబ్దం" అంటారు కవి.

ఇప్పుడు వ్యక్తులు కాలంతోపాటు పరుగెడుతున్నారు. ఒకటే ఉరుకులు పరుగులు. ఆత్మీయులతో కూడ పలకరింపులు తగ్గిపోతున్నాయి. అందుకే కవి మాటల సెలయేళ్ళను మళ్ళించి పంటలు పండిద్దామా, మనసు, కురిసే మాటల వర్షానికి తడిసి ఎన్నాళ్ళయింది. ఈ పరుగుపందాలకు కాసింత విరామం ప్రకటిద్దామా అని అడుగుతారు "ఇలా చేద్దామా" అనే కవితలో.

ఎవ్వరికీ లొంగనివాళ్ళు, ఎవ్వరినోగాని ప్రేమించలేని వాళ్ళు కూడా కన్నబిడ్డను మాత్రం ప్రేమించ కుండా ఉండలేరు. అలాంటిది విజయ్ లాంటి ప్రేమైకమూర్తి కన్నబిడ్డ, అందునా ఆడబిడ్డ గురించి, ఆమెతో గడిపిన తియ్యని క్షణాల గురించి వర్ణించకుండా ఎలా ఉండగలరు? అందుకే "నాచిట్టి తల్లి" అనే కవితలో తన కూతురు తన ముంజేతి సింహాసనంపై చేరి, తనకన్నా ఎత్తుగా ప్రపంచాన్ని పరికించే మహారాణి అంటారు. అంతే కాదు వేలెడంత బుడత చూస్తుండగానే చిరుతయింది, సివంగైంది, నన్ను శాసించే మొదటి ఆరిందా అయింది. బహుశా ఒక అమృత బిందువు జారి దోసిటపడితే నా "చిట్టితల్లి" అయిందంటారు.

ఇక ఈ గ్రంధ శీర్షిక 'ఇలారువ్వుదామా రంగులు'. కాని, ఏ కవితకీ ఈ శీర్షిక పెట్టలేదు కవి. "హోలీ" అనే ఒక కవితలో ఏయే సమయాల్లో, ఎందుకు రంగులు రువ్వాలనుకొంటున్నారో చెబుతారు. రాజకీయ నాయకులు రంగులు మారుస్తారు. చాలామంది మనసులో ఒకటి పెట్టుకొని పైకి మరో రంగు పూసుకొంటారు. అలా రంగులు మారటమే లక్ష్యమైన దానికన్నా హోళీలో రంగులు పూసుకోవటంలో తప్పేమీ లేదంటారు కవి. అంతేకాదు కన్నీటికి ఆసరాగా తోడై నిలచేందుకు రంగులు రువ్వుదాం. దుర్మార్గపు గుండెలు అలిసిపోయేలా, అజ్ఞానపు రంగు వెలసి రూపు మారిపోయేదాకా రంగులు రువ్వుదాం. లోపలి చీకట్లు తొలగిపోయేలా, మనసులు ఆనందంలో తుళ్ళి, తేలి, తడిసిముద్దయ్యేటట్లుగా కల్తీలేని సంతోషపు రంగుల్ని అందరిపై రువ్వుదామా! అంటారు. అంటే కన్నీటిని, అజ్ఞానాన్ని, పరాభవాల్ని, చీకటిని కనపడకుండా తొలగిస్తూ సంతోషపు రంగుల్ని రువ్వుదామంటారు.

కొన్ని మంచి జ్ఞాపకాలు మనల్ని అప్పుడప్పుడు తట్టి పిలుస్తుంటాయి. అయితే కొన్ని చేదు జ్ఞాపకాలను దాచిన తలుపులను మాత్రం తెరవకపోవడమే మంచిదంటూ "తాళం వెనుక తాళం తీస్తూపోతే తలపు లలా తెరుచుకొంటూనే వుంటాయి. కొన్ని జ్ఞాపకాలను దాచిన తలుపులను తెరవకపోవడమే మంచిదేమో'' అంటారు 'నిశ్శబ్ద సమూహాలమై' అనే కవితలో.

ఇక కవితామిత్రుడు గుడిహాళం రఘునాధం నిష్క్రమించినపుడు రాసిన ఎలిజీలో మిత్రుని జ్ఞాపకాలు తనని ఇప్పటికీ, ఎప్పటికీ పలకరిస్తూనే ఉంటాయంటారు. అంతేకాదు మృత్యువును తర్జనితో నిలిపిన నీ పరిహాసం, మరణానంతరం సైతం కవితై శాసిస్తానన్న, నీ మాటలు ఇంకా నిశ్శబ్దంగా వినిపిస్తూనే ఉన్నాయంటారు 'ఎందుకే నీకింతదొందరా?' అన్న కవితలో.

ఇలా ఈ సంకలనంలోని 51 కవితల్లో కొన్ని మానవ సంబంధాల్ని పునరుద్ధరించుకోవాలని చెపుతాయి. కొన్ని మౌనాన్ని, ఇగోను వీడి ఒకరినొకరు పలకరించుకొంటూ ఆత్మీయతారంగుల్ని రువ్వుకోవాలని చెపుతాయి. కొన్ని కవితల్లో మధురమైన జ్ఞాపకాన్ని తలపోసుకోవడం కనిపిస్తుంది. అలాగే చిన్నప్పటి పాత ఇంటితో జ్ఞాపకాలు, సమ్మర్‌లో కనిపించే విశేషాలు, వానలో చిన్నప్పటి అనుభూతులు, ఇప్పటికి అన్వయించుకొని ఒకింత వేదనని వ్యక్తంచేయటం వంటివి కనిపిస్తాయి. అలాగే రెండు మూడు స్మృతి కవితలూ, కనిపిస్తాయి.

విజయ్ తన తొలి ప్రయత్నంలోనే నాగభైరవ పురస్కారాన్ని కైవసం చేసుకొని కవితా రహదారుల్ని మరింత విస్తరించుకొంటూ ముందుకు సాగిపోయే ప్రయత్నంలో ఉన్నారు. ఒకటి అధ్యయన భాష, ఇంకొకటి మాతృభాష. ఇలా ఆంగ్ల–ఆంధ్ర భాషల లోతులు తెలిసిన కవిగా, వీరు మంచి అనువాదకవిగా కూడా రాణించే అవకాశం ఉంది. మంచి వ్యక్తిత్వం ఉన్న కవి ఎప్పటికీ ముందుకు సాగిపోతూనే ఉంటాడు.

♦




# ప్రమాదం

జి.ఎల్.ఎన్. ప్రసాద్
9441450987

ఉదయం ఐదు గంటలకు నా ఫోన్ మోగడంతో, ఇంత పెందలాడే ఫోన్ చేసిన ప్రబుద్ధుడెవరా అని విసుక్కుంటూ ఎత్తాను. "హలో నేను ఆత్మా రామ్. ఇంకా నిద్రలేవలేదా?" ఆ వైపు నించి మిత్రుడి ఆత్మీయమైన పలకరింపు. నాకు మాత్రం ఆ సమయానికి నన్ను లేపడం నచ్చలేదు. "నీకు తెలుసుకదా రామ్ నేను ఏడు గంటలకు కాని నిద్రలేవనని? సరేలే, ఎందుకు ఫోన్ చేశావ్ చెప్పి ఏడువు?" అన్నాను. పొద్దున్నే "ఏడుపు' లాంటి నెగటివ్ మాటలెందుకు? మందలించాడు మిత్రుడు. ఈ మధ్యకాలం ఈ పాజిటివ్, నెగటివ్ ఆలోచనల మీద జరుగుతున్న కార్యక్రమాలు ఏ మత సభలకు తీసిపోవడం లేదనిపిస్తుంది. "అన్నిట్లో పాజిటివ్ ఉండడం సాధ్యం కాదు మిత్రమా.... ఎయిడ్స్ టెస్ట్‌లో పాజిటివ్‌గా వస్తే ఎలా ఉంటుంది మిత్రమా" నిద్ర నేను లేవడానికి ముందే నా సెన్స్ ఆఫ్ హ్యూమర్ మేలుకుంది.

"సర్లే నీలాంటి వితండ వాదులతో నాకేమి పని? మా ఇంటికి ఒక గొప్ప స్వామిజీ పాద పూజకు వస్తున్నారు. నీవు కూడా వచ్చేయి". ఆత్మారామ్ గొంతులో భక్తి పారవశ్యం. "నీకు తెలుసు కదా రామ్.... నేను స్వాములకు, స్కాములకు దూరం అని. నా లాంటి సంసారులకు వారితో ఏం పని చెప్పు? వారి బోధలు నాకు అర్థం కాకపోవడమే కాదు.... అర్థం చేసుకొనే ఉద్ధేశ్యం కూడా లేదని" గట్టిగానే చెప్పాను. "అవన్నీ నాకు తెలీదు... నీవు వస్తున్నావ్... అంతే..." అని ఫోన్ పెట్టేశాడు మిత్రుడు. ఇంక తప్పుతుందా!!! మిత్ర ధర్మం కదా. రెడీ అవ్వడానికి లేచాను. బ్రష్ చేసుకొంటూ టీవీ పెట్టాను. ప్రతి ఛానల్‌లో స్వామీజీల ఉపన్యాసాలే. ఈ దేశంలో క్రికెట్ ఆటగాళ్ళు, సినిమా యాక్టర్స్ తరువాత అంత క్రేజ్ ఉండేది స్వామీజీలకే అనిపిస్తుంది. అన్ని ఛానెల్స్‌లో భక్తి పూనకంగా మారే పరిణామ క్రమం కనిపిస్తుంది. ఇంకో ఛానల్‌లో పేరు మార్చుకొంటే భవిష్యత్తు ఎంత ఉజ్వలంగా ఉంటుందో ఫోన్లో సలహాలిస్తున్నాడు ఒక పెద్ద మనిషి. అదొక నెంబర్ గేమ్. ఈ దేశంలో బూడిద పూసుకొనే స్వామిజీలకు సినిమా తారలకు కూడా లేని ఫాలోయింగ్ ఉండడం చాలా విచిత్రం. ఆశ్రమాలు కిట...కిటలాడి పోతుంటాయి సినిమా హాళ్ళ లాగ. ఏదో పొందుదామని పోయినవారు ... అన్నీ పోగొట్టుకొని ఆశ్రమాల నుంచి బయటకు వస్తున్నారు. ఇదొక ఆధ్యాత్మిక వ్యామోహం. బ్రష్ చేసుకొంటూ... ఈ కార్యక్రమాలు చూడడం నాకు నచ్చకున్నా, ఏదో ఒకటి చూడడానికి నేనుకూడా సామాన్య ప్రజల లాగానే అలవాటు పడ్డాను కాబట్టి

చూస్తున్నాను. ఇవి చూసి... చూసి నాకు కూడా మోక్షం వచ్చేస్తుందా... కొంపదీసి!!! వామ్మో.... బుర్ర గిర్రున తిరుగుతుంది. ఈ కార్యక్రమాల హోరుకు. స్నానం చేసి బ్రేక్‌ఫాస్ట్ కోసం డైనింగ్ టేబుల్ ముందు కూచున్నాను. అప్పుడు గాని గుర్తు రాలేదు శ్రీమతి నిన్న రాత్రే ఊరికి వెళ్లిందని. ఫ్రిజ్‌లో ఆ రోజుకు సరిపడ అన్ని పదార్థాలు సమకూర్చి మరీ వెళ్లింది. తింటూ టీవీ చూడడం నాకు అలవాటు. ఫ్రిజ్‌లో పదార్థాలను టేబుల్ మీద పెట్టుకొంటూ ఛానల్ మార్చాను.

ఒక ఛానల్‌లో ఏమి తినాలో... ఎలా తినాలో చెప్పే కార్యక్రమం ప్రసారం చేస్తున్నారు. నాకు నిజంగా భయమేసింది. నెయ్యి తినకూడదట, ఉప్పు వేసుకోకూడదట. తినడానికి కూడా స్వతంత్రం లేదా మనిషికి? అసలు మనకి స్వతంత్రం వచ్చిందా!!! వామ్మో ఈ కార్యక్రమం నా శ్రీమతి చూస్తే నాకు నాచు... పీచు పెట్టి వంద సంవత్సరాలు జీవించేలా చేస్తుంది. ఈమె ఈరోజు లేకపోవడం మంచిదయ్యింది అనుకొంటూ ఒక హోళిగలో గరిటెడు నెయ్యి వేసుకొని లాగించేసాను. నాకు బ్రేక్‌ఫాస్ట్‌లో స్వీట్ కూడా తీసుకోవడం అలవాటు మరి. పాపం... టీవీ కార్యక్రమంలో కార్యక్రమ రూపకర్తకు నా తిండిని చూసి వొళ్ళు మండినట్టుంది... వాణిజ్య ప్రకటనలు ప్రసారమవుతున్నాయి.

థూ.... మన బతుకు.... ప్రతి యొకడు మన జీవితంలో వేలు పెట్టేవాడే. ఏమి తినాలో చెప్పేవాళ్ళు కొంతమంది... ఎలా తినాలో చెప్పేవాళ్ళు మరికొంతమంది. చివరకు ఊపిరి ఎలా తీయాలో కూడా టీవీ కార్యక్రమాల ద్వారా నేర్పిస్తున్నారు. ఇవన్నీ పాటిస్తే ఆయుషు పెరుగుతుందట... ఏ రోగాలు రావట. తమాషా ఏమంటే ఈ చెప్పేవారు ఉన్నట్టుండి గుండెపోటుతో చనిపోయివుంటారు. జీవితంలో ఏ విషయంలోను ఖచ్చితంగా ఇలాగే జరుగుతుందని ఎవరూ సూత్రీకరించలేరు. ఈ వాస్తవం తెలుసుకోలేక కనిపించిన ప్రతివాడి వెంటపడి వాడిని హీరోగా మనమే చేస్తుంటాము. ఈ ఆలోచనలతో బ్రేక్‌ఫాస్ట్ అయ్యిందనిపించి లేచాను. ఆత్మారామ్ ఇంట్లో పాద పూజ గుర్తొచ్చింది. మిత్ర ధర్మం గుర్తొచ్చింది. ఎలాగూ ఇంట్లో శ్రీమతి లేదు. పొద్దు పోవాలి కదా!!! వెళ్ళి వద్దామనిపించింది.

ఆత్మారామ్ ఇంటి ముందు బారులు తీరి నిల్చున్న జనం కనిపించారు. వీళ్ళంతా పుణ్యం కొట్టేయాలనో... మోక్షం దొబ్బెయాలనో వచ్చినట్టే ఉంది. జీవితంలో కొన్ని ఇస్తే రావని... వస్తే తీసుకోవాలని వీరికి తెలియనట్టుంది. బాహుబలి సినిమాకు నిలుచున్న 'క్యూ కంటే భక్తికి బలి అవుతున్నవారి 'క్యూ' పెద్దగా వున్నట్టు నాకు తోచింది. నేను ఆత్మారామ్ మిత్రుడు కావడం వల్ల ఆ 'క్యూ'లో నిలబడాల్సిన దుర్గతి కలుగలేదు. నేరుగా స్వామిజీ కూచున్న హాలులోకి వెళ్లి ఒక మూల ఒదిగిపోయాను. కనీసం స్వామీజీకి నమస్కారం కూడా చేయకపోవడం చూసి ఆత్మారామ్ చిన్నబుచ్చుకొన్నాడు.

అంతలో ఒకతను వచ్చి స్వామీజీ కాళ్ళమీద పడ్డాడు. "స్వామీ! వ్యాపారంలో నష్టపోయాను. మార్గం చూపండి" అని వేడుకొన్నాడు. నాకు ఆశ్చర్యం వేసింది. స్వామీజీ ఏమన్నా బిజినెస్ స్కూల్ నుంచి బయటకొచ్చిన పట్టభద్రుడా!!! వ్యాపారంలో మెళకువలు ఆయన కేం తెలుస్తాయి అనుకొన్నాను. నా అంచనా తప్పింది. ఏవో హోమాలు, పూజలు చేయించమని స్వామీజీ సలహా ఇచ్చారు. అంటే స్వామీజీ తన వ్యాపారంలో లాభం వచ్చేలా చూసుకున్నారన్నమాట. ఎంత దివ్య దృష్టి. శిష్యుడి నష్టం గురువుకి లాభాలు పండిస్తున్నది. ఒక నలభై ఏళ్ళ వ్యక్తి వచ్చి తన ఇంట్లో వచ్చిన ఏదో కష్టం చెప్పుకొంటే, ఒక అరటి పండును ఆయన చేతిలో పెట్టారు స్వామీజీ. అతను దానిని చూసి హిస్టీరిక్‌గా ఏడవడం ప్రారంభించాడు. నాకు కొంపదీసి అతనికి అరటి పండంటే అలర్జీ ఏమో అని అనుమానం వచ్చింది. తరువాత తెలిసిందేమంటే అరటి పండిచ్చిన స్వామీజీ అనుగ్రహం చూసి అతనికి ఏడుపు తన్ను కొచ్చిందట.

ఆ అరటిపండు విలువ వంద రూపాయలు. అది అరటి పండు కాదట..... పూర్ణ ఫలమట. అది తింటే అతడి కోరిక ఇట్టే నెరవేరుతుందట. అంతలో ఒక ఐదు సంవత్సరాల బుడతడు 'క్యూ' లో స్వామీజీ ముందుకు వచ్చాడు. స్వామీజీ గడ్డం చూసి కొద్దిగా జడుసుకొన్నట్టున్నాడు. బిత్తర చూపులు చూస్తున్నాడు. ఆ బుడతడు నడుస్తుంటే గుమ్మడికాయ దొర్లి వస్తున్నట్టుగా ఉంది. అంత ముద్దుగా... బొద్దుగా ఉన్నాడు. వాడు చేయి చాచాడు. ఆ బుడతడి చేతిలోకి స్వామీజీ విభూతి వేశారు. "దీనిని ఏమి చేయాలి స్వామి నేను?... ఆ అంకుల్ కిచ్చిన అరటి పండు నాకివ్వండి" అన్నాడు వాడు. వాడి మాటలతో శిష్యగణం అపచారం.... అపచారం... అంటూ తత్తర పడి వాడిని విసురుగా పక్కకు లాగారు. భయంతో వాడికి లఘుశంక వచ్చి అక్కడి నేల ఖరాబు చేసాడు.

నిజమే... ఇలాంటి గురువులను చూడడంతో వాడికి గురువు మీది శంకతో లఘుశంక వచ్చిన్నట్టుంది. అసలు తినే పిల్లవాడికి విభూతి, తినని పెద్దాయనకు అరటి పండు ఇవ్వడంలో స్వామీజీ అమాయకత్వం తెలుస్తుంది. మామూలు అవసరాలే గుర్తించలేని ఈయన ఆపదలేమి తీరుస్తాడు!!!

ఇంకొక వ్యక్తి వచ్చి ఇంట్లో అందరికి ఆరోగ్యం బాగాలేదని....అనుగ్రహించండి అంటూ....వాపోయాడు. ఈయన పైత్యం చూస్తుంటే స్వామీజీతో ఆపరేషన్ కూడా చేయించుకొనేలా ఉంది. స్వామీజీ అంతా చూసినట్లుగా వారి ఇంటి వాస్తు బాగాలేదు... వీధి పోటు... జన ఘోష ఎక్కువగా ఉంది అని చెప్పారు. ఇల్లు అమ్ము... అన్నీ సర్దుకొంటాయి అన్నారు.

స్వామీజీ శిష్యులు చౌకగా ఇళ్ళు ఎలా కొంటున్నది నాకిప్పుడు అర్థమయ్యింది. స్వామీజీ నాకిప్పుడు ఫక్తు సామ్రాజ్య వాదానికి పోత పోసిన రూపంలా కనిపిస్తున్నాడు. సామ్రాజ్య విస్తరణ కాంక్ష ఆయనలో నాకు ప్రస్ఫుటంగా కనిపిస్తూ ఉంది. స్వామీజీ దగ్గర ఒక భిక్షపాత్ర ఉంది. దానిలోకి చాలామంది విలువైన కానుకలేస్తున్నారు. అది నాకు భిక్షా పాత్రలాగా కనిపించడం లేదు.... అక్షయ పాత్రలాగా కనిపిస్తూ ఉంది. ఒకరోజులో జనాల బలహీనతలను ఎంత అద్భుతంగా సొమ్ము చేసుకోవచ్చో అర్థమవుతూ ఉంది. సమస్య వచ్చినప్పుడు ఆ సమస్య మూలాలలోకి వెళ్లకుండా... దానిని వేరెవరో పరిష్కరిస్తారనే వెర్రి భావన వల్లనే ఇలాంటి స్వామీజీలకు పూట గడుస్తున్నది. వారి వ్యాపార సామ్రాజ్యాలు సమాంతర ప్రభుత్వాల లాగ విస్తరిస్తున్నాయి. ఆదాయపు పన్ను రాయితీల కోసం అప్పుడప్పుడు వారు కొన్ని సామాజిక కార్యకలాపాలు కూడా చేస్తుంటారనుకోండి. ఇవన్నీ కార్పొరేట్ పోకడలు. ఆధ్యాత్మికతలో కార్పొరేట్ వైఖరులు. భక్తుల నిలువు దోపిడి. ఇదొక చట్ట బద్ధమైన దోపిడి. ఆశ్రమాలలో అడ్రినలిన్‌ను ప్రేరేపించే విన్యాసాలు... మనం పత్రికలలో చూస్తుంటాము. సినీ జగత్తే కాదు... సామాన్య జగత్తు కూడా మత్తులో తూగుతోంది. నాకు స్వామీజీతో పాటుగా అక్కడ ఉన్న అందరిపైన జాలి కలిగింది. ఎంతకాలం అనుచరులు ఈ మైకంలో ఉంటారు... ఎంత కాలం స్వామీజీ ఆ షాడోలో... ఆ ముసుగులో కొనసాగుతారు??? చూద్దాం.

ఇక పాద పూజ ప్రారంభమయ్యింది. అందరు ఆయన పాదాలు కడిగి నెత్తిన నీళ్లు చల్లుకొంటున్నారు. వీరు వారి తల్లిదండ్రుల పాదాలన్నా ఎప్పుడైనా కడిగారో లేదోకాని స్వామీజీ కాళ్ళ చర్మం ఊడేలా కడుగుతున్నారు. పాద పూజకు లక్ష రూపాయలట..... పాద స్పర్శతో రోగాలు.... కష్టాలు పోతాయట. మా ఆత్మారామ్‌కు ఏ కష్టాలు పోయాయో నాకు తెలియలేదు. ఎప్పుడూ ఆత్మారామ్ మొహంలో నేను సంతృప్తి చూడలేదు. అసలు ఏది కష్టం.... ఏది సుఖం?????? ఏది శాపం....ఏది వరం?.....ఏది ఆగ్రహం......ఏది అనుగ్రహం?????? ఉన్న ఒకే ఒక్క జీవితాన్ని అనుభవించకుండా ఎందుకు వీళ్ళంతా ఇంత సంక్లిష్టం చేసుకొంటున్నారు? కాళ్ళు మంట పుట్టినట్టున్నాయి... స్వామీజీ ప్యాకప్ చెప్పేశారు. శిష్యులు ఆయన చుట్టూచేరి ఆయనను వాహనం దగ్గరికి పిలుచుకుపోతున్నారు. ఎవరో అప్పుడే అక్కడ వచ్చిన వారి ఫోన్ నెంబర్లతో ఒక వాట్సప్ గ్రూప్ తయారు చేసేశారు. ఆ నెంబర్‌కు స్వామీజీ ఆశీస్సులు వచ్చాయి.

స్వామీజికి కూడా నా ఆశీస్సులు పంపుదామనే చిలిపి ఆలోచనను అతి కష్టంమీద నియంత్రించుకొన్నాను. జనాల తొక్కిసలాట మధ్యే స్వామీజీ కారెక్కారు. అది అత్యంత ఖరీదైన విదేశీ కారు. ఎవరైనా సమాచార హక్కు ద్వారా స్వామీజీ కట్టిన ఆదాయపు పన్ను వివరాలు అడగొచ్చు కదా????? అడిగినా చెపుతారా ఏంటి???? వ్యక్తిగత గోప్యత క్రింద దాటవేస్తారు కాని!!!!! ఎంత డాబుసరి జీవితం. వచ్చే జన్మలో స్వామీజీగా పుట్టాలనుకొన్నాను. అయ్య బాబోయ్... ఇదేంటిది... పరమ నాస్తికుడైన నాకు జన్మల మీద... కర్మల మీద ఆలోచనలొస్తున్నాయి. నా స్వభావం గట్టిది కాబట్టి స్వామీజీ ప్రభావం నామీద పడలేదు కాని... లేదంటే నేను కూడా హిమాలయాలు చూడాలని వెంటనే బయలుదేరేవాడినేమో!!!!!

స్వామీజీ వెళ్ళిపోయిన కాసేపు వరకు ఆత్మారామ్‌తో మాట్లాడుతూ ఉండిపోయాను. ఆత్మారామ్ ఇంకా ట్రాన్స్‌లో స్వామీజీ మహిమల గురించి మాట్లాడుతున్నాడు. ఇంతలో ఆత్మారామ్ సెల్ మోగింది. ఆత్మారామ్ మొహంలో ఆందోళన... అతని కాళ్ళు చేతులు అదురుతున్నాయి. అక్కడ ఉన్న అందరికి వాట్సప్ సందేశం వచ్చింది. అందరు హాహాకారాలు చేసుకొంటూ బయలుదేరారు. నేను కూడా నాకొచ్చిన సందేశాన్ని చూశాను. అది ఊరి పొలిమేరలు దాటిన వెంటనే స్వామీ కారుకు తీవ్ర ప్రమాదం జరిగినట్టుగా వచ్చిన సందేశం. కారు నుజ్జు... నుజ్జు అయ్యిందట... అందులో వున్న అందరు స్వామీజీతో పాటుగా మరణించారట. నేను మానవతా దృక్పథంతో ఆత్మారామ్‌ను తీసుకొని నా కారులో ప్రమాద స్థలానికి చేరుకొన్నాను. అప్పటికే అక్కడ అంబులెన్స్ వచ్చింది. కారు రూపురేఖలు మారిపొయ్యాయి. విండ్ షీల్డ్‌లో నుంచి స్వామీజీ పాదాలు చివరి పాద పూజ కోసమా అన్నట్టు బయటకు వచ్చి వున్నాయి. అందరూ ఏడుస్తున్నారు... ఆ ఏడుపుల మధ్య చేసేదేమీలేక నేను ఆత్మారామ్‌కు కూడా చెప్పకుండా ఇంటిదారి పట్టాను. కాని కారులోంచి బయటకు వచ్చిన ఆ పాదాలు నా స్మృతి పథంలో మెదులుతూనే వున్నాయి. ఆయన భక్తులను ఆయన పాదాల నుంచి కాలమే రక్షించిందేమో... ఎవరికి తెలుసు.

♦

# నానీలు

- నాగాంజనేయులు
9959017179



సూర్యుడు కురిపించాడు
నిప్పుల వర్షం
చెట్టు పూయించింది
నీడ పుష్పం

కొమ్మల మాటున
నిండు చందమామ
నేలపై
వెలుగు పూలు

నింగిని తాకేద్దామని
కొమ్మ...
అందుకు నేల
ఒప్పు కోవాలిగా?

పలకా బలపం
ఏడ్చాయి
పసివాడు
పనిబాట పడ్డాడని.

పుస్తకాలు మోసే చేతులు
రాళ్ళు మోస్తున్నాయి
బళ్ళు
ఎడారులౌతున్నాయి.

హీనంగా చూడకు
చెత్తకుండీని
"అక్షయపాత్ర"ది
మూగజీవాలకు.

గుళ్ళో అన్నదానం
అటువైపే చూస్తూ...
బయటే నిల్చుంది
ఆకలి.

మేడలో అమ్మ లేదు
వాడలో అన్నం లేదు
ఏడుపు మాత్రం
పిల్లాడితోనే.

ఎన్నో శిల్పాలకు
ప్రాణం పోసాడతను..
అవే అతన్ని
అమరుణ్ని చేసాయి.

కాగితంపై పూసాయి
రంగు రంగుల పూలు
తోటమాలి..
చిత్రకారుడు.

అతడి కోపం
ఆ ఇంటికి ఛితిమంట
ఆమె శాంతం
ఆ ఇంటికి దీపం.

తలదిండు
తడి తడిగా ఉందా?
రేయంతా కురిసింది
కన్నీళ్ళ వర్షం.

దుఃఖానికి
నేనెప్పుడూ దగ్గరే
ఆనందానికే...
అప్పుడప్పుడు.

పనితీరులో ఒక్కటే
హలంలాగే కలానిది
దున్నితే..
అక్షరాల పంటే.

చక్రం కింద నలిగి
తీపినిచ్చింది...
చెరకు త్యాగానికి ప్రతీక
అమ్మలా...

పుట్టి
అమ్మ ఒడి చేరినట్టు...
మళ్ళీ పుట్టేందుకు
స్మశానం ఒడి చేరాడు.

ఆకులు రాలి చెట్టు
అస్థిపంజరంలా...
నెర్రలు చీలి నేల
స్మశానంలా.

ఆస్తుల పంపకం
కొడుకులది
అమ్మానాన్నల పెంపకం
ఆశ్రమాలది.

పసిపాపలై
అమ్మమ్మ తాతయ్యలు
వారికి అమ్మలై
ఆశ్రమాలు.

◆

# ఆడపిల్ల అంతర్మథనం 'ఇట్లు.. ఓ ఆడపిల్ల'

-కెంగార మోహన్
9493375447






కవిత్వం చదువుతున్నంత సేపూ అనిర్వచనీయ అనుభూతి. అప్పుడపుడూ కళ్ళు చెమర్చిన సందర్భాలు. సరేనని సంభాళించుకుంటే మదిలో ఏదో వెలితి. మళ్ళీ కవిత్వం ఆలోచింపజేస్తుంది. ఫెమినిస్టుగా కవిత్వం రాసిందా? లేక కవిత్వం కోసమే బతికి కవిత్వాన్ని సృజియించిందా? మానసిక సంఘర్షణల నడుమ అస్తిత్వ వేదనల్లోంచి, ఆవేదనాభరిత సంక్లిష్టతల్లోంచి అక్షరాల యాతన పురుడుబోసుకుందా అనే అనేక ప్రశ్నలకు జవాబు చెబుతుంది ఇట్లు..ఓ ఆడపిల్ల కవిత్వం. స్త్రీవాద కవిత్వం అడపా దడపా వస్తున్న సందర్భంలో, ఆడతనపు అస్తిత్వపు వేదనల్ని అతి తక్కువగా అక్షరీకరిస్తున్న సమకాలీన సాహిత్యలోకంలో గంగవరపు సునీత చేస్తున్న సమరం ఆలోచింపజేస్తుంది. ఇటీవల తెలుగుసాహిత్యలోకంలో కథలూ, కవితలూ బలమైన అభివ్యక్తితో రాస్తున్న రచయిత్రి. కవిత్వం గొంగళిపురుగులా చీల్చేస్తుంది. మనసనే ఆకాశాన్ని రెండుగా కత్తెరతో విడదీసినంతగా జెండర్ అసమానతలను చీల్చి మరీ చూపిస్తుంది. ఈ సంపుటిలోని ఆడపిల్ల అనే కవితలో..

*నేనొక ప్రాణిని*
*ఓ తల్లి కడుపులో జీవం పోసుకుంటున్న జీవిని*
*నాలుగైదు నెలల తరువాత*
*స్కానింగ్‌లో తేలింది నేనెవరినో*
*కటికచీకటి మొదలుకొని*
*కన్నతల్లి వరకు పెదవి విరిచారు*

కారణం నేను ఆడపిల్లను. నిజమే కదా ఈ లోకం ఇలానే యోచిస్తుంది. ప్లస్సూ మైనస్సులనే జీవిత గణాంకాలను ఏ గురువు నేర్పకుండానే ఏకలవ్యుడు నేర్చుకున్నట్టు జీవితంలో భాగంగా అవలీలగా నేర్చుకున్న జీవనసారమిది. సమాజం ఎంతో ముందుకెళ్తుందని, ప్రగతి సాధిస్తున్నదని చెబుతున్న మేధావులకు ఒక అర్థం కాని ప్రశ్న వేయాలనిపిస్తోంది. సమాజంలో ఆడపిల్లంటే వివక్ష చూపిస్తున్నది చదువుకున్నవారా? లేదంటే చదువుకు దూరంగా ఉన్న నిరక్షరాస్యులా? పల్లె తల్లి ఒడిలో పుట్టి పెరిగిన వారు మాత్రం ఎవరు పుట్టినా ఒకటేననే దోరణి సహజంగా వుంటది. విద్య వలన వినయం, వినయం వలన సంస్కారం అబ్బాలే కాని, ఆడదంటే, ఆడపిల్లంటే తక్కువగా చూసే సమాజం నేడు మన కళ్ళముందుంది. కవిత్వంలో గంగవరపు సునీత చేసినది అస్తిత్వ పోరాటమొక్కటేకాదు, మానసిక సంఘర్షణలను, సాంఘిక సంక్లిష్టతలను కళ్ళకు కట్టినట్లు కవిత్వీకరిస్తుంది. ఒక స్త్రీ జీవితంలో పడే సంఘర్షణలను చెబుతుంది. ఈ కవితలో..

**ఆవును నేను అమ్మాయినే!/ పుట్టింది నేనేనని/ సగర్వంగా చెప్పుకోలేని/ ఈ సోకాల్డ్ సొసైటీలో జన్మించిన/ సగటు ఆడపిల్లను నేను/ ఎన్నో అభ్యంతరాలను అధిగమించి/ అసంతృప్తులను దాటవేసి/ నా తల్లి నాకు జన్మనిచ్చింది(అమ్మాయినే...)**

కవిత్వంలో ఫెమినిస్టు దోరణి అనుకోవచ్చేమో గాని, నిశ్శబ్ధంగా గుండెల్లోంచి ఉబికివచ్చే లావాలా కవిత్వం సృష్టిస్తుంది. దీన్ని ఒక సృజన అనాలని అనిపించదు. వాస్తవాన్ని గుండెలపై మోసుకొస్తుంది. గుండెని ఎంతగా మధించి వుంటే ఇటువంటి కవిత్వం పురుడుబోసుకుంటుంది. ప్రసిద్ధ కవి పాశ్చాత్యకవి కెబెల్ ఉప్పొంగు అనుభూతుల అభివ్యక్తి కవిత్వం అన్న మాట గుర్తొస్తుంది. ఈ కవిత్వంలో ఒక గొప్ప సిద్ధాంతం అంతర్గతంగా ఉందనిపించింది. ప్లేటో ప్లాటోనిక్ లవ్ గూర్చి చెబుతూ స్త్రీ పురుషులు సమానులు కారని, అందువలన కాని వారి మధ్య ప్రేమ సంబంధము లేదంటాడు. అలాగే స్త్రీ సమాజమున గౌరవ స్థాయి లేదంటాడు. స్త్రీలకు సమాన హక్కలను కోరినప్పటికీ లైంగిక సంబంధమైన విషయములందు మాత్రం స్రీ పురుషుల సమానత్వాన్ని గుర్తించడు. అంతేకాక స్త్రీ పురుషుల మధ్య అక్షయ ప్రేమ లేదంటాడు. చివరగా స్త్రీ పురుషులు కేవలం సంతానార్ధము సంబంధము జరుపుకోవాలనే అజ్ఞానపు సిద్ధాంతం చెబుతాడు. ఈ సిద్ధాంతం తప్పని గంగవరపు సునీత చెప్పకనే చెముతుంది. ఈ కవితలో..

*నిను చూస్తూ ఉంటే తనువంతా గిలిగింత*
*నువ్వు చెంతనే వుంటే అణువణువూ పులకింత*
*నాతోడై నడిస్తే అర్పిస్తాను బతుకంతా*
*రా నేస్తం! నీకోసం వేచి ఉంటాన్నేను జన్మంతా..*(నీ రాకకై)

ఎంత గొప్ప అనుభూతి. ప్లేటో సిద్ధాంతాన్ని సున్నితంగా తిరస్కరిస్తుంది. ఇందులో భావుకతో, భావ కవిత్వమో, అనుభవసారమో ఏదైనా అనండి. ఇది ముమ్మాటికీ హృదయ ప్రకంపనం. అనిర్వచనీయమైన ప్రేమానుభూతి. ఈ కవిత్వం నిండా అనుభూతులు అలల్లా ఎగసిపడుతుంటాయి. గుండెపై చేయివేసి ప్రమాణం చేయమంటాయి. జతకలసి ప్రయాణం చేయమంటాయి. నమ్మకాలతో జీవితాంతం కలసి నడుద్దామంటాయి. కవిత్వంలో ఎక్కడా పురుష వ్యతిరేకత కనిపించదు. మానవ జీవితంలో ఇద్దరి పాత్ర సమానమని తనకు తాను ఆవిష్కరించుకునే ప్రయత్నం చేస్తున్నట్లు అనిపించినా సైద్ధాంతికంగా నిరూపించే ప్రయత్నం చేస్తుంది. అంతరాయం అనే ఈ కవితలో..

*మనం ఎన్నో రాత్రులు కలసి పంచుకున్నాం*
*చందమామ వెన్నెలలూ..*
*నక్షత్రాల సోయగాలు*
*ఒకరి కళ్ళలోంచి మరొకరం దోచుకుంటూ*
*కదులుతున్న చేతి వేళ్ళ కొనలలో*
*స్పర్శానుభూతిని చిత్రీకరిస్తూ..*
*శబ్ధం లేని ఊసులనే ఊపిరిగా శ్వాసిస్తూ*
*మనం ఎన్నో రాత్రులు కలసి ఆస్వాదించాం.*

ఈ కవిత చదివినప్పుడు మనోఫలకం మీద ఒక చిత్రం, ఆవిష్కృతమవుతుంది. కవిత్వంలో నిజం ఉన్నప్పుడు, సత్యాన్ని అన్వేషిస్తున్నప్పుడు, వాస్తవాన్ని అక్షరీకరిస్తున్నపుడు, హృదయం ఇలాగే ప్రకంపనమవుతుంది. మనం మామూలుగా ప్రకృతి, సమాజం, సమాజంలోని మానవసంబంధాలు బహుముఖంగా వుంటాయని అనుకుంటూ వుంటాం. ఇట్లు ఓ..ఆడపిల్ల కవిత్వం చదివాక అనిపిస్తుంది నూటికి నూరుపాళ్ళు ఇది నిజమనిపిస్తుంది. కవిత్వంలో సమకాలీన వర్తమాన సమాజంలో ఆడపిల్లగా ఎదుర్కొంటున్న సమస్యలే కాదు, బయటకు చెప్పలేని చెప్పుకోలేని విషయాలన్నీ కవిత్వంలో గంగవరపు సునీత చర్చకుపెడుతుంది. అందుకే ఏ కవికైనా, కవయిత్రికైనా వర్తమానమే వస్తువు కావాలి. వాస్తవికతే అక్షరమవ్వాలి. అప్పుడే చిక్కనైన కవిత్వం, సమాజహితం కోరే సాహిత్యం సమాజంలోకి పరకాయప్రవేశం చేస్తుంది. ఈ కవితలో..

*స్త్రీలను దేవతలంటూ దయా స్వరూపులంటూ*
*అక్షరీకరించిన ఆది కావ్యాల్లోంచి*
*వేన వేల గొంతుకలు దీనంగా అర్ధిస్తున్నాయి..*
*మాకు పూజలు వద్దు..పురస్కారాలూ వద్దు!*
*సాధికారత వద్దు*
*మేమేదో తక్కువనే సానుభూతి వద్దు*
*మాన ప్రాణాలతో ..మమ్మల్ని మనుషులుగా*
*బతకనివ్వండి చాలు..*

ఎంత గొప్పగా ముక్తాయిస్తుంది. దీన్ని స్త్రీవాద కవిత్వమనో అస్తిత్వమనో అనాలని అనిపించదు. సగటు స్త్రీ పడుతున్న యాతనను కన్నీళ్ళతో అక్షరీకరించిదనిపించింది.. ♦




# శ్రీశ్రీ సాహిత్య నిధి నిరంతర ప్రవాహం!

## - సింగంపల్లి అశోక్‌కుమార్

■ *అశోక్ కుమార్ గారూ మీ కుటుంబ నేపథ్యం వివరిస్తారా?*

■ తూర్పు గోదావరిజిల్లా రామచంద్రపురం తాలూకా పందలపాక గ్రామవ్యాస్తవ్యులైన మా తల్లిదండ్రులకు మేే నలుగురు సంతానం. మొదట అన్నయ్య, రెండు అక్కయ్య, నేను మూడో వాడని. నాలుగు తమ్ముడు. మా నాయన మూడు రకాల వ్యాపార సంస్థలు నిర్వహించేవారు. గ్రామఫోను రికార్డుల అమ్మకం, కొత్త సైకిళ్లు, విడిభాగాల అమ్మకం, చలువ, చత్వారాల కళ్లజోళ్ల అమ్మకం,- ఒక్క చోట కాకుండా ఆయన స్థిరపడిన, రామచంద్రపురం హెడ్ ఆఫీసుగా చుట్టూ వివిధ పట్టణాల్లో శాఖలు నిర్వంచేవారు. కాబట్టి మరో ఆలోచన లేకుండా మాది పక్కు వ్యాపార కుటుంబం అని చెప్పుకోవచ్చు.

మా నాయనకి రాజకీయచైతన్యం బాగానే ఉండేది. ఆయన వీర కాంగ్రెస్‌వాది. రిపబ్లిక్ డే నాడు, ఆగష్టు 15నాడు, గాంధీ జయంతినాడు మా ఇంటిపై జాతీయజెండా మాతో ఎగరేయించే వారు. కాంగ్రెస్ పార్టీ చాలా గొప్పదని, ఎంతో త్యాగం చేసిందని. ఈ దేశం ఎంతో రుణపడివుందని నమ్మేవారు. మాకు బోధించేవారు.

■ *మీ రచనా నేపథ్యం గురించి చెప్పండి ?*

■ నేను కన్ను తెరిచింది 1950లో శ్రీశ్రీ మహాప్రస్థానం పుట్టిన సంవత్సరమైతే, పెన్ను తెరిచింది 1970 శ్రీశ్రీ షష్టి పూర్తి సంవత్సరం. శ్రీశ్రీ 'మహాప్రస్థానం' కావ్యం నన్ను కవినీ, కమ్యూనిస్టునీ చేసింది. మహాప్రస్థాన ప్రభావం నా మీద ఎంతస్థాయిలో ఉండేదంటే సామాజికస్పృహ లేకుండా అప్పటినుండి ఇప్పటివరకు ఒక్క అక్షరం కూడా రాయలేక పోయేను. మనసు ఉత్సాహంగా ఉన్నప్పుడు, నిరుత్సాహంగా ఉన్నప్పుడూ మహాప్రస్థానం గొంతెత్తి ఉద్రేకంగా చదవాలనిపిస్తుంది.'మొదటిసారి మహాప్రస్థానం చదివినప్పుడు జ్వరం వచ్చిందని కవులూ, రచయితలూ అంటుంటారు. మీకూ అంతేనా? అని ఓ ఇంటర్వ్యూలో నన్ను అడిగితే- 'నాకేమిటి? ఆరోగ్యవంతుడైతే ఎవరికైనా వచ్చి తీరాలి. రాలేదంటే వాడి రోగిష్టి వాడే !' అన్నాను.

1970 వరకు స్వీయరచనలేవీ చేయలేదు. పుస్తకాలు విపరీతంగా చదివే వాడిని. ముఖ్యంగా హేతువాద సాహిత్యం. హేతువాద భావాలు తీవ్రంగా ఉండేవి. ఆ భావాలతోనే నా బాల్య స్నేహితుడు సోదరిని మంత్రాలూ, ముహూర్తాలు లేని కులాంతర, దండల మార్పిడి నాస్తిక వివాహం జనవరి 1972, మొదటిరోజున చేసుకున్నాను. ఆ హేతువాద చైతన్యమే తరువాత మా అమ్మాయికి, మా అబ్బాయికి అదే తరహాలో అదే జనవరి ఒకటిన వేరువేరు సంవత్సరాలలో వివాహం జరిపించింది. ఆ హేతువాద చైతన్యంతోనే నా సాహిత్యసృజనకు పురుడు పోసుకుంది. మొదటి కవిత హేతువాద కవిత, మొదటి పుస్తకం హేతువాద గ్రంథం. అంతే

కాదు ఇప్పటి వరకు నావి పదమూడు ముద్రిత రచనలు అయితే అందులో ఏడు హేతువాద పుస్తకాలే.

ఆ కాలంలోనే అద్దేపల్లి రామమోహనరావు బందరు నుండి కాకినాడ వచ్చారు. వామపక్ష భావాలున్న సీనియర్ సాహితీవేత్త వయసులో మాకంటే పద్నాలుగు సంవత్సరాలు పెద్ద. క్రాంతి రచయితల సంఘం పేరుతో నేను కార్యదర్శిగా వామపక్షభావాలు కలిగివున్న వాళ్లంతా ఒకటయ్యాం. క్రాంతి రచయితలు సంఘం తరఫున జిల్లెళ్లమూడి అమ్మ బూటకాలను బయట పెడుతూ, అతి తీవ్రంగా విమర్శిస్తూ నేను రాసిన 'తల్లీ! ఎవరునువ్వు? అనే దీర్ఘకవితా కావ్యం వెలువరించాం. దానికి అద్దేపల్లి సుదీర్ఘ పీఠిక రాశారు. ఆ పుస్తకం కలిగించిన సంచలనం- అద్దేపల్లి ఉద్యోగం ఊడేదాకా వెళ్లింది. కవితా ప్రియులు అన్నివిధాలైన కవిత్వాన్నీ ఆహ్వానిస్తారు కాబట్టి, అన్ని కవి సమ్మేళనాల్లోనూ, మేం ఉండేవాళ్లం. విప్లవ కవిత్వంతో చెలరేగిపోయేవాళ్లం. ఆ విశేషాలు అద్దేపల్లి ఆయన 'మెరుపుపువ్వు' లఘు కావ్యంలో అందరినీ పేరుపేరునా పేర్కొంటూ వివరంగా రాశారు. ఆ విశేషాలు 'సాగిపోయే రాస్తాలూ, మలుపుతిప్పే చౌరాస్తాలు'శీర్షికన 'ప్రస్థానం' ప్రత్యేక సంచిక నవంబర్/డిశంబర్ 2008లోలో కూడా ప్రస్తావించారు.అందులో ఒక చోట అద్దేపల్లి ఇలా అంటారు' తీవ్రమైన రోజులు గడిచిన తర్వాతి రోజుల్లో ఒక మిత్రుడు నాతో అన్నాడు. 'బాబోయ్' ఆ రోజుల్లో మిమ్మల్ని చూస్తే భయంగా ఉండేది. దూరంగా కనపిస్తే పక్కసందులోంచి వెళ్లి పోయేవాణ్ణి! ఈ మాటలు అతిశయంగా చెప్పడంలేదు గాని, ఒక ముద్ర పడటం గురించి అవి తెలియజేస్తై' అంటారు.

తొమ్మిదిమంది కవులతో నేను కన్వీనరుగా కాకినాడ విరసం యూనిట్ ఏర్పడింది.చాలా మిలిటెంట్‌గా ఎన్నో సాహిత్య కార్య క్రమాలు నిర్వహించాం. విప్లవరచయితల అరెస్టులను ఖండిస్తూ కరపత్రాలు,బులెటిన్స్ ప్రచురించాం. అద్దేపల్లి విరసంలో లేరుగాని నిరం తరం విప్లవచైతన్యంతో ఉండేవారు.'ఇందిరాగాంధీ బూటక సంస్కరణలు ఎద్దేవాచేస్తూ రాసిన 'ఏం జెయ్యాలేంజెయ్యాలి ఇందిరమ్మకు భజన చేయాలిలాంటి' శక్తి వంతమైన పాటలు రాశారు.

ఆ తరువాత బతుకుతెరువు కోసం దాదాపుగా కాకినాడ విరసం సభ్యులందరూ- నేను విజయవాడ, రారాసి రాజమండ్రి, నందనోదయ, ఈశ్వర్- విశాఖపట్నం, హైమ సమతా కోటేశ్వరరావును పెళ్లి చేసుకొని విజయవాడ వలసలు పోయాం. గొప్ప విశేషం ఏమిటంటే బతుకు సమస్యల వలన వలసలు పోయారే తప్ప వాళ్లలోని సామాజిక చైతన్యం వలసపోలేదు.

నావరకు-నేను విజయవాడలో ఉంటూనే ఒక బొంబాయి టార్చ్‌లైట్స్ కంపెనీకి పనిచేస్తూ సేల్సు ఎక్సిక్యూటివ్‌గా ఆంధ్రప్రదేశ్ అంతా తిరుతుతుండేవాడిని. అలా సుదీర్ఘకాలం సాహిత్య సృజనకు, సాహిత్య కార్యక్రమాలకు విరామమైపోయింది. 2000లో కాని తిరిగి నా ప్రవృత్తి రంగంలో క్రియాశీలుణ్ని కాలేకపోయాను. కొన్ని ముద్రిత కవితలతో, నాలుగు ముద్రిత గ్రంథాలతో నిలిచిపోయిన నా సాహిత్య వ్యాసంగం 2003లో 'శుభాకాంక్షలు' పుస్తకంతో, 'ఆలోచన' సంస్థతో పునఃప్రారంభం అయింది. నూతన శతాబ్దిలో ప్రారంభించి ఎప్పటిదో ఆలోచన 'శ్రీశ్రీ క్విజ్'కి రూపం ఏర్పడి తయారు చేసుకోవడం పెట్టాను.

ఇక్కడ ముఖ్యంగా అద్దేపల్లి గురించి చెప్పుకోవాలి. నాకు పరిచయమైన నాటి నుండి అంటే నా సాహిత్య జీవితం తొలినుండి ఆయన బతికిన చివరి రోజు వరకు ప్రతి సందర్భంలోనూ నాతో వున్నారు. నన్ను ప్రోత్సహిస్తునే ఉన్నారు. ఎన్నో వందల్లో ముందుమాటలు రాసిన అద్దేపల్లి రాసిన తొలిముందుమాట నా తొలి రచన 'తల్లీ! ఎవరు నువ్వు?'కు అయితే, మరణశయ్య మీద నుండి రాసిని చివరి మంచిమాట నా 'అక్షరాలు' పుస్తకానికి. అంతే కాకుండా ఆయన ఎక్కువ ముందుమాటలు రాసిన రచయితను నేనే, అవన్నీ 'అసిధార' పేరుతో ఓ పుస్తకంగా వెలువడింది.

**■ మీ స్వీయ రచనల గురించి.**

■ 1.తల్లీ !ఎవరు నువ్వు?, 2. శ్రీ బాబా మహత్యం, 3. బాలయోగీశ్వర సందర్శనం, 4.మతప్రస్థానం, 5.శుభా కాంక్షలు, 6. తంత్రం, 7.పొద్దు పూసింది, 8.ఆధ్యాత్మిక ర'హ'స్యాలు, 9.వ్యూహం,10.గ్లోబలి, 11. అక్షరాలు, 12. జ్ఞానగుళికలు, 13. సదసత్సంశయం ఇంకా 2007 నుండి 44 శ్రీశ్రీ బులెటిన్‌లకు (సాహిత్య త్రై మాస కరపత్రిక)కు, 88 శ్రీశ్రీ సాహిత్యనిధి ప్రచురణల పుస్తకాలకు కూర్పు. ప్రస్తుతానికి ఇంత ! భవిష్యత్తులో ఎంతో ?

శ్రీశ్రీ ప్రేరణతోనే నా రచనా వ్యాసంగంలో నాకు నచ్చిన ఓ అయిదు ముఖ్య రంగాలను ఎన్నుకుని, నాకు నేనే ఒక మానిఫెస్టో తయారు చేసుకున్నాను. ఆ అయిదూ ఏవిటంటే...

1. శ్రీశ్రీ సాహిత్యనిధి(శ్రీశ్రీ సాహిత్యం, శ్రీశ్రీపై సాహిత్యం

పోగుచేసి భావి తరాలకు అందించడం) 2. లఘు కవిత్వం (శక్తిమంతమైన అణు కవితా రూపాలు రాయడం, రాయించడం) 3. అశోకనివాళి( అమరులైన జాతివైతాళికుల సాహిత్య రాగాలకు, జీవిత త్యాగాలకు అక్షరగానం). 4. హేతువాదం( పేట్రేగిపోతున్న మూఢనమ్మకాలపై, సర్వమత ఉన్మాదాలపై రాజీలేని హేతువాద పోరాటం) 5. ఎర్రజెండా (ఎర్రజెండాయే ఎజెండాగా వామపక్ష సాహిత్య సంస్థల వెంట ప్రయాణం)

సుదీర్ఘ కాలంగా చేస్తున్న శ్రీశ్రీ సాహిత్యనిధి కృషి ఇక చాలు, స్వీయరచనల మీద దృష్టిపెట్టమని ఎంతోమంది సాహితీమిత్రులు సూచనలు, సలహాలు ఇస్తున్నారు. వారి అభిమానానికి నా హృదయపూర్వక ధన్యవాదాలు.

శ్రీశ్రీ సాహిత్యనిధి కృషి ఇప్పటికే కాదు ఎప్పటికీ చాలదు. శ్రీశ్రీ భావాల పోగు శ్రీశ్రీ అభిమాని విధి. శ్రీశ్రీ భావాల సాగు శ్రీశ్రీ సాహిత్యనిధి. అది నిరంతరం ప్రవహించాల్సిందే. అది జీవనదిగా ప్రవహిస్తూనే ఉంటుంది. అందుకు శ్రీశ్రీ సాహిత్యనిధికి వాదోడు, చేదోడు, సైదోడుగా సహకరిస్తున్న శ్రీశ్రీ అభిమానులకీ, వామపక్షసాహితీసంస్థలకూ 'అరుణ'గ్రస్తుణ్ణి.

అయినా శ్రీశ్రీ సాహిత్యనిధి తరపున మూడు నెలలకో బులెటిన్‌కూ, మూడు నెలలకో నాలుగు పుస్తకాలకూ(శ్రీశ్రీవీ, శ్రీశ్రీపై ప్రముఖులవీ) 2007నుండి కూర్పు వహిస్తూ క్రమం తప్పకుండా వెలువరించే కార్యక్రమానికి అంకితమైనప్పటికీ-'అక్షర నివాళి'(అమర సాహితీ వేత్తల సంస్మరణ), శ్రీశ్రీ సాంగ్‌మార్చ్'( శ్రీశ్రీ సినిమా పాటలూ, పాటలవిశేషాలు) 'అణువు' (అక్షర సంధానం-మినీకవితలు రాయించడం, రాయడం)లాంటి శీర్షికలు వరుసగా 'ప్రజా సాహితి' మాసపత్రిక,'విశాలాంధ్ర'దినపత్రిక(ఆదివారం అనుబంధం),'చినుకు' మాసపత్రికలలో నిర్వహిస్తూనే ఉన్నాను. స్వీయరచనల మీద కూడా దృష్టిపెట్టమనే మిత్రుల సలహా తప్పక పాటించదగింది. అందుకే 2015వ సంవత్సరం నుండి ప్రతి ఏటా స్వీయ రచన ఒక పుస్తకం తీసుకు రావాలనుకున్నాను. తీసుకువస్తున్నాను.

■ ***శ్రీశ్రీతో మీది పరిచయం వరకేనా, మీ సాహిత్యంపై శ్రీశ్రీ తన అభిప్రాయం చెప్పిన సందర్భం వుందా?***

■ 'This is a brilliant writing Charged with destructive dynamite' అంటూ నా తొలిగ్రంథం 'తల్లీ ఎవరు నువ్వు!' (1973,ఏప్రిల్)కు మహాకవి శ్రీశ్రీ నుండి పోస్టుకార్డు ప్రశంస నాకు పెన్నూ వెన్నూ తట్టిన అవార్డుగా భావిస్తాను. ఐదు ముద్రణలు పొందిన ఆ పుస్తకం మలి ముద్రణనుండి శ్రీశ్రీ ప్రశంస యోగ్యతాపత్రంగా అచ్చవుతూనే ఉంది.

అప్పటికి కాకినాడ విరసం యూనిట్‌కి కన్వీనర్‌ని. తూర్పుగోదావరి జిల్లా పౌరహక్కుల సభలో పాల్గొనడానికి శ్రీశ్రీ రాజమండ్రి వచ్చారు. రాత్రి అయితే ఆయనకూ, మాకూ ఇబ్బందే అయివుండేమో. ఉదయం ఎనిమిది కావస్తోంది. శ్రీశ్రీని లలితా లాడ్జిలో నేను, రారాసి, నందనోదయ వెళ్లి పరిచయం చేసుకున్నాం. ఆప్యాయంగా పలకరించారు. విరసం సభ్యులంటే ఆయనకు కుటుంబసభ్యులే. వెంటనే చిన్న పిల్లాడిలా జేబులో కాగితం తీసి ఇంకా అచ్చుకాని ఆయన రాసిన కవిత 'ఓ మహాత్మా ! ఓ మహర్షి' చదివి వినిపించారు. పసి పిల్లాడిలా ఎలా ఉందని మా మొహాలలోకి చూస్తే, మేం ఒకరి మొహాలొకరు చూసుకుని కవిత మధ్యలోని పాదాలు 'వెన్నెముక విరిచావు తండ్రీ/ దేశమే ఒక మురికి లాండ్రి'-చివరి పాదాలు 'హింసతోనే సృష్టి పూస్తది/హింసతోనే మార్పు వస్తది' గొప్పగా ఉన్నాయన్నాం. మిత్రులు రారాసి, నందనోదయలు తీవ్రమైన చెరోకవితా చదివారు. అప్పటికే మినీ కవిత్వంపై ఇష్టం పెంచుకున్న నేను నా మినీ కవితను వినిపించాను. కవిత శీర్షిక 'ప్రారంభం'..'చన్నులో పాలు చేరితే / శిశు ప్రాణోదయం / ప్రారంభం!-కాయితమ్మీద / సిరా పారితే/ కవిత ప్రారంభం!- పుడమి మీద వర్గశత్రువు నెత్తురు పారితే పోరాటం ప్రారంభం!' విని నవ్వుతూ తలపంకించారు. 'మహాప్రస్థానం' చదివిన తరువాత మరేమీ రాయలేకపోతున్నాను అన్నాను. ఏం అన్నట్టుగా చూశారు. ఇలా చెప్పాను-'అందమైన/ కవితా ఆకారానికి/ మధురోహల ప్రాకారంతో/ శ్రీకారం/ చుడదామనుకున్నప్పుడు- మీరు నాలో ప్రవేశిస్తారు/ నా సర్వేంద్రియాలను / ఆవహిస్తారు! -అంతే- అక్కడి నుండి-కవితకు శ్రీకారం మాని / శ్రీశ్రీ కారం చుడతాను'అని చదివాను. మనోహరంగా నవ్వారు. నాకు ఎంతో ముచ్చటేసింది. ఆ తరువాత కాకినాడ విరసం యూనిట్ కన్వీనర్‌గా పనిచేసిన రోజుల్లోనే విప్లవ రచయితల అరెస్టులకు నిరసనగా కాకినాడ విరసం యూనిట్ తరపున వెలువరించిన 'కుట్ర..కుట్ర..కుట్ర' బులెటిన్(1974)నూ, అందులోని 'విప్లవ రచయితల సంఘం' శీర్షికతో రాసిన నా పెద్ద కవితను విశాఖపట్నంలో జరిగిన అరెస్టుల నిరసన సభకి వెళ్లినప్పుడు

చలసాని చూపిస్తే మెచ్చుకోవడం- నా జీవితంలో శ్రీశ్రీ తాలూకు ఎరుపు గుర్తులు.

■ ***ఈనాటి తరం శ్రీశ్రీని చదువుతున్నారా ?***

■ శ్రీశ్రీ తరువాత ఏ తరమైనా సాహిత్యాన్ని చదివే వారు, రాసేవారు- శ్రీశ్రీని చదవని వారు ఉండరు.

■ ***శ్రీశ్రీకి అభిమానులెంతమంది ఉంటారు?***

■ శ్రీశ్రీకి అభిమానులు లేరు అంతా వీరాభిమానులే ?

■ ***మీరు ప్రారంభించిన 'శ్రీశ్రీ సాహిత్యనిధి' కాన్సెప్ట్ గురించి వివరించండి?***

■ శ్రీశ్రీ భావాల సాగు శ్రీశ్రీ అభిమాని విధి - శ్రీశ్రీ భావాల పోగు శ్రీశ్రీ సాహిత్యనిధి.

మహాకవి శ్రీశ్రీని భావితరాలకు చెక్కుచెదరకుండా అందజెయ్యడం కోసం శ్రీశ్రీ రాసిందీ, చెప్పిందీ, శ్రీశ్రీ మీద రాసిందీ, చెప్పిందీ పొల్లుపోకుండా నిక్షిప్తం చెయ్యడమే ధ్యేయంగా శ్రీశ్రీ సాహిత్యనిధి ఏర్పాటయింది.

ఇందుకు కొంత నేపథ్యం ఉంది. శ్రీశ్రీ సాహిత్యనిధి శతజయంతికి మూడు సంవత్సరాల ముందే ప్రారంభించినా శతజయంతి కోసం ఏర్పాటయింది కాదు. శ్రీశ్రీ సాహిత్యం, శ్రీశ్రీపై సాహిత్యం ఏమైనా రాయాలి, ఏమైనా చేయాలి, అని ఎప్పటినుండో ఉన్న అలోచన కొత్త శతాబ్దిలో ఆచరణలోకి తీసుకురావాలి అనుకుంటున్న మాకు శ్రీశ్రీ ఇరవయ్యో వర్ధంతికి 2003లో పునర్మూల్యాంకనం పేరున శ్రీశ్రీసాహిత్యంపై జరిగిన అసత్య అసాహిత్య దాడి మమ్మల్ని త్వరిత పరచింది. అది కచ్చితంగా గురజాడని, శ్రీశ్రీని అడ్డంపెట్టుకుని మార్క్సిజంపై జరిగిన దాడి. కొత్త తరాన్ని పక్కదారి పట్టించే దాడి.

ఇదీ శ్రీశ్రీ సాహిత్యం. ఇదీ సమస్తాన్నీ చైతన్య పరచిన చారిత్రక సత్యం అంటూ శ్రీశ్రీ రాసిందీ, చెప్పిందీ- శ్రీశ్రీపై రాసిందీ, చెప్పిందీ సాహిత్యాన్ని విపులంగా కొత్త తరానికి అందించడంలోని అవసరం కనిపించింది. అందుకు అసమాన శ్రీశ్రీ సాహిత్యచైతన్యమే సమర్థవంతమైన ఆయుధం అనిపించింది. సాహిత్య పఠనం సన్నగిల్లిన నేటి యువతరానికి ఎలా అందించాలనే మధనంలోంచి వెలిగిన ఆలోచన "శ్రీశ్రీక్విజ్'. ఈ తరానికి దగ్గర కావడానికి సరైందిగా అనిపించింది క్విజ్ రూపంలో శ్రీశ్రీ గురించి, శ్రీశ్రీ సాహిత్యం గురించి చెప్పడం ప్రారంభించాం. కొత్త శతాబ్దిలోని శ్రీశ్రీపై ఆలోచన అలా 2003లో ఆచరణకొచ్చింది. తరువాత 2005లో మిత్రుడు నండూరి రాజగోపాల్ చినుకు మాసపత్రిక ప్రారంభించి 'శ్రీశ్రీక్విజ్'ను స్వీకరించి తొలి సంచిక నుంచీ ధారావాహికంగా అచ్చువేశాడు. క్విజ్ అంటే నాలుగు ఆప్షన్స్‌తో కూడిన ప్రశ్న సమాధానాలుగా కాకుండా, ప్రతి సరైన సమాధానానికి నోట్స్ యిస్తూ చేసిన రూపకల్పనకు మంచి స్పందన లభించింది. విస్తృత విషయసేకరణకు అభినందించారు. చాలా ప్రయోజనం అన్నారు. తెలుగు సాహిత్య క్విజ్ చరిత్రలో మంచి ప్రయోగమన్నారు. ఎప్పటికప్పుడు ఆ స్పందనలు పాఠకుల పేజీలో రికార్డు అయ్యాయి.

ఓ శీర్షిక ఎల్లకాలం ఒక పత్రికలో కొనసాగడం వీలుకాదు కదా ! అందుకు ఓ సంస్థను ప్రారంభించి 'శ్రీశ్రీ క్విజ్' ప్రాధాన్యతతో ఒక త్రైమాస బులెటిన్ ఆలోచనకు ఆచరణే, బులెటిన్‌గా 'శ్రీశ్రీ బులెటిన్'. ఆ బులెటిన్‌తో పాటూ శ్రీశ్రీ సాహిత్యాన్నీ, శ్రీశ్రీపై సాహిత్యాన్నీ ప్రచురించి, ప్రచారంచేసే సంస్థగా శ్రీశ్రీ సాహిత్యనిధి. 2007లో ఏర్పడింది. ఏప్రిల్30న మొదటి శ్రీశ్రీ బులెటిన్ వెలువడింది. మహాకవి శ్రీశ్రీ సభామందిరంలో ఆవిష్కరణ జరిగింది. శ్రీశ్రీ సాహిత్యనిధి సారథిగా నేనున్నా తెలుగునాట వామపక్ష భావజాల సాహితీ సంస్థలు విరసం, అరసం, జనసాహితి, సాహితీ స్రవంతి నాలుగు దిక్కులై సహకారం అందించాయి. అందిస్తున్నాయి.

కొండంత అండగా శ్రీశ్రీ ప్రింటర్స్ విశ్వేశ్వరరావు, అడిగిన వెంటనే ఎంతో సమాచారాన్నిచ్చిన చలసానిప్రసాద్, అడక్కుండానే ఎంతో సమాచారాన్ని అందించే కొత్తపల్లి రవిబాబు, తను తిరిగే ప్రతి సాహిత్యసభకు శ్రీశ్రీ ప్రచురణల పుస్తకాలను అందించే దివికుమార్, నూరు పుస్తకాల హోరు ప్రణాళికలో నూరుగురు సభ్యులను నమోదుచేయించిన, ఇంకా చేయిస్తూనేవున్న ఎక్స్‌రే కొల్లూరి, ప్రచురణలో అత్యంత కీలకమైన పుస్తకాల ప్రూఫ్‌రీడింగ్‌లో నిష్ణాతులు మిత్రులు సమతాకోటేశ్వరరావు,అభ్యుదయ కవి అదృష్టదీపక్, ఇటీవలే ఆన్‌లైన్‌లో ప్రూఫ్‌రీడింగు సహకారం అందిస్తున్న చిరకాలమిత్రులు జర్నలిస్ట్‌కె.వి.యస్.వర్మ, విప్లవకవి నందనోదయ ఇచ్చే సహకారం ధన్యవాదాలతో తీర్చుకోలేనిది.

శ్రీశ్రీ సాహిత్యనిధి కార్యక్రమాలకు సంబంధించి

ముఖ్యమైనవి రెండు- మొదటిది మరో ప్రపంచకవి, మహాకవి శ్రీశ్రీ విషయాలూ, విశేషాలూ తెలియజేస్తూ మూడు నెలలకోసారి అనంతంగా ఓ బులెటిన్ వెలువరించడం. రెండోది శ్రీశ్రీ సాహిత్యాన్ని ప్రచారం చేస్తూనే శ్రీశ్రీపై వెలువడిన సాహిత్యాన్ని గ్రంథస్థం చేస్తూ ఉండటం,మొదటిది శ్రీశ్రీ బులెటిన్‌ద్వారా అయితే, రెండోది శ్రీశ్రీ సాహిత్యనిధి ప్రచురణల ద్వారా.

1. శ్రీశ్రీ బులెటిన్( త్రైమాసిక) రు. 100 రూపాయల చందాకు జీవితకాలం ఉచితంగా పంపడం. 2. శ్రీశ్రీ సాహిత్యం శ్రీశ్రీపై సాహిత్యం 'నూరు పుస్తకాలహోరు ప్రణాళిక'లో రు.1000/-లకు రు.ఐదు వేలరూపాయల విలువైన నూరుపుస్తకాలు విడతలుగా అదించడం.

■ ***నూరు పుస్తకాల హోరు ప్రణాళికలో ఇప్పటికి ఎన్ని పుస్తకాలు వెలువరించారు?***

■ 84 పుస్తకాలు వెలుద్దాయి. నాలుగు ప్రింటింగులో ఉన్నాయి.

■ ***ఈ పుస్తకాల ముద్రణ ఖర్చులకు వనరులు ?***

■ కొంత శ్రీశ్రీ అభిమానులు ఆర్థిక సహకారం ఉంది.

■ ***మరి మిగిలింది ఎలా ?***

■ ఓ ప్రణాళికా బద్ధంగా సంపాదించడమే ?

■ ***అంటే ఎలాగో చెబుతారా?***

■ అంటే ఏముంది. పనిచేస్తూ సంపాదించడం. అందుకే రిటైర్‌మెంట్ వయసయినా పనిచెయ్యడం. శ్రీశ్రీ కోసం పనిచెయ్యడం, శ్రీశ్రీ పని చెయ్యడం నాకు గౌరవం,గర్వం. అంతకు మించి ఎంతో తృప్తి.

■ ***2020 అంటే శ్రీశ్రీ 110వ జయంతికి 100 పుస్తకాలు పూర్తవుతాయన్న మాట.***

■2019 ఏప్రియల్‌కే పూర్తి చేయాలని ప్రయత్నిస్తున్నాం.

■ ఆ తరువాత

■ మరో కార్యక్రమం.

■ ***శ్రీశ్రీ బతికుంటే శ్రీశ్రీ సాహిత్యనిధి ద్వారా జరుతున్న కార్యక్రమాలకి ఎలా స్పందించే వాడంటారు?***

■ అసలు చనిపోతే కదా ?

శ్రీశ్రీ తన కాయంపై ఎర్ర జెండా కప్పుకుని భౌతికంగా మనకు దూరమయ్యాడు-అంతే...

***'దేశంపై ఎర్రజెండా మెరిస్తే - ఆ పోరు గడ్డకు చావులేదని'***

***దేహంపై ఎర్రజెండా పరిస్తే - ఆ వీరబిడ్డడు చావలేదని'.***

***వీర బిడ్డడు శ్రీశ్రీ చావలేదు- వీర బిడ్డడు శ్రీశ్రీకి చావులేదు !***

■ **ఇది వ్యక్తి పూజ కాదా? ఇంత వ్యక్తిపూజ అవసరమా?**

■ శ్రీశ్రీ మాటల్లోనే చెప్పాలంటే - వ్యక్తి పూజను మనం ఎంతగా నిరసించినా వీరపూజను మాత్రం మానలేం. శ్రీశ్రీ వీరాధి వీర కలం యోధుడు. అతని సంస్మరణ మనకు అవశ్యం అగత్యం.

తెలుగునాట ఏ కవికీ జరపనంత ఘనంగా గర్వంగా ప్రపంచ తెలుగు ప్రజలు మహాకవి శ్రీశ్రీ శతజయంతి ఉత్సవాలు జరుపుకున్నారు. ఎందుకని? తెలుగు సాహిత్య చరిత్ర గమనాన్ని తీర్చిదిద్దిన మహావ్యక్తి శ్రీశ్రీ కనుక. అంతకు మించిన మహాశక్తి శ్రీశ్రీ కవిత్వం గనుక. అది తెలుగు సాహిత్యంలో ఎగరేసిన ఎర్రజెండా కనుక. అది సామ్యవాద మరో ప్రపంచానికి తిరుగులేని ఎజెండా కనుక. అంతే తప్ప ప్రజలు పిచ్చివాళ్లు కాదు. ప్రజలు చరిత్ర నిర్మాతలు. చైతన్య ప్రదాతలు.

మనిషి అన్నవాడికి బలహీనతలు సహజం. అలాగే శ్రీశ్రీకి కూడా. బలహీనతల్ని ఎత్తిచూపి శ్రీశ్రీమూర్తిని ఆక్షేపిస్తే అభిమానులైనా ఆలోచించేవాళ్లుంటారు. కాని శ్రీశ్రీ కవితా స్ఫూర్తిని ఆక్షేపిస్తే మాత్రం ఉపేక్షించేవాళ్లుండరు. ఎందుకంటే శ్రీశ్రీ అభిమానులు శ్రీశ్రీ భజనపరులు కారు. శ్రీశ్రీ భావ సృజనర్ఘురులు. శ్రీశ్రీ కవిత్వంతో వెలిగిన వాళ్లు. రేపును వెలిగించడం కోసం నేడు రగులుతున్న వాళ్లు.

నిన్న స్వాతంత్ర్యం కోసం- పిడికిట పట్టిన నిప్పు దండి యాత్ర ! నేడు సామ్యవాద మరోప్రపంచం కోసం- పిడికిట పుట్టిన నిప్పు పదండి యాత్ర ! శ్రీశ్రీ కవిత్వం. మన పిడికిట పుట్టిన నిప్పు. అది భవిష్యత్తుకు భరోసా. పిడికిలి బిగిస్తే పంచభూతాలు ఏకం అంటుంది! అప్పుడు శ్రమించేవాడిదే లోకం అంటుంది! ఎలాంటి వ్యవస్థ ధ్వంసం కావాలో చెబుతుంది. ఎలాంటి వ్యవస్థ నిర్మాణం చేయాలో చెబుతుంది.

ఇది మలిన ప్రపంచానికి పాతరవేస్తూ మరో ప్రపంచానికి జాతరచేస్తూ సాగే పదండియాత్ర.

***మరో ప్రపంచం మరోప్రపంచం పిలిచింది !***

***పదండి ముందుకు పదండి త్రోసుకు పోదాం పోదాం పైపైకి !***

◆

# ఆడపిల్ల

ఈతకోట సుబ్బారావు
9440529785




ముక్కనుమ దాటి మూడోరోజు. సరిగ్గా స్కూళ్లకి సెలవులు ముగిసి తిరిగి ప్రారంభమౌతున్న రోజు. గంగ, గోమతి స్నానాలు గట్రా పూర్తి చేసుకొని రెడీ అయిపోయారు. గోమతి స్కూలుకి, గంగ వెటర్నరీ హాస్పిటల్‌కీను. ముక్కనుమనాడు గంగను చెరువుకి తీసుకెళ్ళి ఎండుగడ్డితో వళ్లంతా తోమి ప్రత్యేకంగా అలంకరించాడు హనుమంతప్ప. దీపోత్సవంలో గంగ అలంకారం చూసి ముచ్చట పడని వాళ్ళు లేరు. కాని ఈ రోజు మాత్రం సర్ఫ్‌నీళ్లతో శుభ్రంగా స్నానం చేయించాడు. గుమ్మం ముందు గంగను నిల్చోపెట్టి ఓసారి పరిశీలనగా చూశాడు. గంగ పరిశుభ్రంగా గంగానదిలా ఎంతో దివ్యంగా కనిపించింది. పైతుండు అందుకొని కళ్లపైన కుంకుమ పొడిని వాటంగా తుడిచేశాడు. యముని మహిషపు పట్ట మహిషిలా వుంది గంగ యిప్పుడు.

"ఏంటి పెదనాన్నా! గంగను పెళ్ళికూతురు చేశావు. సంతకు తీసుకెళ్తున్నావేంటి?'' స్కూలు బ్యాగ్ భుజానికేసుకుంటూ అడిగింది గోమతి.

"సంతకి కాదురా, కన్నతల్లీ! ఆస్పత్రికి తీసుకెళ్తున్నాను" యథాలాపంగా అన్నా మనసెక్కడో చివుక్కుమంది.

నిన్నటేడాదే పెద్దమనిషైంది గోమతి. చెప్పకూడనిది చెప్పాడేమో అనిపించక పోలేదు. కాని ఈ కాలం పిల్లలకి అన్నీ తెలిసి పోతున్నాయి. ఈ మధ్య స్కూళ్లలో కూడా పిల్లలు ఎదగటానికి ముందే అన్ని విషయాలు సమగ్రంగా బోధించాలనే రచ్చ కూడా కొనసాగింది చాన్నాళ్ళు.

"ఏం – నిన్నటిదాకా పాలు బాగానే యిచ్చిందిగా" గోమతి సందేహం.

"పాలకోసం కాదులేరా! నువ్వు స్కూలుకెళ్ళు" వీలైనంత క్లుప్తంగా సమాధానం యిచ్చాడు హనుమంతప్ప. గోమతి తలపైన చెయ్యేసి సాదుతూ "ఇంకెన్ని సార్లు తల్లివౌతావమ్మా తల్లీ! ఇప్పటికిది నాలుగోసారి. ఏంటో, మీకు మాత్రం కుటుంబ నియంత్రణ వర్తించదు" అంటూ వెళ్ళిపోయింది.

కూతురు వెళ్లిపోయిన చాలాసేపటి తర్వాతకాని బోధపడలేదు హనుమంతప్పకి. ఆరిందాలా మాట్లాడి

వెళ్ళిపోతున్న గోమతి వైపు అలాగే చూస్తూ వుండిపోయాడు చాలాసేపు.

గోమతి తమ తమ్ముడి కూతురు. తనకు పెళ్లై పద్నాలుగేళ్లు దాటినా సంతాన యోగం కలగలేదు. పిల్లల్ని గురించి ఆలోచించటం మానేశాక తల్లి దీర్ఘాలు తీయటం ప్రారంభించింది. ఎలాగూ లక్ష్మికి తల్లయ్యే అదృష్టం లేదు కాబట్టి కొడుక్కి మరో పెళ్లి చేయాలని నిశ్చయించుకుంది. పిల్లలు పుట్టక పోయినా లక్ష్మికి సవితిని తేవాలనే వూహనే తట్టుకోలేక పోయాడు హనుమంతప్ప. వెంటనే తమ్ముడి కూతురు గోమతిని ఆర్నెల్ల పసిపాపగా వున్నప్పుడు తీసుకొచ్చి లక్ష్మి వళ్లో వేశాడు. తల్లి రామదేవమ్మ అయిష్టంగా అయినా ఆ చర్యని అంగీకరించక తప్పలేదు. గోమతి చురుకుదనం, నిత్యం నవ్వుతూ ఉండే తత్వం రామదేవమ్మనీ అలరించింది. సొంత మనవరాలు, పైగా వొకేరక్తం పంచుకున్న అన్నదమ్ముల బిడ్డ కావడం కూడా వొక కారణం కావచ్చు. ప్రాణం కన్న మిన్నగా చూసుకుంటుంది గోమతిని.

ఎవరి పోలిక వచ్చిందో తెలియదు కాని గోమతి లక్ష్మిని 'అమ్మా'! అంటుంది. హనుమంతప్పని మాత్రం పెదనాన్నా అనే పిలిస్తుంది. స్కూలు నుండి తిరిగొచ్చిన అరగంట లోపల అమ్మ కనిపించకపోతే యిల్లు పీకి పందిరేస్తుంది. అమ్మకేమయిందో అన్న ఆందోళన. రామదేవమ్మ సర్దిచెప్పబోతే తోక తొక్కిన తాచులా రయ్యిన ఎదురు తిరిగి 'ముసల్దానా! నోరు కుట్టేసుకో. నీ కాకమ్మ కబుర్లు కట్టిపెట్టి, అమ్మ ఎక్కడికెళ్లిందో చెప్పు" అంటూ నిలదీస్తుంది. నానమ్మకి గోమతి గోమతి కోపమన్నా ప్రేమే. ఎంతో ముచ్చటపడి పోతుంది. ఆ చిందుల్ని చూసస్తూ ఇంట్లో లేగదూడ చేసే అల్లరిని తలచుకుంటుంది.

"అమ్మా! ఓ సారి గంగకి ఎదురు రావే..." అన్నాడు హనుమంతప్ప బైల్దేరబోతూ.

'మొగుడు సచ్చిన ముండని. నే నెదుర్రావటం దేనికి? నీ పెళ్లాన్ని పిలు..." రామదేవమ్మ అంటానికి అన్నదేకాని కోడలు గొడ్రాలన్న విషయం చటుక్కున గుర్తుకొచ్చి తనే లేచి నిలుచుంది.

"మొగుడు సచ్చినా ముగ్గురు పిల్లల తల్లివి నువ్వు. ఇలాంటప్పుడు నీలాంటోళ్లే ఎదుర్రావాలి" సమర్ధించుకొచ్చాడు హనుమంతప్ప.

గంగ రెండో అడుగు వేస్తున్నప్పుడు పరుగు పరుగున గుమ్మం బైటకొచ్చి భళ్లున వాంతి చేసుకుంది లక్ష్మి. హైరానా పడ్డాడు హనుమంతప్ప. ఆశ్చర్యంగా కోడలివైపు చూసింది రామదేవమ్మ. నెమ్మదిగా లక్ష్మి చెవులు మూస్తూ.. "ఏంటే కోడలు పిల్లా! ఎన్నో నెల?" అంటూ వాకబు చేసింది.

సిగ్గు పడుతూ మూడు వేళ్ళని చూపింది లక్ష్మి. అప్పటికి ఆవిడ వాంతి కూడా ఆగిపోయింది.

"సరే, నువ్వెళ్లరా పెద్దోడా! ముందు గంగకి ఇంజిక్షణ్లు వేయించి తీసుకురా. సాయంత్రం కోడల్ని డాక్టరి దగ్గరకి తీసుకెళ్లొచ్చు". మాటలో, స్వరంలో అధికారం ధ్వనించింది. తల్లివైపు గమనింపుగా చూస్తూ గంగని ముందుకు అదిలించాడు.

ఆ క్షణంలో హనుమంతప్ప మొహం జేవురించింది. పద్నాలుగేళ్ళ తర్వాత, వొక దీర్ఘకాల నిరీక్షణ ఫలించి లక్ష్మి తల్లికాబోతుంటే రామదేవమ్మలో ఏ కోశానా ఆనందపు ఛాయ కనిపించలేదు. నామమాత్రంగా నైనా ముఖంలో చిరునవ్వు చోటుచేసుకోలేదు. తండ్రే గనక బతికి వున్నట్టయితే ఈ పాటికి వీధి వీధంతా ఎంత ఆనందంగా గంతులేస్తూ తిరిగేవాడో! కనిపించిన ప్రతి వొక్కరి చెవిలో ఈ వార్త వేసి, ఎంత హంగామా సృష్టించేవాడో! దురదృష్టం ఇప్పుడాయన లేడు.

అందుకే వరమిచ్చిన దేవుడికి థ్యాంక్స్ చెపుతున్నట్టుగా ఓసారి ఆకాశం కేసి చూసి, ముందుకు కదిలాడు.

"రేయ్ పెద్దోడా! బెంగ్లూరు నుండి ఇంజిక్షన్ తెప్పించావా గంగకోసం?" అంటూ ముంగిట్లో నిలబడి కేక పెట్టి అడిగింది రామదేవమ్మ.

"ఆ... ఆ.... వచ్చేసిందొచ్చేసింది. అందుకే కదా, యివాళ తీసుకెళ్తున్నా!" తల వెనక్కి తిప్పి చెప్పినపుడు గమనించాడు... లక్ష్మి మళ్లీ వాంతి చేసుకుంటుంది. కొడుకు వెనక్కి వస్తాడేమో అన్న అనుమానం కొద్ది రామదేవమ్మ వెళ్ళమన్నట్టు సైగ చేసింది. తిరిగి తిరిగి చూస్తూ గంగతో పాటు కదిలాడు హనుమంతప్ప.

ప్రతి తడవా గంగ ఎదకొచ్చినప్పుడల్లా బెంగుళూరు నుండి గేద దూడ పుట్టడం కోసం పదిహేను వందలు పెట్టి స్పెర్మ్ యింజక్షన్ తెప్పిస్తుంటాడు హనుమంతప్ప. గత మూడు ఎదలకు అలాగే జరిగింది. గేదె దూడలే పెట్టాయి. అవీ యిప్పుడు పాలిస్తున్నాయి. పాడి మీద బతికేవాళ్లకి దున్నలు పుడితే కలిసిరావటం కష్టం. కాబట్టే తన గేదెలు ఎప్పుడు

ఎదకొచ్చినా స్పెర్మ్ యింజెక్షన్లు తెప్పిస్తుంటాడు. ప్రస్తుతం యింట్లో వొకటికి పన్నెండు గేదెలున్నాయంటే కారణం అదే.

♦♦♦

దేవుడు వరమిచ్చినా వొక్కోమారు పూజారి కరుణ లభించటం గగనం - అనటానికి ప్రత్యక్ష ఉదాహరణగా మారిపోయింది హనుమంతప్ప పరిస్థితి. గొడ్డు చెట్టు పైన వసంతం ప్రవహించి ఓ కాయ కాపు కొస్తే, ఇంటికి పెద్దదిక్కైన కన్నతల్లే దాన్ని అర్ధాంతరంగా కోసేయ మంటోంది.

అటు భార్యను అనునయించలేక, ఇటు తల్లి మాటని కాదనలేక అడ్డకత్తెరలో పోకచెక్కై పోయాడు హనుమంతప్ప.

అసలు గొడవ ప్రారంభమైంది లక్ష్మిని డాక్టరమ్మ దగ్గరికి తీసుకెళ్ళిన క్షణాన్నుంచే. తీసుకెళ్ళక పోయినా బావుణ్ణు. కాని ఆత్రుత హనుమంతప్పని క్షణం ఆగనీలేదు. ఆ డాక్టరమ్మకి సంబంధించిన ల్యాబ్‌లోనే శంకరప్ప టెక్నీషియన్‌గా పనిచేస్తున్నాడు.

ఇప్పుడు నాలుగు మాసాల కడుపు తీయించేయమంటుంది రామదేవమ్మ. ఆడపిల్ల తనకు అక్కర్లేదని పంతం పట్టుక్కూచుంది.

ఎంతసేపూ తన మాటేకాని లక్ష్మి వైపు నుంచి క్షణం ఆలోచించదు. సరిగ్గా తనకి పదిహేనేళ్ల వయసులో ఇంటికి కోడలిగా వచ్చింది లక్ష్మి. ఆ రోజు లగాయితు ఈ క్షణం వరకూ అత్తగారి మాటకు ఎదురు చెప్పింది లేదు. ఏనాడైనా తనకిది కావాలని అడిగిందీ లేదు. నలభై మూడేళ్ళ వయసులో తల్లి కాబోతున్నా ఆ కోరికా తీరేటట్టు లేదిప్పుడు.

"వరే చిన్నాడా! నువ్వేం చేస్తావో, ఏ మాత్తర్లు యిస్తావో నాకనవసరం. వచ్చే ఆదివారానికంతా అంతా శుభ్రంగా ముగిసిపోవాల" కరాకండిగా రామదేవమ్మ చెప్తుంటే పాలల్లో తోడుపెడుతున్న లక్ష్మి కళ్లలోంచి నాలుగు చుక్కలు కూడా పాలగిన్నెలో వొలికిపోయాయి.

"అదేమంత పెద్ద విషయం కాదు. కాని వొప్పుకోవలసిన వాళ్ళు వొప్పుకోవాలి కదా" అన్నవైపు చూస్తూ ఆయన అంగీకారమే మిగిలిపోయిందన్నట్టుగా అన్నాడు శంకరప్ప.

హనుమంతప్ప కళ్లు లక్ష్మిపైనే వున్నాయి. ఆమె పాలలో తోడు వేయటం, దాంతో పాటు నాలుగు కన్నీటి చుక్కలూ తోడుకు తోడు కలవటమూ నిశితంగా గమనిస్తూనే వున్నాడు.

"ఏరా పెద్దోడా! నువ్వే మంటావు' అవునా? కాదా?"

రామదేవమ్మ గొంతులో వేయి పిడుగులు వొక్కసారిగా పురుముతున్నట్టనిపించింది హనుమంతప్పకు. మౌనంగా తల్లికేసి చూస్తు వుండిపోయాడు.

వాస్తవానికి సమస్య తనదికాదు. అత్తా కోడళ్ల పరిధిలోనిది. అత్తకి కోడలంటే లెక్కలేదు.

"ఏరా అవునా? కాదా?" తల్లి స్వరం మరింత పెంచి అడిగింది. ఆ స్వరానికి యిల్లంత మారుమోగిపోయింది. ఆ అరుపుకా అన్నట్టు గోమతి లోపలిగదిలోంచి యివతలికి వచ్చింది.

"ఏంటీ మహాసభ....?" ఆమె ప్రశ్న విని ముందుగా శంకరప్ప వులికి పడ్డాడు. తర్వాత రామదేవమ్మ చురచురా చూస్తూ "పిల్ల పిచ్చుకవి. పెద్ద విషయాలు నీకెందుకు? వెళ్లి బుద్ధిగా చదువుకో పో" అనటం. గోమతికి పౌరుషం ముక్కు మీదికి ఎగబాకటం వొక్కసారిగా జరిగిపోయాయి.

"పెద్ద విషయాలంటే ఏంటే ముసిలీ! వయసులో పెద్ద చిన్న చిన్న విషయాలు, చిల్లర విషయాలు మాట్లాడితే అవి పెద్ద విషయాలైపోతాయా? అమ్మ కడుపుతో వుంది. పెదనాన్నకి తండ్రిని కావాలన్న కోరిక తీరకుండా నీవు, శంకరం నాన్నా అడ్డు పడుతున్నారు. అంతేనా?" వాళ్ల మధ్యలోకి నడుస్తూ "అంతే లేదు. ఇంతే లేదు. ముందు నువ్విక్కణ్ణుంచి వెళతావా? లేదా?" మీది మీదికి వచ్చేసింది రామదేవమ్మ.

వాళ్ళ నలుగురి మధ్యలో చక్కు ముక్కులేసుకుని కూచుంటూ "వెళ్లను. ఏం? నన్నుకూడా అమ్మ కడుపులో పెరుగుతున్న ఆడపిల్లని చంపేయాలనుకున్నట్టు ఏ మందో మాకో శంకరం నాన్నతో పెట్టించి చంపేస్తావా? నేను రెడీ. చంపెయ్" అంది గోమతి.

రామదేవమ్మ స్థాణువైపోయింది. ఆమాట విన్నాక శంకరం ముఖంలో కవళికలన్నీ మారిపోయాయి. లక్ష్మి పరుగులాంటి నడకతో వచ్చి గోమతిని ఆమాంతం కౌగలించుకుంది.

చాలా సేపటికి కాని తేరుకోలేక పోయింది రామదేవమ్మ. శంకరంతో అంది - "చూశావారా! నిన్నగాక మొన్న పుట్టిన పేగు ముక్క ఎన్నెన్ని మాటల మూటలు నేర్చిందో! దీన్ని కడుపులో పెట్టుకొని పెంచానురా. దీని బుద్ధి పెరగాలని అప్పుడే పితికిన పాలల్లోంచి తీసిన తెరపివెన్నముద్దలు తినిపించాను. ఇన్నిన్ని మాటలు నేరుస్తుందని అనుకోలేదు".

"అది యింకా చిన్నపిల్ల. దానికేం తెలుసు మన బాధలు.

# నేనేదొకటి రాస్తాను

- బంగార్రాజు కంఠ
8500350464.



పరిపక్వతలేని మనిషి గురించో
పండిపోయిన పాత మనిషి గురించో
రాస్తాను..., నేనేదొకటి రాస్తాను

మహిళావేదికల మీద
ఆడాళ్ళ గొప్పతనాన్ని
అమోఘంగా శ్లాఘిస్తూ
బతుకు ఆవరణలో
ఒంటికాలిపై నిలబెట్టే అసలు నైజం
నిగ్గుతేలేందుకు ఏదొకటి రాస్తాను

బాలలు భావిదూతలు అంటూనే
ఫ్యాక్టరీ గొట్టాల గోడలకు దిగేసిన
కొత్తమేకుల్లా
కార్మికచట్టాల ఊసెరగని
లేత బానిసత్వం గురించి రాస్తాను
రాజనీతి పవిత్రతను అపహాస్యం చేస్తూ
కుటిల కోణాలమాటు రాజకీయం
నగ్నభావజాల పునీతానికి
నేనేదొకటి రాస్తాను

జాతి సంపద గాలికొదిలి
పలాయన లేపనం పూసుకుని
రాచదుస్తులు ధరించి తిరిగే
దిశదేహాల నఖశిఖాలకు నగిషీలు పెడుతూ
కడుపుమంటకు కాసిన్ని బియ్యం
దొంగిలించిన కడజాతివాణ్ణి
కాల్చి చంపుతున్న
జాతిమూలాల గురించి రాస్తాను

నెర్రలు పడిన బడుగుల
దేహాస్థిపంజరాల ఊపిరిమాట
దుఃఖిత రాగమైనప్పుడు
బాధల గీతాక్షరాలకు
కొత్త రంగులద్దుతూ రాస్తాను

అక్షరానికి భావాల భాస్వరం దట్టించి
పుంఖాను పుంఖాలుగా సమాజంపై సంధిస్తాను
మార్పు వచ్చేదాక నేనేదొకటి రాస్తూనే
వుంటాను.

◆

దాని మాటలు పట్టించుకోకు" శంకరప్ప మాటలకి అడ్డొస్తూ... "శంకరం నాన్నా! నిజమే. నేను చిన్నపిల్లనే. కాని ఆడపిల్లని. ఆడ పిల్లకి పుట్టే హక్కులేనప్పుడు. నాన్నమ్మకీ పుట్టే హక్కులేదు. అమ్మకీ పుట్టే హక్కులేదు. నాక్కూడ లేదు" అంటూ మూడు చిన్నపాటి సీసాలు ముందు పెట్టింది.

హనుమంతప్పకి అనుమానం వచ్చింది "అమ్మా! ఏవిట్రా అవి?" అని అడిగాడు

"యాసిడ్ బాటిళ్ళు..." అంది ముక్తసరిగా...

"అవి దేనికమ్మా" హనుమంతప్ప గొంతు వణికింది.

"పుట్టే హక్కులేని వాళ్లు చావటానికి. మీకు అంతా వ్యాపారమే. పాలకి బర్రెలే కావాలి. కాయలు కాసే చెట్టే కావాలి. గుడ్లు పెట్టే కోళ్లే కావాలి. అవన్నీ నేను, నాన్నమ్మ అమ్మ చేయలేం. అందుకే ఏయ్! ముసిలీ! రా. తాగేద్దాం" అంటూ ఓ బాటిల్ మూత తీసింది.

హనుమంతప్ప అదాటున కూతుర్ని కౌగలించేసుకున్నాడు. "అమ్మా! అంతపని చేయొద్దురా, గోమతీ!" అంటూ పెనుగులాడి బాటిల్‌ని దూరంగా విసిరికొట్టాడు. లక్ష్మి కూడా ఏడుస్తూ వచ్చి "నువ్వు లేకుంటే నాకు ఈ బతుకొద్దురా" అంది బిడ్డని బాహువుల్లో పొదువుకుంటూ.

రామదేవమ్మ, శంకరప్ప మంచు శిల్పాలైపోయారు. ఇద్దరి మనసుల్లో వొకే ప్రశ్న - "పుట్టాల్సిన ఆడపిల్లల్ని చంపేస్తున్నాం. అంతకు ముందే పుట్టిన ఆడపిల్లల్ని ఏం చేయాలి? అని.

◆

## అనంతపురంలో తరుణీ తరంగాలు



అనంతపురం జిల్లా సాహితీస్రవంతి, ఎ.ఎమ్.ఎన్. మహిళా కళాశాల భాషా విభాగం సంయుక్త ఆధ్వర్యంలో కళాశాల ప్రాంగణంలో మార్చి 24న ఆరుగురు మహిళా రచయిత్రుల పుస్తకాలపై సమీక్షా సదస్సు జరిగింది. వర్తమాన సాహితీ తరంగాలు పేరున జరిగిన ఈ కార్యక్రమానికి వై. విజయ బృంద, కటకం కృష్ణవేణి అధ్యక్షత వహించారు. ముఖ్య అతిథిగా వచ్చిన డా॥ దేవకి మహిళా దినోత్సవ సందర్భంగా ఇలాంటి సదస్సు నిర్వహించడం సంతోషకరమన్నారు. జిల్లాలో ప్రజల స్థితిగతులను, సమస్యలను, మానవ సంబంధాలను కథల్లోకి, కవిత్వంలోకి తీసుకురావాలన్నారు. చేలూరి రమాదేవి రాసిన 'స్వేచ్ఛాగానం' నవలను ప్రముఖ రచయిత్రి శశికళ, నిర్మలారాణి రాసిన 'గాజుకళ్ళు' సంపుటిని ప్రముఖ విమర్శకులు అరుణ, జయలక్ష్మీరాజు రాసిన 'అమ్మానాన్న, సుశీల' కథల సంపుటిపై ప్రముఖ విమర్శకురాలు తరళ జ్యోత్స్న సమీక్షించారు. డా॥ దేవకి రాసిన 'మాటల ఒడిలో' కథల సంపుటిని సాహితీ విమర్శకులు హేమమాలిని సమీక్షించారు. 'శేషప్రశ్న' రచయిత షహనాజ్, 'మా తుజే సలాం' రచయిత్రి శశికళ తమ కథలను వివరించారు. సాహితీస్రవంతి జిల్లా ప్రధాన కార్యదర్శి హిదయ్‌తుల్లా, సాహితీస్రవంతి జిల్లా గౌరవాధ్యక్షులు పిల్లా కుమారస్వామి, సాహితీస్రవంతి నగర కార్యదర్శి దాదా ఖలందర్, నగర గౌరవాధ్యక్షులు సూర్యనారాయణ రెడ్డి, కవులు జూటూరి షరీఫ్, రియాజుద్దీన్, ప్రసన్న రావల, కొత్తపల్లి సురేష్, కుంచె లక్ష్మీనారాయణ, అశ్వర్థరెడ్డి తదితరులు పాల్గొన్నారు. ◆

## రచనలకు ఆహ్వానం

విజయవాడకు చెందిన అమరావతి బాలోత్సవ్ సంస్థ, జాషువా సాంస్కృతి వేదిక సంయుక్తంగా రెండు తెలుగు రాష్ట్రాల్లోని రచయితల నుండి రచనలను ఆహ్వానిస్తున్నట్లు ఆ సంస్థల తరపున గుండు నారాయణ ఒక ప్రకటనలో తెలిపారు. రచనల వివరాలు: లఘు నాటికలు (నాలుగు పేజీల్లో, 10 నిమిషాలు మించకుండా), ఏక పాత్రలు (రెండు పేజీల్లో, నాలుగు నిమిషాలు మించకుండా), జానపద గీతాలు (ఒక పల్లవి, నాలుగు చరణాలు), అభ్యుదయ గీతాలు ( ఒక పల్లవి, నాలుగు చరణాలు). ప్రతి విభాగం నుంచి ఉత్తమమైన పది రచనలను ఎంపిక చేసి ఒక్కొక్క రచనకు వెయ్యి రూపాయలు పారితోషకం అందజేయనున్నట్లు తెలిపారు. ఆ రచనలను ముద్రించి ప్రభుత్వ, ప్రైవేట్ స్కూళ్లకూ పంపిణీ చేస్తామని తెలిపారు. తమ రచనలను మే 9వ తేదీ లోపు ఎం.బి. విజ్ఞాన కేంద్రం, జాషువా సాంస్కృతిక వేదిక, ఆకులవారి వీధి, గవర్నరు పేట, విజయవాడ- 520 002 చిరునామాకు లేదా **amaravati.balostavam@gmail.com** కు పంపించవలసిందిగా కోరారు. ఇతర వివరాలకు 9951540671 ద్వారా సంప్రదించవచ్చును. బహుమతి ప్రదానోత్సవం, పుస్తకావిష్కరణ సభ అంతర్జాతీయ బాలల దినోత్సవ రోజు జూన్ 1న విజయవాడలో నిర్వహించనున్నట్లు తెలిపారు. రచనలు చేయవలసిన అంశాలు : 1. పర్యావరణం, 2. బాలికల విద్య 3. మూఢ నమ్మకాలు 4. ఆరోగ్యం, 5. బాల్య వివాహాలు, 6. టీ.వీ., సెల్‌ఫోన్ల ప్రభావం, 7. ఆటలు-మానవ సంబంధాలు, 8. తెలుగుభాష, 9. వినిమయ సంస్కృతి, 10. దేశభక్తి, 11. నేటి విద్యా విధానం, 12. మత సామరస్యం, 13. బాల కార్మికులు, 14. శాస్త్ర విజ్ఞానం, 15.అంటరానితనం. ◆




విజయనగరం సాహితీస్రవంతి నిర్వహించిన ఉగాది జనకవనంలో ప్రసంగిస్తున్న పి.ఎస్. శ్రీనివాస్. చిత్రంలో పాయల మురళీకృష్ణ

## ప్రత్యేక హోదాపై పాలకొల్లులో కవి సమ్మేళనం



పాలకొల్లు సాహితీస్రవంతి, జనవిజ్ఞాన వేదిక సంయుక్త ఆధ్వర్యంలో మార్చి 17న త్యాగరాజ భవనంలో ప్రత్యేక హోదాపై ఉగాది కవి సమ్మేళనం జరిగింది. వులవల శ్రీరామమూర్తి అధ్యక్షతన జరిగిన కవి సమ్మేళనంలో జేవివి జిల్లా గౌరవ అధ్యక్షులు డాక్టర్ కె.ఎస్.పి.ఎన్ వర్మ మాట్లాడారు. విశ్రాంత ప్రిన్సిపాల్ సీ.వి.వి. సత్యనారాయణ మూర్తి, మామిడిశెట్టి శ్రీనివాస్, కేసిహెచ్ పెద్దిరాజు, వీవీఎస్ఎన్ రాజు, ఎం. సుధాకర్ తమ స్వీయకవితలు వినిపించారు. జేవివి జిల్లా ఉపాధ్యక్షులు విజికె గోఖలే, వై. అజయ్‌కుమార్, జె. రామలక్ష్మణ్, వై. ధర్మారావు, జె. జయదుర్గా రావు, వి. నాగేశ్వర రావు తదితరులు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు. ◆

## అనంతపురంలో ఉగాది జనకవనం



అనంతపురం జిల్లా సాహితీస్రవంతి, ఐద్వా సంయుక్త ఆధ్వర్యంలో 'విళంబి ఉగాది జనకవనం' లిటిల్ ఫ్లవర్ స్కూల్‌లో ఉగాది రోజు జరిగింది. డా॥ జూపల్లి ప్రేంచంద్, పి.ఎల్. శ్రీనివాసరెడ్డి ముఖ్య అతిథులుగా ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు. సాహితీస్రవంతి అనంతపురం జిల్లా అధ్యక్షులు కటకం కృష్ణవేణి, ఐద్వా అధ్యక్షులు సావిత్రమ్మలు ఆత్మీయ అతిథులుగా పాల్గొన్నారు. ఈ సందర్భంగా కవులు రామకృష్ణ, ప్రజ్ఞ సురేష్, ఉమర్ ఫరూక్, దాదా ఖలందర్, మిద్దె మురళీకృష్ణ, వలి, రియాజుద్దీన్, రసూల్, షేక్షావలి, రామసుబ్బమ్మ, హరి, చంద్రశేఖర్, కళావతి, రాయుడు, యమున తదితరులు పాల్గొన్నారు. నగరంలో ఉగాది సందర్భంగా అనేక సభలు జరిగినప్పటికీ సాహితీస్రవంతి సభ విజయంతమైంది. సహాయ కార్యదర్శి కిషోర్‌బాబు, నగర ఉపాధ్యక్షుడు అడవి రాముడు, కోశాధికారి షేక్షావలి, గౌరవాధ్యక్షులు సూర్యనారాయణ రెడ్డి తదితరులు పాల్గొన్నారు. ◆

## విజయవాడ రామరాజ్యనగర్‌లో ఉగాది కవి సమ్మేళనం




విజయవాడలోని విద్యాధరపురం రామరాజ్యనగర్‌లో వి.వి. రాజు అల్లూరి సీతారామరాజు స్మారక గ్రంథాలయ ప్రాంగణంలో జరిగిన ఉగాది జనకవనంలో ప్రసంగిస్తున్న మాజీ ఎం.ఎల్.సి. ఎం.వి.ఎస్. శర్మ.

విజయవాడ విద్యాధరపురంలోని రామరాజ్యనగర్‌లో వి.వి.రాజు స్మారక అలూర్లి సీతారామరాజు గ్రంథాలయం, సాహితీస్రవంతి సంయుక్త ఆధ్వర్యంలో ఉగాది రోజు సాయంత్రం ఉగాది ఉత్సవం, కవి సమ్మేళనం జరిగాయి. డా॥ రావెళ్ళ శ్రీనివాసరావు అధ్యక్షతన జరిగిన ఈ సభలో అనిల్ డ్యాని, యామిని కోడె, కట్టా సిద్ధార్థ, కె.ఎక్స్ రాజు, బ్రౌన్ తమ స్వీయ కవితలు వినిపించారు. సాహితీస్రవంతి రాష్ట్ర అధ్యక్షులు వొరప్రసాద్, గ్రంథాలయ కార్యదర్శి అనిల్, బాధ్యులు డా. రాజు, శేషమణి, సాహితీస్రవంతి రాష్ట్ర ప్రధాన కార్యదర్శి కె. సత్యరంజన్, గుండు నారాయణ, శ్రీరాములు, రామరాజ్య నగర్ నివాసులు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు. ◆

## కేంద్ర సాహిత్య అకాడమీ తెలుగు సలహా మండలి

కేంద్ర సాహిత్య అకాడమీ 2018 – 2022 మధ్య ఐదు సంవత్సరాల కాలానికి తెలుగు సలహా మండలిని ప్రకటించింది. కె. శివారెడ్డి (కన్వీనర్), జనరల్ కౌన్సిల్ సభ్యులుగా రాచపాళెం చంద్రశేఖర రెడ్డి, ఎస్.వి.రామారావు, బన్న ఐలయ్య, వాసిరెడ్డి నవీన్. సభ్యులుగా అంపశయ్య నవీన్, అట్టాడ అప్పలనాయుడు, యాకూబ్, శిఖామణి, కొలకలూరి మధుజ్యోతి నియమించబడ్డారు. కన్వీనర్‌గా వున్న కె. శివారెడ్డి కేంద్ర సాహిత్య అకాడమీ ఎక్జిక్యూటివ్ బోర్డు సభ్యులుగా కూడా ఉంటారు. ♦

## విజయవాడలో ప్రగతిశీల ఉగాది ఉత్సవం

సమాజంలో నైతిక విలువలు లోపిస్తున్నాయని ప్రజాశక్తి సిజిఎం, మాజీ ఎమ్మెల్సీ ఎంవిఎస్ శర్మ ఆవేదన వ్యక్తం చేశారు. అశాస్త్రీయ పంచాంగాలు, జాతకాలు, మూఢ నమ్మకాలను ప్రశ్నిస్తూ 17 అభ్యుదయ, ప్రగతిశీల సంఘాల ఆధ్వర్యంలో ఉగాదిరోజు ఉదయం 10 గంటల నుండి 2 గంటల వరకు విజయవాడ ఎంబి విజ్ఞాన కేంద్రంలో జరిగిన ఉగాది ఉత్సవంలో ఆయన ప్రసంగించారు. ఈ సందర్భంగా విద్యార్థులు వేమన పద్యాలను నృత్య రూపకంగా ప్రదర్శించారు. ప్రజా నాట్యమండలి, అరుణో దయ కళాకారులు తమ కళారూపాల ద్వారా మూఢ నమ్మకాలను, ప్రభుత్వ ప్రజావ్యతిరేక విధానాలను ఎండగట్టారు. అనంతరం జరిగిన సభలో శర్మ మాట్లాడుతూ అంతరించిపోతున్న తెలుగు భాషా సంస్కృతిని కాపాడవలసిన బాధ్యత నేటి యువత పై ఉందన్నారు. నాస్తిక కేంద్రం సంచాలకులు జి విజయం మాట్లాడుతూ పెద్దనోట్ల రద్దు, వ్యవసాయ రంగ సంక్షోభాల వల్ల ప్రజలు పండుగలనే మర్చిపోయారన్నారు. ప్రకృతి విధ్వంసమవుతోందని, గ్లోబల్ వార్మింగ్ భూతంలా వెంటాడుతోందని భౌతిక శాస్త్ర అధ్యాపకులు డాక్టర్ తుమ్మల శ్రీకుమార్ ఆందోళన వ్యక్తం చేశారు. భారతీయ ప్రకృతి సంపదైన వేప, పసుపు వంటి ఉత్పత్తులపై సామ్రాజ్యవాద దేశాలు పేటెంట్ పేరుతో పెత్తనం చెలాయిస్తున్నాయని విమర్శించారు. రావెళ్ళ శ్రీనివాస రావు, యామిని కోడె, కోపూరి పుష్పాదేవి, కె.ఎక్స్. రాజు, శాంతిశ్రీ, కట్టా సిద్ధార్థ, బ్రౌన్, తదితరులు స్వీయ కవితలు వినిపించారు. నాస్తిక సమాజం కార్యదర్శి మోతుకూరి అరుణకుమార్, హేతువాద సంఘం అధ్యక్షులు నార్నె వెంకటసుబ్బయ్య, కూరపాటి రామారావు ( ఐఎఫ్‌టియు ), కెఎస్‌సి బోస్ ( ఎంబి విజ్ఞాన కేంద్రం ), కొత్తపల్లి రవిబాబు ( ప్రజాసాహితి ), సింగంపల్లి అశోక్ కుమార్ ( శ్రీశ్రీ సాహిత్య నిధి ), శాంతిశ్రీ ( ప్రజాశక్తి ), బి జమిందార్ ( (ప్రోగ్రసివ్ ఫోరమ్ ) తదితరులు ప్రసంగించారు. ♦

## స్పందన

సాహిత్య ప్రస్థానం తన ప్రస్థానంలో మరో దశలోకి అడుగిడి సరైన దిశగా ప్రయాణిస్తోందనిపిస్తోంది. దీనికి గత మూడు సంచికలే సూచికలు. పుటలు పెరిగి పరిమాణంలోనే కాదు. విలువైన వ్యాసాలతో, ఆలోచింపజేసే కవితలతో ప్రస్థానం సాహిత్య పత్రికలలో తన స్థానం సుస్థిరం చేసుకుంటోంది. సంపాదకులు రవిగారు లేవనెత్తిన 'సాహిత్య రంగంలో సమూహాలు, స్వమోహాలు' చర్చాంశం. టి. సతీష్ స్పందనతో ముందుకు నడిచి సాహిత్యరంగంలో రాజకీయాలు, వ్యక్తి పూజలు, భజనలు, మడికట్టుకు రాయడాలు, సాహిత్య క్విడ్‌ప్రోకోలు, కూటములు మొదలైన వాటిని గూర్చి మొహమాటం లేకుండా మన ముందుంచింది. ఈ అంశాలు ఎప్పటినుండో చాలామంది సాహిత్యాభిమానుల్ని కలవరానికి గురిచేస్తున్నవే అయినా బహిరంగ చర్చకు రాక బహిరంగ రహస్యాలుగానే మిగిలిపోతున్నై. ఈ చర్చ అర్థవంతమైన అవగాహనకు దారి తీసి సాహిత్యకారుల్ని ఆలోచింపజేస్తుందని ఆశిద్దాం.

రచయితగా మరణించానని ప్రకటించిన పెరుమాళ్ మురుగన్ పునరుత్థానం సంతోషించదగ్గ పరిణామం. ఈ విషయాన్ని ప్రకటించిన 'ఇంటర్వ్యూ' మంచి శీర్షిక. ఇలాంటి శీర్షికల వల్ల రచయితల ప్రేరణలు, దృక్పథాలు, వారు ఎదుర్కొన్న ఆటుపోట్లు, వాటిని అధిగమించిన తీరు, వారి జీవన విధానం తెలిసి ఎందరో వర్ధమాన రచయితలకు స్ఫూర్తిగా నిలుస్తుంది. అసహనం, భావస్వేచ్ఛ, కుల దృక్కోణాలపై పెరుమాళ్ మురుగన్ అధ్యయనం ఫలవంతమై కొత్త ఆలోచనలకు తద్వారా నూతన పోరాట రూపాలకు ఊతమిస్తుందని కోరుకుందాం. ఇలానే నెలకో గొప్ప రచయితను మా ముందుకు తీసుకు వస్తారని ఆశిస్తున్నాం.

'ప్రసిద్ధం' శీర్షికను కథానికతో పాటు కవితకు కూడా వర్తింపజేస్తే బాగుంటుంది. సాహిత్య మూలాలను, ఆధారాలను స్పృశించే విమర్శా వ్యాసాలు రావాల్సిన అవసరం వుంది. అంతేకాక సంపాదకీయం సంక్షిప్తంగా కాకుండా మరింత లోతుగా విశ్లేషణాత్మకంగా ఉంటే బాగుండేదనిపించింది.

**- డా॥ కె. శ్రీనివాసులు రెడ్డి, 9493212454**

Printed, Published and owned by **V. Krishnaiah** 1-1-298/4, Street No-1, Ashoknagar, Hyderabad-20,
Printed at Prajashakti Daily Printing Press, 1-1-60/2, M.B. Bhavan, Musheerabad, Hyderabad,
Published at Sahitya Prasthanam 1-1-60/2, M.B. Bhavan, Musheerabad, Hyderabad-20. **Editor T. Ravi**

SHAITYA PRASTHANAM RNI N0.APTEL/ 2004/18396 Postal Regd. No.VJ/187/2017-19
Date of Posting : 02.04.2018 ▪ Date of Publication: 27.03.2018



# ప్రజాశక్తి బుక్‌హౌస్ తాజా ప్రచురణలు




కటికపూలు
పేజీలు 134 రూ.100/-




నేలకొరిగిన కోకిల
పేజీలు 320 రూ.220/-




తెలుగు సినీ దర్శకమాలిక - విజయచిత్రిక
పేజీలు 360 రూ.250/-




సింధూరం
పేజీలు134 రూ.80/-




శ్రీశ్రీ సాహిత్యం ఆర్థిక రాజకీయ దృక్పథం
పేజీలు 160 రూ.120/-




విశ్వనరుడు గుర్రం జాషువ
పేజీలు 128 రూ.100/-




మనతరం ప్రజాస్వరం సి.వి
పేజీలు 296 రూ.200/-



వకుళాభరణం లలిత
పేజీలు 144 రూ.100/-




ఎన్.గోపి సాహిత్యానుశీలనం
పేజీలు 160 రూ.110/-




సాహితీ సుగంధం
పేజీలు 144 రూ.100/-




తెలుగు వ్యాస పరిణామం
పేజీలు 356 రూ.350/-




గైడి మొపాస - ఫ్రెంచ్ కథలు
పేజీలు 160 రూ.110/-



కథ - విమర్శ, విశ్లేషణ
పేజీలు 160 రూ.110/-



విషప్పురుగు
పేజీలు 160 రూ.110/-

## ప్రజాశక్తి బుక్‌హౌస్

27-1-54, కారల్‌మార్క్స్ రోడ్, గవర్నర్‌పేట, విజయవాడ - 2, ఫోన్ : 0866 - 2577533

**బ్రాంచీలు :** విజయవాడ, విశాఖపట్నం, తిరుపతి, గుంటూరు, కాకినాడ,ఏలూరు, విజయనగరం, ఒంగోలు, నెల్లూరు, కార్నూలు, అనంతపురం

If Un delivered please return to: Prasthanam, C/o M.B. Vignana kendram, 27-30-4, 3rd Floor
Akulavari veedhi, Governorpet, Vijayawada - 520002. Ph: 0866-2577248, Cell: 9490099059



**మనసు ఫౌండేషన్**

**పుస్తకాల పరిశీలనాపట్టిక**

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | PRSVMO2A191 |
| పుస్తకం పేరు | [illegible] |
| తారీఖు | 25/5/24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 69 |
| పెద్ద సైజు పేజీలు | No |
| ఖాళీ పేజీలు | No |
| లేని పేజీలు | No |
| తయారు చేసినది | Gayathri |
| పేజీలు విడదీసినది | Gayatri |
| స్కాన్ చేసినది | Gayatri |
| పరీక్ష చేసినది | |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | No |
| పరిస్థితి | good |